రామచంద్రరావు, పంగనామముల

# పల్నాటియుద్ధము

గుంటూరు, 1924

Record no. 766

Rāmacandrarāvu,
Paṅganāmamula

Palnāṭiyuddamu

Guṇṭūru, 1924

Record no. 766

రామచంద్రరావు, పంగనామముల.
పల్నాటియుద్ధము / గ్రంథకర్త పంగనామముల రామచంద్రరావు.- గుంటూరు : కన్యకా ముద్రాక్షరశాల, 1924.
6, iv, 124 p. ;21 cm.
Record no. 766

Rāmacandrarāvu, Paṅganāmamula.
Palnāṭiyuddamu / granthakarta Paṅganāmamula Rāmacandrarāvu.- Guṇṭūru : Kanyakā Mudrākṣaraśāla, 1924.
6, iv, 124 p. ;21 cm.
Record no. 766

# PALNATI  

#   YUDDHAMU.





*FIRST IMPRESSION.*

PANGANAMAMULA RAMACHANDRA ROW,

TEACHER, TOWN HIGH SCHOOL,

GUNTUR.

శ్రీ వేంకటేశ్వరార్పణ మస్తు.

# పల్నాటి యుద్ధము.


గ్రంథకర్త

పంగనామముల రామచంద్రరావు,

టీచర్, టౌన్ హైస్కూల్,

గుంటూరు.



గుంటూరు కన్యకా ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

రక్తాక్షి సం|| — చైత్రమాసము.

ఏప్రిల్ - 1924.


 [RE. 1—0—0.

ఓమ్.

# అంకితము.

ఈ పుస్తకము
శ్రీ తిరుపతివేంకటేశ్వరపాదకమలములందు
సమర్పింపఁబడినది.

గ్రంథకర్త,
పంగనామముల రామచంద్రరావు.

---

# ఉపోద్ఘాతము

కడచిన వేసఁగిలోఁ "బల్నాటి యుద్ధమును" బ్రారంభించి కొలఁదిదినములలోఁ బట్టువట్టి ముగింపఁదలఁచితినిగాని విఘ్నంబులెన్నియో కలుగుటచేఁ గొంత వ్రాసినవెనుకఁ జాలదినములవఱకు మఱల దానిని బయటికిఁ దీయ వలనుపడదయ్యెను. ఇప్పటికిఁ బూర్తియయినది. ఇందు నాకుఁ దోఁచిన ట్లక్కడక్కడఁ గథాభాగము మార్చితిని. సుమారు పదిసంవత్సరంబుల క్రిందటనే నాచేరచింపఁబడిన "భద్రాద్రి రామదాసు" అనుపద్యరూపకగ్రంథముగాని, యైదుసంవత్సరంబుల క్రిందట వ్రాయఁబడిన "కురంగి" యనుపద్యరూపకమైన నవలగాని వెలుతురు గాంచకపోయినప్పటికిని, గథాభాగంబు చిగురందకున్నను "బల్నాటి యుద్ధము" ముద్రాశాల నింతశీఘ్రకాలంబునఁ బ్రవేశించుటకు మహారాజశ్రీ బుద్ధిరాజు రామచంద్రరావు పంతులు (Head-master of the Town High School, Guntur) గారి ప్రోత్సాహబలంబే ముఖ్యకారణముగాని వేఱుగాదు. శ్రీవారికిని, ముద్రణావసరమునఁ బరిశోధించుటలో సహాయంబొనర్చిన బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రిగారికిని వందనసహస్రంబు లాచరించుచుఁ పాఠశాలల కుపయోగించునట్లు వ్రాయఁబడిన దగుటచే దీనిని దదధికారులు తమపాఠశాలలలో నిర్ణయించి నన్నంతరప్రయత్నంబులకుఁ బ్రోత్సహింతురని విశ్వసించుచున్నాను.

ఇట్లు విధేయుఁడు,
పంగనామముల రామచంద్రరావు,
గ్రంథకర్త.

# 'పల్నాటి యుద్ధ' కథాసంగ్రహము.

మ॥ అలుగురాజ్యపతి హైహయాన్వయుఁడు రేవాంబుప్రపూతావనీ
తలసామ్రాజ్యము శాత్రవుల్ గొనఁగఁ దీర్ఘవ్రాతసేవాకుతూ
హలుఁడై బాంధవమిత్రబృందములతోడై యుండఁగృష్ణాపగా
మలమా నయ్యమరావతిం జనె 'ముసల్మాన్' వృద్ధికాలంబునన్

ఉ॥ అంతకుమున్నె యాంధ్రనృపు లక్షయకీర్తిలతావతల్లికా
కాంతివిదేశు లొక్కొకరు రాజ్యము సేసిన పుణ్యభూమియన్
సంతతసత్ప్రవర్తనుల చల్లనినేలయటంచుఁ జూచి భూ
కాంతుఁడు తత్థలంబుననె కాఁపురముండఁదొడంగెఁ బ్రీతిమై.

గీ॥ నాఁడు వెలనాటిచోడుల నగరమయిన
చందవోలుననుండిన జనవిభుండు
దినములు గతింప మైలమాదేవిఁ గూఁతుఁ
బరిణయమొనర్చె నలుగు భూపాలమణికి.

క॥ వెలనాటి చోడభూపతి
నెలఁతకు మైలాంబకిచ్చె నిస్తులరాగం
బొలయ వివాహపువేళను
పలనా డరణంబుగాఁగఁ బ్రజలు నుతింపన్.

మ॥ అరణంబిచ్చిన పల్లునా డరిగి భార్యారత్నసంయుక్తుఁడై
గురిజాల్పత్తనసింహపీఠికపయిన్ గూర్చుండి బుద్ధిప్రభా
గురు రేచెర్లకులీను దొడ్డనను గైకొంచున్ నిజామాత్యుగా
ధరనేలెం గరుణార్ద్రుఁ డల్గునరనాథశ్రేష్ఠుఁ డత్యున్నతిన్.

వ॥ మఱియు నతండు,

ఉ॥ మైలమదేవిఁగాక యసమానకళాంచితలైన యిర్వురం
గేలుగ్రహించి మువ్వురకొగిన్ నలగాముఁడు మల్లదేవుల

న్బాలురు, నర్స, ఝుట్టి నరపాలురు పుట్టఁగ రాజ్యలక్ష్మి ధీ
శాలికి జ్యేష్ఠపుత్రుని కొసంగి చనెం ద్రిదివాభిలాషియై.

గీ॥ దొడ్డనాయఁడు నలుగు తోడ్తోడ నరుగ
నతని పుత్రుఁడు బ్రహ్మనాయఁడు మనీషి
బాహుబలగర్వవిక్రమప్రశమితారి
మంత్రియయ్యెను లోకసమ్మతముగాఁగ.

శా॥ వీరక్షత్రియదుర్జయప్రథితదోర్వీర్యప్రతాపస్ఫుర
చ్ఛౌర్యత్వంబులు గల్గు వీరవనితాచూడామణిన్ నాగమ
స్వైరన్ వర్తిలుదాని స్నేహమయి పృథ్వీశుం దమాత్యోత్తముల్
ధీరున్ రాజ్యమునుండి పోనడఁచె మద్దేవాదివర్గంబుతోన్.

ఉ॥ మాచెర్లన్ వసించి జనమాన్యుఁడు పిల్లలపక్షమూని ర
క్షాచతురత్వమేర్పడ యశంబుమెయిన్ ధర నేలుచుండ మా
యాచణ నాగమాంబిక ప్రియంబు నటించుచుఁ గోడిపోరునన్
రేచెరలాన్వయుం గెలిచి శ్రీఁ గొని కానలకంపె నెల్లరన్.

మ॥ గడువున్ సప్తశరత్తులం గడపి నల్గామక్ష్మానాథుఁ డు
న్నెడకున్ బ్రహ్మన రాయబారమును బాలిమ్మంచుఁ బంపించె నా
దుడుకుం గొమ్మ కుతంత్రవాగురులయందుం జేర్చి గుర్జాల్పురీ
శుని జంపించెను రాయబారిని ప్రజాస్తోమంబు నిందింపఁగన్.

మ॥ దురహంకారత రాయబారి నిటులం ద్రుంగించి గర్వించు ని
ష్కరుణవ్రాతముపైఁ బదాభిహతదుష్కాలాహిభంగిన్, సటా
సరయాకృష్టమహోగ్రసింహముక్రియం, జండర్తుమార్తాండభీ
కరరూపంబున బ్రహ్మనాయఁ డతిరక్తప్రస్ఫురన్నేత్రుఁడై.

గీ॥ కాలహరణంబు నోపక కాలరులను
రథతురంగేభభద్రతూర్యములఁ గొంచు
బ్రహ్మవీరుఁడు నల్గామప్రభ నడంపఁ
బోరు నెలవగు కార్యమపూడిఁ జేర.



శా॥ చాపానేకసముజ్ఝితాశుయశరాస్త్రక్ష్వేళలిప్తాగ్రధా
రాపర్యంతసముద్గతజ్వలననిర్యత్కీలికామాలికా
టోపంబుల్ చవిచూపుసంగరపటిష్ఠుల్ పెక్కులున్నారలన్
మాపోరాటము నెగ్గదంచు నలగామక్ష్మావిభుం డంతటన్.

ఉ॥ 'పాలును బంచియిత్తు నిరపాయవిధంబుగఁ; బొందు సేతయే
మేలు; గతంబు నెంచకుఁడు మీ' రని సంధికిఁ జెప్పి పంపె లో
నేలినభీతిచే; నటరహించినకోపశిఖల్ మరల్చి యా
వాలుమగండు బ్రహ్మన కృపామతి సమ్మతికిం దలంపఁగన్.

శా॥ బాహాబాహి రణంబునం దొడరు దీవ్యత్పౌరుషోపేతులా
సాహంకారులు పోటుబంట్లు స్వధనుష్పాండిత్యవీరోద్ధతో
త్సాహుల్ మేలన బ్రహ్మపుత్రుఁడు సమజ్యన్ బాలచంద్రుండు గ
ర్జాహుంకారసమేతకోపకలనాచంచద్వచస్సారుఁడై.

మ॥ "పెదమల్దేవసభాసదుల్! వినతు లర్పింతున్ వినుం డెల్లరో
ప్పుదలన్ సంధి కొసంగి, తోఁకముడువన్ భూమండలం బెల్ల న
వ్వదె? మీపౌరుష మేడ మంటఁగలిసెన్? వహ్వారె? కార్యంపురీ
కదనక్షోణికి వైరిహృత్పుటదళద్గర్జద్గజాళిన్, బదా
తిదళంబుల్ గొనివచ్చుటిందులకె? బుద్ధిన్ జాడ్య ముత్పన్నమై
కద యీసంధికి లొంగుచుంటి; రిఁక మీకాంతాదులున్ మీరు హా
యి దలిర్పన్ వసియింప కెందులకు నీపృథ్వీశునిం గొంచు స
మ్మద మొప్పం బడివచ్చినారు? నలగామక్ష్మాతలేంద్రుండు దు
ర్మదరోగంబున నాఁడు దానిదగుదుర్మంత్రాంగముల్ నమ్మి ము
న్నదయుం బంపిన రాయబారిని విషాహారంబుచేఁ జంపఁగాఁ
గద మీరందఱు వచ్చినారిటకు; భూఖండంబొసంగంగ మీ
హృదయాంతఃపరివర్తమానబహుళోద్రిక్తానవద్యోగ్రరా
జదమర్షాగ్నిశిఖాకలాపము లిఁకం జల్లారునే? యల్పస

మ్మదులారా! మొదలింటినుండియు విజృంభద్గర్వమైయుంటకా
క దురన్యాయము కోడిపోరితములోఁ గాన్పించి, ఘోరాటవీ
పదముంగూర్చినటక్కులాడిఁ బగగంపన్ బాలరండాలలా
మ దురుద్యోగిని నాగమం గదిసి యస్మన్మత్సరంబెల్ల వా
య దయాశూన్యతఁ జండతోమరగదావ్యాఘాతసంఘంబుచే
విదళింపన్ వలెఁ; గాని స్త్రీయగుట దోర్వీర్యంబుఁ జూపించి చం
పుదమన్నన్ మనకేకొఱంత; యెటులేఁ బోరిన్ సమీపించి తా
నెదురన్ గాయముఁ బుండుసేసి విడుతున్ హేలన్ వినుం; డామె క
భ్యుదయంబూన్చుచు రాయబారికి విసంబుం బెట్టు నాకుట్ర కా
స్పదమైయుండిన నర్సరాజును — సమజ్యాసన్నిసదాత్మీయశౌ
ర్యధురంతస్థిరధైర్యబాహుబలులారా! దుష్ప్రగల్భంబుగా
దిది నల్గాముని గుండెగాలమగున ట్లెట్లే నృసింహాధిపున్
మదహస్తిన్ హరిరీతిఁ బైఁగవిసి శుంభద్ధస్తశాతాసిచేఁ
గదనక్షోణి జనంబు తల్లడపడన్ ఖండింతు శీర్షంబు నా
దిదియేసుండి ప్రతిజ్ఞ; సేసితిని నే నీనాఁడు; పాలింతున
య్యది; బ్రహ్మాదులువచ్చి యడ్డయిన మాద్యత్ఖడ్గవిక్షేపమా
త్రదళచ్ఛాత్రివధైర్యకంచుకుఁడనై దర్పించి పోరాడనే
ర్చెద; వెన్కాడుటలేదు; నేనొకఁడనే చెండాడఁగానేర్తు; నాఁ
డుదిభంగిన్ శిబిరంబులందొడిగి పోటుంజూపకిట్లుండుటా?
మది కారాటము లేదె? యిం దసువులన్ మ్రగ్గించి దోర్దర్పసం
పదఁ జూపించి జనాళిమెప్పుఁగొనరే? పల్నాటివీర్యంబుఁ జం
పుదురే? పౌరుషహీనులార! యిఁక మిమ్ముంబాసి నేనొంటినై
న దురంబందుఁ బ్రతిజ్ఞఁ దీర్చుకొనఁ బ్రాణంబైన నర్పించెదన్".

ఉ॥ రోషకషాయితాక్షియుగరూక్షముఖాంబుజుఁడౌచు ధైర్యకృ
ద్భావలు బాలుఁ డీపగిదిఁ బల్కఁ జలీకృతపౌరుషప్రభా



వేషులు కోఱమీసముల వ్రేల్మిడి దువ్వుచు బృంహితంబులున్
హేషలు మిన్నుముట్టఁ బరువెత్తిరి వీరులు యుద్ధభూమికిన్॥

గీ॥ ఘోర వ్యూహములనుబన్ని మోహరించి
యిరు తెగలవారు జయరమాపేక్షులగుచు
యుద్ధశాస్త్రవిశేషమహోగ్రరీతి
సమరమునొనర్చి రమరు లాశ్చర్యమొంద॥

గీ॥ రెండుపక్షంబులందు నఖండసమర
శౌర్యముం జూపి యెందఱో సమయుచున్న;
నీడఁబోవని ధైర్యంబు లెసకమెసఁగ
సంకులతమంబుగాఁ బోరు సాగుచుండ॥

మ॥ అమితోన్మత్తగజేంద్రకుంభయుగపర్యంతంబుపై సింహశా
బము కుప్పించెడుమాడ్కి నర్సధరణీపాలున్ సమీపించి యు
గ్రముఖస్ఫూర్తి కరాంచలాంచితశరాగ్రప్రస్ఫురద్దీప్తితో
సమతంజూపఁగ బాలచంద్రుఁడెగసెన్, సల్పెన్ శిరశ్ఛేదమున్॥

శా॥ హాహాకారము దందడించె, నట బ్రహ్మాదుల్ దివిం జూడఁగా
బాహుద్వంద్వపరాక్రమస్ఫురణతో బాలుండు పోరాడుచో
సాహా! భాస్కరుఁడస్తమించుగతి రక్తాసిక్తమౌ భూమి నా
త్మాహారంబుఁ బిశాచపాళి కడి సంధ్యావేళ రూపాఱఁగన్॥

ఉ॥ నాయని దత్తపుత్రకుఁడనందగు కన్నమ మాలదాసుఁడుం
బాయనిపూన్కి సంగరము మధ్యతలంబున రేఁగుచున్న యా
నాయకురాలిపైఁ గవిసి నారసముల్ నిగుడించి బాహుగ
ర్వాయతచండమూర్తియయి బంధితఁ జేసె దళంబులుబ్బఁగన్॥

శా॥ పశ్చాత్తప్తహృదంతరాళయయి దౌర్భాగ్యంబు రూపెత్తఁగా
దోశ్చాతుర్యమదెల్ల బీఱువడు నాధూర్తాంగనారత్న మ

త్యాశ్చర్యంబు జనింపఁగా "శరణ" మం చా బ్రహ్మవీరాంఘ్రులన్
దుశ్చింతామతిలేక వేఁడుకొన సాధుత్వంబు జేకొత్తఁగన్॥

ఉ॥ కానకకన్నపుత్రకుఁ డొకండు భుజాపటిమంబుఁ జూపి యు
క్షీణబలాఢ్యులన్ సమరసింహులఁ జంపి గతింప దుఃఖివై
శ్వానరతప్తుఁడైన బలవంతుఁడు శాంతవిరాగియై కృపం
బూని ప్రబుద్ధుఁ జేసి పరిపూతమతిం బొనరించి పంపినన్॥

శా॥ వీరస్త్రీసమరావసానమును సంవీక్షించి నల్గాముఁడున్
గారుణ్యాంబుధియైన బ్రహ్మనకడం గన్పట్టి స్నేహింపఁగా
వైరుధ్యంబును బాయఁద్రోచి మలిదేవక్ష్మాపతుల్ బ్రుంగుటన్
ధీరున్ సింగపుగద్దెపై నిలిపి పృథ్విం బేర్మి నేలించెఁదాన్॥

క థా స ం గ్ర హ ము

సమాప్తము.



*

# A SUMMARY OF
# 'Palnati Yuddhamu.'



From time immemorial till a few decades back the country between the modern Nagpur and Jubbalpur was known as the kingdom of Chedi, rich with natural sources. Towards the close of the eleventh century Alugu Raju, the then ruling king is said to have been deprived of his royalty either by a Mahammadan incursion made into Chedi or by continual strife among the Hindu Rajahs.

Consequent upon the deprival of his all, Alugu started for south with his kith and kin and settled at Amaravati on the banks of the sacred Krishna. He then married into the royal family at Chandavole in the Guntur District and began to hold sway over Palnad, an endowment settled upon his wife by her parent. He married two more wives and they all brought forth no issue. He then adopted the eldest son of his minister Recherla Doddana. A few years after, the adopted son was slain in a battle; and in a short time fortune favoured the King with sons by all his wives.

Just at this time there lived in a village in Palnad a young widow by name Nagamma, whose extra-ordinary abilities and vast learning reached the ears of Alugu and his household. Nagamma or Nayakuralu, as she was otherwise aptly called, had been intent upon winning the favour of Alugu and paid her respects fo him at a propitious opportunity.

She had such a magnetic personality that in a few visits she entrapped the heart of the King and won his admiration. This inevitably led to her settlement at

Court and it was no wonder that, from behind the curtain, she influenced the entire administration of Alugu's Kingdom. When Alugu fell under the influence of Nayakuralu, Doddana, the accredited minister of the Court found his vocation gone and he prudently resigned his place in favour of his son, Brahma Naidu. Nayakuralu could not defeat the accession to power of Brahmanna because he was immensely popular with the people of Palnad. Within a short time of his coming to power the royal house suffered untold misfortunes resulting in the deaths of Alugu and his wives.

Thereupon Nalagamaraju, Alugu's eldest son was installed on the gadi and he began to rule the Kingdom with great pomp and splendour under the able and distinguished guidance of Brahma Naidu. Nayakuralu who could discern the future beforehand, had been from the beginning in alliance with Nalagamaraju even when his father was alive. She won complete mastery over him.

Secure of the good opinion of Nalagama Raju, she played the old game of poisoning the king's mind against the minister. Though a woman, she displayed wonderful and matchless diplomacy in her relations with the king and his step-brothers.

Seeing that he was not properly treated at Court Brahma Naidu won over the step-brothers of the King and pleading on their behalf secured for them a division of the Kingdom. Under his guidance the new Kingdom with its headquarters at Macherla began to flourish at such rapid strides that it excited the jealousy of Nagamma.

Consequently she left no stone unturned to cause worry and trouble to Brahma Naidu. To checkmate his



statesmanship and annex Macherla to Alugu's territory she cunningly planned a friendly tournament of a cock-fight between the rival Kingdoms of Macherla and Gurzala. As misfortune would have it, Brahmana's party suffered defeat and in the wake of Hindu tradition and in compliance with the preliminary agreement Brahmana and Malladevas, (Nalagama's step-brothers) had to relinquish their Kingdom and wander about in exile for a period of seven years.

While they sojourned in far off lands to spend these seven tedious years they were entangled times without number in several other vile activities of Nagamma; but all her intrigues were successfully met and overcome by Brahmana's party. Just when the period of exile was terminating, Brahmana sent out one, Alaraju as a royal ambassador to Gurzala for the rendition of Macherla.

Alaraju, who was related to both the parties repaired to Gurzala bereft of all considerations of relational ties and actuated by a strong will of fighting for truth. Before a large audience in the presence of Nalgamaraju and his cruel-hearted minister he pleaded in a speech replete with sympathy and reason for the rendition of Macherla. Alaraju's words wounded the susceptibilities of Nayakuralu and enraged her most.

Failing in his embassy Alaraju left Gurzala in a gloomy mood. While he was passing through a forest on his way to Cherlagudipadu he met his death in the hands of two disguised underlings of Nayakuralu under the guidance of the King's brother Narasingaraju, who had been from the beginning a fellow-intriguer with that treacherous lady.

Almost instantaneously the news spread like wild fire even to Macherla. Brahmana and his most valiant son, Balachandra and other renowned warriors of the day grew wild at the obvious treachery of the foe and threateningly intimated to Gurzala of the impending battle at Karempudi, whereat they proposed to humiliate Nayakuralu and make reprisal by killing Narasingaraju, the murderer of Alaraju.

Both parties met at Karempudi at the beginning of 'Karteekamasam'(between the years 1178 and 1182 A.D)and fought a most astonishingly dreadful fight resulting in the humiliation of Nagamma and the murder of Narasingaraju and the premature deaths of Balachandra and Malladeva.

At last Nalagamaraju, the King of Gurzala, out of sorrow for helplessness, appeared and knelt down before Brahmana, his late revered minister with a compromising tone of voice. Although depressed in spirit by the death of his son in this battle, Brahma Naidu compassionately and respectfully received him and reviewed Nayakuralu's character in public and personal affairs from the beginning with a characteristic stretch of memory of her evil doings and his (the King's) meek acquiescence to all of them.

Unable to refute his arguments he mildly kept quiet; and the generous Naidu magnanimously suggested that Nalagamraju, the only remaining powerful man in the royal family should occupy the throne of Gurzala- with Macherla now added to it-and pledged his hearty support to the King in all matters of the Kingdom. He finally insisted upon the banishment of Nayakuralu. Nalagamaraju accepted the gracious offer and within a few days afterwards became the supreme ruler of Palnad.

---

*

# పల్నాటి యుద్ధము.

## మొదటి యధ్యాయము.

అతివినిర్మలంబులయిన రేవానదీపరిపూతజలంబులచే సాగుబడి చేయఁబడుచుండు ముక్కారుపంటపొలములచే వ్యాప్తంబయి యీనాఁటి జబ్బల్పుర నాగపురమధ్యప్రాంతంబంతయుఁ బండ్రెండవ శతాబ్దంబునకుఁ బూర్వమునుండియుఁ జేదిదేశంబను పేరఁ బరఁగుచుండెను. అది పదునొకండవ శతాబ్దపుటంతంబునను దరువాతయును గార్తవీర్యార్జునవంశస్థులమని చెప్పుకొను హైహయులచేఁ బరిపాలింపఁబడుచుండెను.

వీరికే గళచురిరాజు లనికూడ నామాంతరముగలదు. పండ్రెండవశతాబ్దపుఁ బ్రారంభ సంవత్సరములలో హైహయవంశ్యుఁడైన యలుగురాజు రాజ్య మేలుచుండెను. ఆ దినములలో మహమ్మదీయ దండయాత్రలచే మనదేశమంతయు సంక్షుభిత మగుచుండెను. ఈ మహమ్మదీయ సంరంభము హిందూరాజు లనేకులకు హృదయశల్యమై వారిని బాధించుచుండెను.

అలుగురాజుగూడ మహమ్మదీయ దళంబులచేతనో, లేక పర హిందూరాజులచేతనో రాజ్యంబుఁ గోల్పోయి స్వజనంబుతో దేశము నుండి వెడలవలసి వచ్చెను. అంతటఁ దగుమాత్రము సైన్యముఁ దీసికొని యలుగురాజు సపుత్రమిత్రబాంధవ పరివారుఁడై నానాతీర్థంబుల సేవించికొనుచుఁ గృష్ణాతరంగిణీస్నానంబుఁగూడ నాచరించి గతకల్మషుఁడై యమరావతీపుణ్యక్షేత్రంబు దర్శించి తత్పత్తనస్థాపితశంభులింగమునకుఁ బూజలొనర్చి మహానందకందళితహృదయారవిందుఁడై యాప్రదేశంబుఁ బాసిపోనొల్లక యందే నివసింపఁ గృతనిశ్చయుఁడయ్యెను.

ఇట్లు కొంతకాల మతిక్రమించునప్పటికిఁ జిన్నవయసులోనున్న యలుగురాజునకు నిప్పటి గుంటూరుమండలములోని చందవోలులో రాజ్యమేలుచున్న ప్రభువు తన కూఁతురయిన మైలాంబనిచ్చి వివాహ మొనర్చి కూఁతునకుఁ బల్నా డరణముగా నిచ్చెను. అలుగురా జచ్చట రాజ్య మేల మొదలిడెను. ప్రజ్ఞావంతుఁడును, వీరాగ్రేసరుఁడును నైన రేచెర్ల దొడ్డనాయఁడను నొకవెలమ మంత్రిత్వము వహించెను. ఆతనికి భార్యయయిన శీలాంబయందుఁ బెద్దనాయఁడు, బ్రహ్మనాయఁడు, సూరినీడు, పేరినీడు, మల్లినీడు నను నేవురు పుత్రులు జనించిరి.

అలుగురాజు మైలాంబనే కాక వీరవిద్యాదేవి భూరమాదేవి యను మఱి యిర్వుర రాణులఁ బరిణయం బయ్యెను. చాలకాలము వఱకు వారెవ్వరియందు నలుగురాజునకు సంతానము గలుగ లేదు. అంతట క్షత్రియకులుఁడుగాఁ బరిగణింపఁబడుచుండు నలుగురాజు చతుర్థకులసంజాతుఁడయిన దొడ్డనాయని పుత్రుఁడగు పెద్దనాయని (ఇతనికి బాదన్నయని మఱియొక పేరు గలదు) బెంచుకొనుచుండెను.

బాదన్నను రాజకుటుంబమువారు శుద్ధాంతంబున నత్యంతానురాగంబుతోఁ బెంచుచుండిరి. కుఱ్ఱవానికి వయసు వచ్చెను. సహజకోమలతగల వనలతికలవలె నతనికి నూనూఁగుమీసంబులు పొడసూపెను. రాజపాఠశాలయందు బాదన్న ధనుర్వేదాదివిద్యలు కరతలామలకములు గావించికొనెను. అందు ముఖ్యముగా నశ్వవిద్యయం దతఁడు పరిపూర్ణముగ నారితేరెను. ఎట్టి యవిధేయతగల కంఖాణంబునైనను లొంగఁజేసికొను సామర్థ్యం బాతఁ డలవఱుచుకొనెను.

కొన్నిదినంబుల కాతనికి వివాహంబుగూడ నయ్యెను. తరువాతఁ గతిపయసంవత్సరంబులగు పిదప నలుగురాజు మువ్వురు రాణులు నదృష్టవశంబున గర్భములఁ దాల్చిరి. మైలమకు నలగామరాజు, వీరవిద్యాదేవికిఁ బెదమల్లదేవుఁడు, పినమల్లదేవుఁడు, బాలమల్లదేవుఁ



డును; భూరమాదేవికిఁ గామరాజు, నరసింగరాజు, ఝట్టిరాజు, పెరుమాళ్ళరాజు నను పుత్రులును గలిగిరి. వారిలోఁ గామరాజు, పెరుమాళ్ళరాజు చిన్నతనంబుననే చనిపోయిరి. మరికొన్నాళ్ళకు రాణులును గతించిరి. వారుపోయిన రెండు సంవత్సరంబులకు బాదన్నయు నొక యుద్ధంబులో మరణించెను. ఇట్లు కుటుంబకష్టంబుల మధ్య ధైర్యంబుఁ గోల్పోక యలుగురాజు తక్కుంగల రాజకుమారుల గారాబముతోఁ జూచుకొనుచు వారికి విద్య నేర్పించుచుండెను.

సుమంతుని మంత్రిత్వంబున దశరథమహారాజు పగిది దొడ్డనాయని మంత్రిత్వంబున నలుగురాజు ప్రజారంజకంబుగ రాజ్యమేలుచుండెను.

---

## రెండవ యధ్యాయము.

జిట్టగామాలపాడను నూరిలోని యొక పేదరైతు పొలములోఁ బనిచేసికొనుచుండ సమీపంబున నొక కంచెలో శిశురోదనము వినంబడుటచే నతఁ డటకుం బోయెను. ఒక యాఁడునిసు వందుఁ బడియుండుటఁ జూచెను. రామిరెడ్డి యా శిశువును బెంచుకొనఁ గొనిపోయెను. దానికి నాగమ్మ యని పేరుపెట్టుకొనెను. ఆ శిశు వాయింట నడుగువెట్టినదినముననే పేదఱికపు వెల్లిలోఁ గొట్టుకొనుచుండెడి రెడ్డికి దైవవశంబునఁ బెన్నిధియొకటి లభించెను. దీనికంతటికి శిశులాభశుభసమయంబే కారణంబుగ నెంచి యా బిడ్డను నతండు లక్ష్మీదేవిగ భావించుకొనుచుండెను. పెరటిలోఁ గల్పకంబుగలవానికి లోటావంతయు లేనట్లు దారిద్ర్యవిచ్ఛేదకంబైన ధనరాశిచే నతఁడు సకలసౌఖ్యంబుల నోలలాడుచు నితరులకుఁగూడ ననేకవిషయంబుల సహాయకరుఁడుగా నుండెను. నాగమ్మను నపరిమితప్రేమడోలికయందు నూఁపుచు నిస్సంతానుఁడయిన యా రెడ్డి యామె నెండ కన్నెఱుఁగనీకుండెను. ఇట్లు కొన్నిసంవత్సరంబులు గడచెను. ఆమె తన తోడిబాలికలతో నాడు

కొనునప్పుడు చూచిన ప్రతిమానవుఁడును నామె ప్రదర్శించెడు నసమానబుద్ధివిశేషము, మాయోపాయరచనానైపుణ్యము, నీఁడునకు మించిన విషయప్రసంగము, ననితరధైర్యగుణసంపత్తిఁజూచి ముక్కున వ్రేలిడుకొనుచుండెను. పూవుపుట్టినతోడనే పరిమళించును. చూచిన వారిలో జోస్యులెవ్వరేని నున్నచోఁ దద్గ్రహంబు సామర్థ్యంబుఁ దిలకించి యీయామె భావిజీవితమున ధీవైభవము వెలిఁబుచ్చి పురుషపుంగవులకుఁగూడ గుండెబెదరై పరిణమించునని లోలోన నూహించుచుండిరి. ఆమె చేష్టలు, చిన్నతనంబుననే యామె కనుపఱచు శౌర్యంబుఁ జూచి యీయామెను స్త్రీగానొనర్చి పితామహుండు తన పెత్తనపు బుద్ధిమాంద్యంబును స్పష్టీకరించుకొనెనని పల్కనివా రొక్కరునులేరు.

చతుర్థకులములోనివా రెందఱో తమ బాలబాలికల నూరిబడిలోనికిఁ జదువుఁ గఱచుటకై పంపకున్నను ననేకులు ప్రోత్సహించుటచే రామిరెడ్డి నాగమయొక్క విద్యాస్వీకరణంబున కెట్టిప్రత్యాఖ్యానముఁ జూపలేదు. ఆ బాల తారాకాంతులనణఁగఁ ద్రొక్కెడి చంద్రచంద్రికవలె బాఠశాలలోని బాలబాలికాగణంబులలో నప్రతిమబుద్ధివికసనముఁ గాన్పించుచు నొజ్జలమెచ్చులఁ జూఱకొనుచుండెను.

పంచదశసంవత్సరప్రాయంబు వెనుకద్రొక్కునప్పటికి నాగమ్మకుఁ బ్రాపంచికవ్యవహారనిర్వహణ విద్యాదక్షత పురుషులకంటె నెక్కుడుగా నలవడుట యటుండఁబై పెచ్చు బిరుదుమగ లనిపించుకొనఁగలవారి ప్రౌఢినిగూడ నొక చీరికింగొనని యపారధనుర్వేదపాండిత్యంబుగూడ లభించెను. బాల్యంబునఁ గ్రీడావిలాసంబులఁ గనంబఱచిన ధైర్యశౌర్యంబులు దన తోడునీడవలె నామెతోఁ బెరిగి దృఢత్వము వహించి యుండెను. పదునాఱేండ్లు ముగియునప్పటి కామెకేర్పడిన "పౌరుష"సూచకగుణములు ముదుసలియైన బ్రహ్మదేవునిపట్ల "ప్రమాదో ధీమతా మపి"యను నార్యోక్తిని విస్పష్టము గావించెను.



తరువాత రామిరెడ్డి యీయామె నొక ధనికుని కిచ్చి పరిణయం బొనర్చెనుగాని విధివశంబున నాతఁడును రామిరెడ్డియుఁ గాలగతిం జెందిరి. అయినను నాగమ్మ యీకష్టంబుల కంతగాఁ గలఁగక భవిష్యజ్జీవితాలోచనపరంపరలమునిఁగి తేలుచుండెను. పునరుద్వాహ ప్రయత్నంబుల మిషఁగల్పించి మన్మథుం డామెహృదయాధివాసంబు దిటంబుగాఁ బూనఁదలఁచినను నాగమయొక్క భవిష్యత్కాలఘనకార్యనిర్వహణాసక్తియందలి పట్టుదలచేఁ దన యసాధ్యపరాక్రమంబు కుంఠీభూతముగాఁగాఁ దన సంకల్పపరిణామము నిరర్థకమయ్యెనని వగచుచుఁ బూర్వమెన్నఁడో పరమేశ్వరునిచే నోటువడిన విషయంబు జ్ఞప్తికిఁదెచ్చుకొని యాఁడుదియైన నాగమ్మయుఁ దన్నోడించెఁగదా యని సిగ్గున నందుండక వదలిపోయెను.

జిట్టగామాలపాడునందే కాక తదితరగ్రామ సమూహంబులఁగూడ నాగాంబ వ్యవహారదక్షత, కార్యదీక్ష, పేరుమ్రోఁగెను. ఎవరికెట్టి కొట్టుతిట్టుకలఁతలు, భూసంబంధమైన వివాదములున్నను నవి యెల్ల గ్రామాలవారందఱు నీ నాయకురాలికడనే తీర్చుకొనుచుండిరి. గ్రామంబులలోని సమస్తవ్యవహారంబు లనునాలవాలంబునఁ దెలివితేట లను తేటనీటిచే సంవర్ధమానంబులయిన తద్యశోలతలు క్రమక్రమంబున సాధారణగ్రామంబుల దాటి రాజపత్తనమైన గురిజాలం బ్రవేశించుటయే కాక రాజాంతఃపురావరణంబులోనికిఁగూడఁ బ్రాకఁ జొచ్చెను. దొడ్డనాయఁ డెన్నియోసారు లామె సమర్థతలఁగూర్చి కర్ణాకర్ణిగా విన్నవిషయంబు లప్పుడప్పు డలుగురాజునకుఁ జెవి వేయుచుండెనుగాని భవిష్యద్విషయమాతని కింతయు గోచరింపలేదు.

పౌరవ్యవహార నిర్వహణ కార్యంబులకై గురిజాలకు నాయకురాలు తఱచుగా వచ్చుచుఁ బోవుచుండెను. వచ్చినప్పుడు మఱచిపోక యలుగురాజుయొక్క దివాణంబులోనికిఁ బోయి యాడిగంబొనర్చు

పరిచారికాబృందంబు ప్రాపువడసి రాజకాంతల దర్శనముఁ జేసికొని వచ్చుచుండెను. ఇంతవేర్పడిన నాయకురాలు తమ దర్శనమునకై వచ్చుటకు వారు సమ్మతించుచునే యుండిరి. ఇట్లే కొన్ని నెలలు కడవం బడిన వెనుక నాయకురాలి కలుగురాజుతోఁగూడ ముఖాముఖిఁ బ్రసంగంబొనరించుట తటస్థించుచుండెను. ఈ ప్రసంగంబు సాధారణ వ్యవహారంబులనుండి రాజకీయపరిస్థితులలోనికి దినక్రమంబునఁ బరుగిడెను. మంచియౌవనంబుచే నలరారు నీతరుణీమణి విలాసపురుషుఁడైన రాజన్యునితో వనవిహారంబులు మొదలగునవి యాచరించుచుఁ బ్రసంగించు జాడలు పల్నాటిలోని ప్రజలకుఁ దమ ప్రకృతులఁ బట్టి వేర్వేఱుగఁ దోఁచుచుండెను. కాని శరీరవ్యాయామాది పురుషక్రీడల చేతనే కాక కారణాంతరంబులవలనను నాయకురాలు కామబీజంబుల నాటుమన్మథుని నిదివఱకే త్రోసిరాజన్న వార్తలోని యాథార్థ్యమెఱింగినవారి కనుమానంబు లెంతమాత్రము జనింపలేదు.

నాయకురా లలుగురాజుతోఁ జేసిన స్నేహంబు దినదినప్రవర్ధమానమై రాజుగారి హజారంబులోని రాజకీయవిషయాలోచనంబుల యందుఁ బ్రతిఫలింప మొదలిడెను. అత్యధికప్రజ్ఞావంతుఁడయిన దొడ్డనాయఁడు మంత్రిత్వభారము వహించినను రాజునకు నాయకురాలికి మధ్యఁ బెంపొందిన పరస్పరవిశ్వాససామనస్యములచే మంత్రి యొప్పుదలవడసిన విషయంబులుగూడ నాయకురాలి పర్యాలోచనమునకు లోఁగవలసివచ్చుచుండెను. ఇట్లుండఁ గాలము పరుగెత్తుకొలఁది దొడ్డనాయనిచే నంగీకృతంబులయిన యనేకపత్రింబులు నాయకురాలి యనుమతిఁ బొందక మరలింపఁ బడవలసి వచ్చుటచే నాత్మగౌరవాసక్తిగల మంత్రిపుంగవున కొకించుక వెగటుగనుండెను. ఆవెగటు ద్వేషంబుగాఁ బరిణమించెను. నాయకురాలు సమయము దొరకినపుడూరకొనక తనకుఁగల యపారసాహచర్యంబుఁ బురస్కరించుకొని



యలుగురాజుతో నప్పుడపుడు — రాజు తనవాక్యంబుల విశ్వసించునని తోఁచినపుడు—దొడ్డనాయని కార్యనిర్వాహణ కౌశల్యంబు గీటునఁ బుచ్చుచు నొకింత యసూయ యాతనియం దుదయించునట్లు చేసెను. అగ్నికణం బెచ్చటనైన దొరకినచో దానినే మహాగ్నిగాఁ జేయఁగల యీనెలఁత రాఁదగిన సమయంబుల నిరీక్షించుచు నసూయఁ గోపాగ్నిగా మార్పించి యాయా వాక్ప్రౌఢిమంబు లనునింధనంబుల వేయుచు దినములవెంబడి దానిని బ్రజ్వలితానలంబుగా మండించెను.

ఇన్నిదినంబులనుండియు నీరక్షీరంబులవలెనున్న యీరాజమంత్రులు కొండొక వెలఁదికతంబునఁ బరస్పరవియోగ మొందవలసి వచ్చినట్లు కాన్పించెను. నేఁటికి రే పెంత సమీపముగనున్నదో కష్టసుఖంబు లొండొంటి కంత సమీపంబున నుండునని పెద్దలాడు వాక్యంబులు రిత్తగావు. నీటిలోఁబుట్టి పెరుగుచున్నను నీటిబొట్టునంటని తామరపాకువలె గురువిషయంబు లెన్ని గిఱికొనుచున్నను గాలచక్రం బవక్రగతిగఁ బరిభ్రమించుచునే యుండెను.

దొడ్డనాయనికి నాయకురాలి యెడను నామెనుబట్టి యలుగురాజునెడను వీరిర్వురికినాతనియెడను గోపసూచనలు బయల్పడఁజొచ్చెను. కంటకంబువచ్చి రంభాపత్రంబుపైఁబడినను రంభాపలాశంబు కంటకంబుపైఁబడినను నాయాకునకే నష్టంబగునట్లు రాజమంత్రులకుఁ బరస్పరమనస్పర్థలు పొడసూపినపు డమాత్యునికే నష్టమని యెల్లరకు విశదమే. కావున నింకెంతమాత్రము మంత్రిత్వంబున నుండుట గౌరవభాజనము కాదని దొడ్డన గ్రహించెను.

పల్నాటిలోని ప్రజాసంఘంబులు దొడ్డనాయని మంత్రిత్వంబును వేనోళ్ళఁబొగడుచుండెను. ప్రజాభిప్రాయంబు దొడ్డనాయని కనుకూలంబుగ నున్నదనియు — సత్యమున కెంతమాత్రము దూరముగాక పోయినను — మంత్రిత్వంబుఁ దా నాసించుచున్నట్లు జనులు పూర్ణం

బుగ గ్రహించినారనియు మదిందలపోసిన యావీరవనిత — యామాయోపాయధురీణ — ' యామైంద్రజాలికబుద్ధిపరిభావకచాతుర్యవిశేష — యానాయకురాలు రాజును బ్రోత్సహించి దొడ్డనాయని మంత్రిపీఠంబునుండి తొలఁగించి యావిష్టరంబు రాష్ట్రజనంబులలోఁ బ్రేమాస్పదుఁడుగ నుండిన బ్రహ్మనాయని కొసంగున ట్లొనర్చెను.

బ్రహ్మనాయఁడు తండ్రినిమించిన కొడుకు. ద్రోణాచార్యుని మించిన యర్జునుఁడు. వాల్మీకిరామాయణ మృదుశ్లోకంబుల మించిన నిగూఢార్థసారము. ఆతని కేమిలోటు ? ఆతనికి బుద్ధిబలంబెక్కుడో దేహబలంబెక్కుడో యెవరును విభేదింపలేకుండిరి. తండ్రిగారు మంత్రిపీఠం బలంకరించి యుండుకాలంబున బ్రహ్మనాయఁడు ప్రజాకష్టసుఖంబులు వారిలోఁ గలిసిమెలసి యుండుటచేఁ బూర్ణంబుగ గ్రహించియే యుండెను.

ఆకాలంబున శైవమత మొకవంకయును వైష్ణవమత మొకదిక్కునను దత్తద్బోధకులచే నిరంతరము వ్యాపింపఁజేయఁబడుచుండెను. మతవ్యాపనముపట్లఁ గలుగఁగల సంఘర్షణము లనివార్యములై యుండెను. అలుగురాజు, రాజపుత్రులు, నాయకురాలును శైవమతావలంబకులు. బ్రహ్మనాయఁడు వైష్ణవమతాసక్తిని మొదటినుండియు వ్యక్తీకరించుచునే యుండెను. అతఁడు వైష్ణవమతవ్యాపనమునకై యొనర్చిన ప్రజాసేవ యసమానమని చెప్పక తప్పదు. మంత్రిత్వంబునకు రాకపూర్వ మీ మహనీయుఁడు వివిధగ్రామంబుల వైష్ణవమతధ్వజంబుఁ బట్టుకొని తిరుగుచు మతోపన్యాసవాక్సుధామాధురిని బ్రేక్షకజనంబులకు రుచిఁజూపించుచు భగవద్భక్తివిషయంబులఁగూర్చి నెక్కివక్కాణించునపుడు ప్రజాహృదయంబులు పారవశ్యంబున సొమ్మసిల్లున ట్లొనర్చుచుండెను. కావున నతని యుపన్యాసధోరణి సాధారణజనంబు నెల్ల వశంబుగావించికొని నాయకురాలి తీవ్రదృష్టిఁగూడ నాకర్షింప



మొదలిడెను. కాని నాయకురా లాతని నేమిసేయఁగలదు ? బుద్ధిబలము దేహబలము నాయకురాలికంటె వేయిమడుంగులు మిన్న యనియు రాష్ట్రజనంబులకే కాక యామెకుఁగూడఁ దెలియును. తన యసాధారణయుద్ధనైపుణ్యంబుఁ బ్రదర్శించుట కనేకపర్యాయంబు లితరరాజుల పక్షంబున సంగ్రామరంగంబునకేగి చూపఱులగు దేవతలఁ గూడ నిర్విణ్ణులఁ జేసెను. తన నిశాతఖడ్గంబును జేత ధరించి కుప్పించి యుద్ధభూమిలోనికి నార్చుచుఁ బరుగిడెడి వేళ గంధసింధురంబును గన్గొని ప్రజలు చెల్లాచెదరగునట్లు సైన్యసముద్రంబు కలగుండువడి పాయవిచ్చి త్రోవనిచ్చెడిదని చెప్పినచో నాతని బాహుబలసంపద స్పష్టపడును.

ఇంతటిమహావీరుని గురిజాలయందే యుంచుకొని తాను మంత్రిత్వంబు వహించుట తనకే లాభకారికాదని నాయకురాలు యోచించెను. ఋణశేషము శత్రుశేషము మిగుల్చరాదు. ఉద్యోగంబును గూర్చియే కాక మతవిషయంబుననుగూడ బ్రహ్మనాయఁడు తలక్రిందఁ గొఱవియని నాయకురాలికిఁ దెలియును. కాని యలుగురాజు బ్రహ్మనకు మతవిరోధియగుటచేఁ దనకోర్కె సాగకుండునా యని మునుపటికంటె నెక్కుడుగా నలుగురాజుతోడి సఖ్యం బలవఱచుకొని వ్రేళ్ళ లెక్కతో దినములు వెడలఁ బుచ్చుచుండెను.

ప్రజారంజకుఁడైన బ్రహ్మనాయఁడు పీఠం బలంకరించినది మొదలు తన తండ్రియొక్క మనస్సువలెనే రాజకీయవిషయనిర్వాహణంబుపట్ల నాయకురాలు జోక్యము పుచ్చుకొనుచుంటచేఁ దన మనస్సుగూడఁ గలఁగఁ జొచ్చెను. ఏమిచేయుటకును దోఁచకుండెను. అలుగురాజున కామెయందుఁగల గాఢానురాగ మాతని నోరుమూసెను. దౌర్జన్యంబుచే నేదేనొక మిషఁగల్పించి రూపుమాపుదమన్న మతసారమైన నైతిక

సంపద యిట్టిపట్ల నాతనిఁ జేయెత్తకుండ మొద్దుబాఱునట్లు చేసెను. ఇంక నతఁడేమి చేయఁగలఁడు? దినములిట్లే క్రమించుచుండెను.

నాయకురాలు దూరదర్శినిగావున లోలోన దురాలోచనల మునిఁగి తేలుచు మొదటినుండియు నలుగురాజు కుమారు లందఱి కంటె నలగామరాజుపై నతిప్రేమరసంబు వెల్లి విరియించుచుండెను. ఇందుచేతనే నలగామరాజున కీమెయం దించుక యభిమానము, మలిదేవరాజుల కసూయ. చాలఁ బసివాండ్రగుటచే మలిదేవరాజుల నప్పు డప్పుడు బ్రహ్మనాయఁడు దగ్గఱకుఁదీసి బుజ్జగించుచుండెడివాఁడు. అలుగురాజున కెంత నాయకురాలిపై నభిమానమున్నను బ్రహ్మనాయని సమర్థత లెఱింగిన వాఁడగుటచే నాతనియం దాతనికిఁ దొత్త ద్వేష మంతగా లేకుండెను. కాని బ్రహ్మనాయనికి నాయకురాలి మాట మాత్రము గిట్టకుండెను.

ఇట్లు కొంతకాలంబు జరుగ నలగామునికి వివాహంబుఁ జేసి తన బిడ్డలను జక్కఁగాఁ జూచుచుండుమని బ్రహ్మనాయని కొప్పగించి యలుగురాజు కీర్తిశేషుండయ్యెను. ఆతనివెనుకఁ గొన్నిదినంబులకు దొడ్డనాయఁడుగూడ నంతరించుట తటస్థించెను. అలుగురాజు చావునకై నాయకురాలును బ్రహ్మనాయఁడును జింతించిరి.

రాజులేని రాజ్యంబుంట పాడిగాకుంటచే బ్రహ్మనాయఁడు మొదలగువారందఱుఁ గలిసి యొక శుభముహూర్తంబున నలగామ రాజును గురిజాల సింహాసనాసీనుం జేసిరి. నలగామరాజు రాజచిహ్నంబులన్నియు ధరించి పల్నాటిరాజ్యంబును బ్రహ్మనాయఁ డండగనుండ నిర్భయంబుగఁ బరిపాలించుచుండెను. జనసంపద శుక్లపక్షచంద్రికవలె దినదినాభివృద్ధిఁ జెందుచుండెను. మత విషయంబుల బ్రహ్మనాయని యందు నలగామునికించుక ద్వేషముండెను గాని నాయనిపరిపాలన కార్యకౌశల్యంబు దానిని మఱుఁగువడఁ జేసెను. అలుగురాజు మృతి



నొందఁగానే నలగాముఁడు మంత్రియాలోచనంబుతో రాజకీయసంస్కరణ నిమగ్నుండై యుండుటచే నతనికిని నాయకురాలికిని సాధారణమైన స్నేహమే కాని తండ్రికున్నంత నంటులేకుండెను. అందుచే విరోధరహితమైన మంత్రిపదంబు వడయుటకై లోలోన విశ్వప్రయత్నంబులు చేసెడి నాయకురాలు రాజుతోడి సంబంధమెక్కుడగుటకై సమయము వేచియుండెను.

---

## మూఁడవయధ్యాయము.

సింహాసనం బధిష్ఠించి పరిపాలనవ్యవహారములు చక్కఁబఱచిన కతిపయదినంబులకు నలగామరాజు సప్తవ్యసనంబులలో నొక్కటి యయిన వేఁటకై తత్సాధనంబులు సమకూర్చుకొని దూరారణ్యంబు నకుఁబోయెను. అచ్చటఁ దోడవచ్చిన భటసమూహంబు నాడాడ కుంబంచి నిరంతరంబుగ శరంబుల వర్షించెడి సింగిణినొకదానిని వెనుక సంధించి యర్జునుని గాండివంబుతో సమానంబయిన కోదండంబును బ్రచండకాండంబులను జేతధరించి నడికట్టున కించుకంతదిగువ శాతధారా కాంతిగురియు ఖడ్గంబొండు వ్రేలాడుచుండ శైవమతాభిమానం బుట్టిపడు మొగంబుతో మృగయాభిలాషియయిన తనగజేంద్రం బెక్కి యాతం డాకాంతారంబుమధ్యభాగంబునకుం జొచ్చి భల్లూకశార్దూలాది వనసత్త్వంబులనెల్లఁ బ్రతిదినంబు నుక్కడంచుచుండెను. ప్రకృతి వైచిత్ర్యంబుల నలరారుచుండు లతాలతాంతవేష్టితతాపింఛవృక్షంబులనడుమఁ బల్లవుఁ బ్రదేశంబుల నాకుసెజ్జపైఁబరుండి ముఖభ్రూవిక్షేపాదులు లాఁతులకు భయంకరత్వం బాపాదించుచున్నను సమస్త ప్రాణిలోకంబునకుఁ గాణాచియై ప్రపంచపరిపాలకంబయిన హృదయజనితనిర్భరప్రేమంబున శాబకంబులఁ జేసేతస్పృశించుచు మూర్కొనుచుండు నాడుపులులను, నైతికవిద్యావిరహితమైన పాఠశాలలోఁ

గఱచుచుఁ బెద్దలఁ దృణీకరించుచు నెంతవారిని గణింపనట్టి విద్యార్థుల భంగిఁ గంటికిఁ గన్పడిన యున్నతవృక్షశాఖల నెల్లఁ దమ తొండంబులఁ బోనడంచుచుఁ గ్రొవ్వెక్కి తిరుగాడు మదపుటేనుంగులను, బర్వతకందరంబులలోఁ బగటిని జూపోపక డాఁగి భార్యలతోఁ గిశోరంబులతో సరససల్లాపంబులఁ దేలు భీకరపంచాననంబులను ననేకంబులగు నితరమృగచయంబులను, నతఁడు వెఱపులేక ఖడ్గాదిసాధనంబులకు బలివెట్టి శౌర్యపటిమంబున విరాజిల్లుచు నొకనాఁటి మధ్యాహ్నంబునఁ ద్రోవఁదప్పి యెంతసేపటికిని వెనుకఁ జిక్కిన భటసమూహంబును గలియఁజాలక పోయెను. వసంతర్తుసూర్యుని వేఁడిమి పయిపయిం బడుచుండ మృగయాయాసంబు శరీరంబును బడలువడఁజేయ సుకుమారుండును స్ఫురద్రూపియునైన యాభూమీశుండు చెమ్మటముత్తెంబులఁ గార్చుచు నోరెండియుంటచే సారెసారెకు నాలుక చప్పరించుచు మార్గంబు వట్టి కొంతదూరంబువచ్చి యెచ్చటనైన నీటికొలను కలదేమోయని గజంబుపైనుండి నల్వంకలఁ బాఱఁజూచుచుండెను. ఇంతలో నెక్కడనుండియో నడుమున రంగుల నీనెడి కాశతోడను నొడలిపై సరిగంచు పట్టాంశుకంబుతోడను బృష్ఠభాగంబున లంబించుచున్న పట్టాకత్తితోడను యించుక పట్టుదాటిన యౌవనంబుతోడను స్త్రీత్వంబును గప్పిపుచ్చెడి పౌరుషంబుతోడను విరాజిల్లుచు నిగ్గులఁ దేఱెడి యొక శ్వేతాశ్వంబెక్కి వచ్చుచున్న యొకవ్యక్తి యాతని దృష్టిలోఁ బడెను.

నలగాముండును దౌర్బల్యంబును మించిన యాశ్చర్యంబుతో నాపురుషునివంక — కాదు కా దాపగానివంక — ఱెప్పార్పక చూచుచుఁ దుదకు గుర్తించి దిగి సమీపంబునకు రాఁగానే చేరఁబోయెను. ఆవచ్చినవ్యక్తియుఁ దనవాజిని దిగి ప్రభువునకు నమస్కారంబు గావించి కుశలంబడిగి పిపాసావేదనాసంతప్యమానమానసుఁడయిన యానృపతిచంద్రుని గజారూఢుం గమ్మని తానును దురికీ నధిరోహించి చేరువలో



నున్న చలిపందిరికడకు నొకత్రుటిలో నాతనిఁ దీసికొనివచ్చెను. అక్కడ నంతకుఁ బూర్వమే కుటిలోపాయంబులచే నేర్పరింపఁబడిన సుధారసంబనందగిన నీరంబుచేతను షడ్రసాన్నంబులచేతను నామె నలగామునికిఁ జక్కని యాతిథ్యమిచ్చి సంతృప్తిపఱచి యింతలో వెనుకనుండి వచ్చుచున్న భటనికాయంబునకుఁ గూడఁ గూడుఁ బెట్టఁదగువారి నియమించి శయనోచితాసనంబునందున్న రాజుతో నుచితప్రసంగంబులాడుచుఁ దానిట్లు రాజభక్తిం గన్పఱచి తనజన్మంబు నాఁటితోఁ గృతార్థతం జెందించుకొనెననికూడ వాక్రుచ్చి నలగాముని మనస్సంతోషంబును జూఱగొనెను. నలగాముఁడును దనదౌర్బల్యంబును బాపి మనోహరమయిన యాతిథ్యమిచ్చి రాజభక్తిఁ గనఁబఱచెఁగదా యని యెక్కడలేని ప్రేమరసంబుఁ గురియుచు నామెపై నతివిశ్వాసంబుఁ జూపుచు సూర్యుం డస్తంగతుండు గాఁగానే భటచయంబులు వెంటరాఁగా నామెకొక గజంబిచ్చి తానొక యేనుంగెక్కి యిరువురు సరససంభాషణంబులతో రాజధానిం బ్రవేశించిరి.

తన భవిష్యదుద్యోగంబునకై యత్నించుచు నలగామరాజు గాఢాభిమానంబే దానికి మూలమని యెఱింగిన యానాయకురాలు నలగామునికి నిర్జనారణ్యంబున రాజభక్తివ్యాజంబున నాతిథ్యమిచ్చి వలలో వేసికొనెనని బ్రహ్మనాయుఁ డెఱింగి మిన్నకుండెను.

కొన్నిదినంబులగునప్పటికి నలగామునికి నాయకురాలిపై నతివిశ్వాసంబు గలుగఁగా రాజకీయవిషయంబులపైఁ గూడ జీతముబత్తెము లేక నిరుద్యోగినియైనను నామె దొరతనంబు సాగించుచునే యుండెను. పొరపాటు. జీతములేల బత్తెములేల? లక్ష్మీదేవినే వక్షోభాగంబున నిడుకొన్న పుండరీకాక్షుని కెట్టి కొఱఁత? రాజ్యధనంబుయొక్క మూర్తియయిన నలగామరాజునే కరతలామలకాయమానునిగాఁ జేసి యాడించుచున్న యామెకు ధనంబున కేమి లోటు?

అరణ్యంబున నాతిథ్యమిచ్చునవసరంబున రాజు తృప్తిం జెంది వరంబు వేఁడుమనియడుగఁగా ఘటికాకాలమాత్రంబు సింహాసనాసీనతఁ బ్రసాదింపుమని యామె యడిగెనఁట. రాజంతట వల్లెయని గురిజాలం జేరిన కొన్నాళ్ళ కావరంబును సఫలీకృతంబుఁ గావించెను. ఆగడియ లోన రాజకీయవిషయంబులన్నియుఁ జక్కఁగా గుర్తెఱింగిన నాయకు రాలు జనులవిశ్వాసంబు నాకర్షింపఁ బ్రజాసౌఖ్యదాయక సంస్కరణం బొకటిఁ గల్పించి దానిని నెరవేర్చు ప్రయత్నంబులఁగూడఁ జేసి యా పీఠంబునుండి దిగెను. ఆమెపైఁగల రాజాభిమానంబు సింహాసనాసీనత వఱకుఁగూడఁ దెచ్చెనాయని బ్రహ్మనాయని హృదయము కడుంగడుఁ గలంగెను. నాయకురాలు వట్టికపటపుఁ జేష్టలకుఁ బుట్టినిల్లనియెఱింగిన యాయమాత్యశేఖరుం డామె మునుముందు దేశము నెట్టిస్థితికిఁ దెప్పించునోయని విచారపడుచుండెను.

రాజేంద్రునికి నాయకురాలియందుఁగల విశ్వాసాభిమానము లలుగురాజు కాలంబునాఁటికంటెఁ గృష్ణపక్షతమఃపరంపరలమాదిరి హెచ్చుగుచుండెను. విశేషధనంబు వెచ్చించుటచేతను నితరసహాయ వాగ్దానంబులచేతను బ్రజాసౌఖ్యం బాసవెట్టుచుఁ గొంతకొంత రాష్ట్రంబులోఁ బలుకుబడి సంపాదించుటయేకాక నాయకురాలు తనపై నభిమానముఁజూపు నొక కక్షఁ బల్నాటిరాజ్యంబున నాడాడ లేవఁదీసెను. ఇట్టికక్షకు శైవవైష్ణవమతసంఘర్షణముఁగూడఁ గొంత వఱకుఁ గారణంబయ్యెనని చెప్పవచ్చును.

నాఁడు నాఁటికి బ్రహ్మనాయనికి నుద్యోగనిర్వహణము దుర్భర మగుచుండెను. పెద, చిన, బాల, మల్లదేవులయందు నాయనికి మొదటినుండియుఁ గడుఁబ్రేమ. అమాత్యపదంబు వదలినచో వారిని గూడఁద్యజించి పోవలసివచ్చును. తాను జిన్నటనాఁటనుండియుఁ బ్రేమా స్పదులఁగాఁ జూచుచుండిన మల్లదేవుల— దాను వెడలినచో—నాయ



కురాలు దురవస్థం జిక్కించునని బ్రహ్మనాయఁ డెఱింగియుంటచేఁ గాలుసేతులాడక యట్లే కాలముఁగడపుచుండెను.

స్నేహభావంబుననే నలగామరాజు సమక్షమందున నాయకు రాలు రాజకీయవిషయాలోచనంబుఁ జేయుచు నమాత్యుని వ్రాతలు లోపభూయిష్ఠంబులని చెప్పుచుండెను. సాధారణదీపకాంతికిని విద్యు ద్దీపప్రకాశంబునకుఁగల తారతమ్యంబువలెఁ దనమేధాశక్తికిని బ్రహ్మ నాయని మేధాబలంబునకును హస్తిమశకాంతరంబు గలదని నాయకు రాలికిఁ బూర్ణంబుగఁ దెలియును. అది నలగామరాజునకుం దెలియును. కాని వివిధప్రసంగంబులయం దామె పరిపాలననిర్వాహకయుక్తి వ్యూహంబులఁ బన్నుచున్నప్పుడు నలగాముఁ డామెను బుద్ధియందు బృహస్పతితోఁ బోల్చుచుండెను.

నాయకురాలి పెత్తనంబులు కార్యరూపంబు దాల్చుచుండుట తోడనే నిరవధికశేముషీసమంచితుండయిన బ్రహ్మన్నయొక్క దొరత నంబు సన్నగిలుచుండెను. అయినను దానాపదమునుండి జాఱుటకిష్ట మున్నను బైఁజెప్పఁబడినట్లు మలిదేవులపైఁగల గాఢాభిమానంబు చేతను, జనిపోవునప్పు డలుగురాజు మలిదేవాదులఁ గనిపెట్టుచుండు మని శాసించియుండుటచేఁ బెద్దలమాట గీటునఁబుచ్చుట పాడిగాకుండు టచేతను, దాను లేకుండినచో మాయోపాయవిశారదయు స్వకీర్తిప్రద ర్శకకార్యారంభయునగు నాయకురాలిచేతిక్రింద దేశము ప్రతిభను గోల్పోయి యెట్టికడగండ్లఁ గుడుచునో యను భీతిచేతను బ్రహ్మనా యఁడు బోనులోఁబడిన సింగంబువలెఁ బ్రొక్కిసలాడుచుండెను.

నాయకురాలికి నమాయకులగు మలిదేవులపైఁగల ద్వేషము నలగామునితోఁగల సాహచర్యంబునకుఁ దోడునీడగ నుండెను. వారిని ద్వేషించుటలో ముఖ్యకారణము బ్రహ్మన్నవారిపై నతిప్రేమంబుఁ జూపించుచు వారి పక్షంబువహించుచుండుటయే కాని వేఱుగాదు.

పోనీ బ్రహ్మన్న వారిపక్షంబు విడుచుచో రాజునకు సవతితల్లి బిడ్డలయిన వారిని నామె తుదకెట్టియధోగతికిఁ దీసికొనివచ్చునోయని యమాత్యుఁడు లోలోనఁ దల్లడిల్లుచుండెను.

నాయకురాలికి బ్రహ్మనాయనితోఁ బాటు రాజహర్మ్యంబులలో నొక విశాలసౌధం బునికికై నలగామునిచేఁ బ్రసాదింపఁబడెను. అందుండి యామె వివిధకుటిలోపాయంబులతోడను రాజుతోడి నిరంతరప్రసంగంబులతోడను గాలముఁ బుచ్చుచుండెను. మలిదేవుల నభిమానించిన ప్రజాకక్షయొకటి బ్రహ్మన్న యీవలకే నెలకొల్పియుండెను. అయ్యది నాయకురాలి చేష్టలచే నానాఁటికిఁ దీవ్రమగుచుండెను. నాయకురాలి కక్షకును బ్రహ్మనాయని కక్షకును నపుడపుడు సంఘర్షణము జరుగుచునే యుండెను. పెదమల్లదేవుని, చినమల్లదేవుని, బాలమల్లదేవుని బురస్కరించుకొని రాష్ట్రజనాభిప్రాయంబు ననుకూలపఱచుకొని నలగామునిడించి యెన్నటికైన రాజ్యతంత్రజ్ఞుఁడైన బ్రహ్మన్న మల్లదేవునికి సింహాసనాసీనతఁ బ్రసాదించునేమోయని నాయకురాలికి భీతిగానుండెను. అందుచేత రాజునకుఁ దనపై నతివిశ్వాసంబుఁ బుట్టించి మలిదేవులపైఁ గొండెంబులు చెప్పి వారిని రాజధానినుండి వెడలనడపించుచో బ్రహ్మన్నగూడ వారిపక్షంబు వహించి గురిజాలనుండి పోఁగలఁడని నాయకురాలు యోచించుచుండెను. నలగామున కీవిషయంబు లెవ్వియు నంతగా మనస్సునకు గోచరింపలేదు. ఇట్లు దినంబు లతిక్రమించుచుండ రాజసౌధంబుల నెల్లెడ విహరించుచుండు నీ వీరవనిత మలిదేవుల విషంబుఁ బెట్టి రూపఱఁ జేయుటకు మనసులో నాలోచనము లొనర్చుచుండెను. బుద్ధిశాలియు సూక్ష్మగ్రాహియు నైన పెదమల్లదేవుఁ డీవిషయం బించుక పసిపట్టెను. బ్రహ్మనాయని కంతట మల్లదేవుఁ డీరహస్యంబు నేకాంతంబుగా నివేదించెను. కృత్రిమాలోచనంబుల నాయకురా లెంతవఱకైనను లాగఁగలదని గ్రహించిన బ్రహ్మా



నాయఁడు దీనిని సంపూర్ణంబుగ విశ్వసించి మల్లదేవులకు జాగరూకత హెచ్చరించుచుండెను. నాయకురాలికి బ్రహ్మనాయనికి రాజకీయాలోచనసంఘర్షణమొకనాఁ డతితీవ్రరూపముఁ దాల్చెను. చేతులుకలియు నంతటిస్థితికి వచ్చెను. కాని నాయకురాలాఁడుదియగుటచే బ్రహ్మనాయఁడు చేతినిడించి యూరకుండెను. ఆసంఘర్షణంబుఁగూర్చి నలగామునికమాత్యుండు తెలుప రాజుమనస్సు నాయకురాలి పక్షంబునకే వంగెను.

బ్రహ్మన్న యిఁక నటనుండి లేచి పోవుటయే యుత్తమమని గ్రహించి మాట వృథాయగుననియు రాజువిశ్వసింపఁడనియుఁ దెలియుటచే మలిదేవాదులపై నాయకురాలు విషముఁ గ్రక్కుచుండు ప్రయత్నంబులు రాజునకు నివేదింపకయే వారికి (మలిదేవులకు) రాజ్యంబునఁ గొంత భాగమిచ్చినచో వారితోఁబాటు తానుగూడ నూరినుండి వెడలిపోయెదనని నాయఁడు పలికెను. అంతట రాజవిశ్వాసంబను నిశ్రేణికచే సంతోషసౌధంబు గొనవట్టఁ బ్రాకిన నాయకురాలు తత్క్షణము నలగాముని బ్రోత్సహించి మాచెర్లమండలంబు వారికిప్పించెను.

గురిజాలనుండి సాధ్యమైనంతత్వరలో వెడలుటయే మేలని తలంచిన బ్రహ్మన్న గురిజాలలోఁ బ్రజాసమావేశంబుగావించి నాయకురాలి చేష్టలన్నియు నుగ్గడించి శైవమతాభిమానుల యభిమానంబుఁగూడఁ గొంతవఱకుఁ దనపక్షంబునకు నాకర్షించి యెల్లరకు వీడ్కోలు కేల్మోడ్పుల నొసంగి గురిజాలరాజ్యం బేయవస్థకువచ్చునో యని కన్నీరుఁ గార్చుచు మలిదేవులఁ దీసికొనిపోయి మాచెర్లలోఁ బ్రవేశించెను. ఇచ్చట గురిజాలలో నాయకురాలి మార్గంబు నిష్కంటకమై యుండుటచేఁ గాలవ్యపాయంబింతయులేక మంత్రిపీఠం బధిష్ఠించి యామెరాజ్యకార్యంబులు నిర్వహించుచుండెను.

## నాలుగవయధ్యాయము.

"శ్రీకృష్ణ భగవానుఁడు గీతాశాస్త్రంబునందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజాతులు నాలుగును గుణకర్మవిభేదంబుల ననుసరించి సృష్టింపఁబడినవని స్పష్టీకరించినాఁడు. ఎవరెవ్వ రేయేవృత్తుల నవలంబించి యేయేగుణంబులతోఁ బ్రవర్తించుచుందురో యాయా ప్రవర్తనంబుల ననుసరించి "వీఁడు బ్రాహ్మణుఁడని—వీఁడు శూద్రుఁ" డనియు నిరూపింపఁ బడినట్లు తెలియవచ్చుచున్నది. అంతియకాని పుట్టుకతోడనే బ్రాహ్మణుఁడుగను శూద్రుఁడుగను మానవుఁడు పుట్టుటలేదు. ఒకవేళ మనమందఱము నామమాత్రబ్రాహ్మణులముగా జనించినను యథార్థతచే మన ప్రకృతులే మనవర్ణమును నిరూపించును. ఏయే జాతి పూరుషుఁ డెట్టివిధినియమముల నిర్వర్తింపవలెనో స్మృతులలో సూత్రంబులు లిఖింపఁబడియున్నవి. బ్రాహ్మణునికి సంబంధించిన ధర్మసూత్రంబులు వేనవేలున్నవి. అందులో నేఁటికాలపు నామమాత్రబ్రాహ్మణులు వానిలో నొకవంతుఁగూడ నాచరణలోఁ బెట్టుచున్నారని చెప్పవలనుపడదు. మనధర్మంబులఁగూర్చి యొక్కింతయు శ్రద్ధవహింపము గాని పరులయెడధర్మలోపంబులను బ్రవర్తనలోపంబులను గనిపెట్టుచు నసూయఁ బెంచుకొనుచు "నగ్రజన్మమును" నేతిబీరకాయగఁ జేసికొనుట యందఱెఱింగిన విషయమే.

హిందూదేశమునందుఁ జతుర్వర్ణంబులుగాక పంచము లనువేఱొకజాతివారు గలరు. వారు ప్రతిగ్రామంబునను గుటుంబములతో నివసించుచున్నారు. కాని వారిదురవస్థ వర్ణనాతీతము. వారి దీనదశావిధానమునుజూచి హృదయముగల ప్రతిమానవుఁడును గంపింపవలసినదే. వారస్పృశ్యులనియు నందఱితోఁ గలిసిమెలసి తిరుగరాదనియు మనపూర్వులు శాసించినారు. అందుచే వా రూరివెలుపలనుండి తమకంటెఁ గ్రూరత్వంబునను దుష్ప్రవర్తనంబునను వేమడుంగు లతిశయిం



చినవారు తదితరజాతులయందుండినను వారితో నెట్టిసంబంధమును లేకుండ వేఱుచేయఁబడిరి. నూతులముట్టరాదు. సర్వసమత్వవిభాసియు నిరాలంబుఁడును నగు భగవంతుని నారాధింప జాతిమతభేదంబులు లేక మానవులెల్లరును నర్హులు. అట్టిచో బ్రాహ్మణులు వారిని దేవాలయంబుల చెంతకే రానీయకుండుట శోచనీయము. స్మృతులు వ్రాయు కాలమునాఁటికి బ్రాహ్మణస్థితివర్తనంబులఁ బట్టి చూచిన నాకాలపు ఋషు లట్లుసూత్రీకరించుట వారికి మంచిదిగాఁగన్పట్టినను బ్రాహ్మణజాతి కాలక్రమంబున ధర్మసూత్రాచరణముపట్ల నధఃపతనముఁ జెందుచుండియు మానవజన్ములయిన పంచముల శ్వానంబులకంటె నీచతరంబుగఁ బరికించుట మిగుల గర్హ్యమనిచెప్ప సాహసించుచున్నాను".

అని పల్నాటి వీరపుంగవుఁడయిన బ్రహ్మనాయఁడు బోధించుచు వైష్ణవమతవ్యాపనంబునకై కొన్నిదినంబు లూరూరఁదిరుగుచు నుపన్యాసవర్ష పరంపరలఁ గురియుచుండెను. పంచములపట్ల నెల్లరును సర్వసమత్వభావమును వ్యక్తీకరించుట పాడియని సకారణంబుగ నిరూపించుచుండెను. ఏప్రయత్నంబులందైనను బురాతనమార్గంబు బదులు నూతనమార్గం బనుగమించుటకు మానవుఁడు సులభంబుగ నిచ్చగింపఁడు. దానికొఱకై యెన్నియో విశ్వప్రయత్నము లొనర్పవలయును. అట్లయినను నందఱమెప్పించుట దురూహ్యము.

బ్రహ్మనాయఁ డీయుద్యమంబులోఁ బ్రవేశించి ప్రబోధ మొనరించుచుఁ బంచమోద్ధరణముఁ జేయుచు వైష్ణవమతవ్యాపనముఁ జేయుచున్న కాలంబున ననేకబ్రాహ్మణసంఘంబు లాతని నిందించుచు స్పర్థవెడలఁగ్రక్కుచు నాతనివాదంబును బూర్వపక్షమొనర్పఁ బ్రయత్నించుచుండెను. ఇట్టివివాదంబులు ప్రత్యుద్యమంబునందును గలుగుచుండును. ఇట్లే మనబ్రహ్మనాయఁడు పూర్వాచారపరాయణులగు బ్రాహ్మణజనంబుల నిందావాక్యంబులకు గుఱియైనను మొత్తమీఁదఁ

గొలఁదిగనో గొప్పగనో యీ వైష్ణవమతంబుఁ బ్రబలఁజేసి యనేక పంచమకుటుంబాలవాలంబుల భక్తిజ్ఞానవల్లికల నిండార విరియఁజేసిన మాటమాత్రము వాస్తవమని చెప్పకతప్పదు.

బ్రహ్మనాయఁడు తనభార్యామణియైన యైతాంబతో సర్వసౌఖ్యంబుల నోలలాడుచుండెను. ఆమెను వివాహమయిననాఁటనుండియు నాతనికి సంవత్సరంబులు దినమ్ములుగాఁ బరిణమించుచుండెను. దీనికంతటికి నిదాన మాపురంధ్రీరత్నముయొక్క భర్తృతాత్పర్యము, పుట్టుకతోడనే యేర్పడిన సకలసద్గుణసంపద్విలాసంబులు నన్నిఁటి కన్నమిన్నగా వికసించి సౌశీల్యపటిమకు మెఱుఁగువెట్టిన దైవభక్తిప్రవర్ధనంబును మొదలగునవియేకాని వేఱుగాదు. దాంపత్యధర్మం బవలంబించి యైతమ్మయు బ్రహ్మనయు ననేకసంవత్సరంబులు గడపిరి. కానిచంద్రునిలో నైల్యంబువలె నగ్నిలో ధూమరేఖపగిది రసాలఫలంబునందు విత్తుకరణి వారిభోగభాగ్యంబులకు సంతానంబులేమి యొక మహాలోపముగా వారికేకాక చూచువారలకుఁ బొడగట్టుచుండెను. పాప మైతమ్మ సంతానంబునకై తహతహపడుచుఁ జూచినవారికెల్ల మ్రొక్కుచుఁ బురాణంబులవినుచు గంపెడాసతోఁ బ్రొద్దులుపుచ్చుచుండెను. ఎన్నినాళ్ళకును సంతానంబు గన్పట్టలేదు.

బ్రహ్మనాయఁడొకయూర వైష్ణవమతవ్యాపనముఁ గావించుచున్నపుడు పంచమోద్ధరణమునకై ప్రజల నుద్బోధించుటయేకాక మాటలకును చేఁతలకును వైరుధ్యంబుఁజూపు సంస్కర్తలవలెఁగాక పంచమోద్ధరణమనఁగాఁ బంచములను నజ్ఞానంబునుండియు నార్థికదారిద్ర్యంబునుండియుఁ దొలఁగించుచు స్పృశ్యులఁగా నొనర్చుటయేకాని వారితోఁ బంక్తిభోజనాదులఁ గావింపనక్కఱలేదని యందఱతోఁ జెప్పుచున్నను నాతఁడుమాత్ర మొకమెట్టుపైకిఁబోయి కనుకులవారని గృహనామముగల యొకకుటుంబములోనిబిడ్డ నొకనిఁ దెచ్చుకొని యెంద



వలదని వాదించినను వినక వానిని బుత్రునిగాభావించుకొని పెంచుకొనుచుండెను. బ్రహ్మనతోడునీడయయిన యైతాంబయు వల్లెయనియెనుగాని లోలోన నాత్మజుఁడు లేకపోయెఁగదాయని మనఃఖేద మప్పుడప్పుడు పడుచునేయుండెను.

పిల్లవాఁడయిన కనుకులకన్నమదాసు బ్రహ్మనయింటఁ బెరుగుచు సకలవిద్యాపాండిత్యంబుతోఁ బాటు ధనుర్వేదంబును యుద్ధశాస్త్రప్రవీణతను సంపాదించి బ్రహ్మనను నలుపురిలో గర్వపడునట్లు చేయుచుండెను.

యథార్థసంతానంబు కొఱవడుటచేఁ గలిగిన మనఃక్లేశం బైతాంబహృదయంబున గాటంబుగనాటుకొనెను. ఆమెయొనర్పని పూజలు లేవు. ఆమెనడపని నియమములు లేవు. ఇట్లుచేయఁగాఁ జేయఁగా 'గజనిమ్మ' వ్రత మొకటి యథావిధిగా మాచెర్లచెన్నకేశవుని పేరఁగావించి బ్రాహ్మణాదివివిధజాతులను నన్నవస్త్రాదికంబులచేఁ దృప్తులంగావింపఁ గొన్నిదినంబులకు నైతాంబ గర్భవతియై నవమాసంబులుమోసి తూరుపుఁగొండ బాలసూర్యుని విధముగా నొక యతిసుందరరూపవంతుఁడైన శిశురత్నముం గనెను. బ్రహ్మనాయం డతనికి బాలచంద్రుఁడని నామకరణంబొనర్చెను. శుక్లపక్షంబునందుఁ జంద్రునిమాద్రిఁ గోమలవిస్ఫురచ్ఛరీరసౌకుమార్యంబున నున్న బాలచంద్రుండును దినదినప్రవర్ధమానకళావిలాసంబులతో విరాజిల్లుచుండెను.

ఇట్లుండ నొక్కనాఁడు బ్రహ్మనగృహంబున కొక జ్యోతిశ్శాస్త్రపారంగతుండు వచ్చి బాలచంద్రుని మోముఁదిలకించి యాతనిజన్మంబు కొలఁదిదినములలోనే తండ్రి కనర్థదాయకమని భవిష్యత్స్థితి నొక్కివక్కాణించెను. అప్పుడు బ్రహ్మన "ఓహో! ఈవాక్యంబులు నాయెడ నిర్ఘాతపాతములైనవి. అనేకసంవత్సరములనుండియు నెవ్వనికై నోములు వ్రతములు దానధర్మంబులు సవరించుచుంటిమో యెవ్వని

ముఖవీక్షణంబుఁ నాకును నాకల్యాణియైన మైతాంబకు నానందదాయకమో యట్టి జగన్మోహనాకారుండగు నాపుత్రునిజన్మము నాకే ప్రాణాపాయకరంబగునట్లు విధివ్రాసెఁగాఁబోలు. ప్రేమసంబంధం బెట్లున్నను లోకోపకారంబు నింతపరిశీలించి యిట్టిపట్ల నెట్టికార్యం బాచరణీయమో గ్రహింపవలసియున్నది. బాలుఁ డింతదనుక నన్వర్థనాముఁడైయుండెను. నేనా, వయసుముదిరి రాజకీయపర్యాలోచనంబులతోఁ బాటు మతవిషయకాందోళనంబులోఁ దిరుగుచు బ్రాహ్మణసంఘంబులచే నధఃకరింపఁబడి దీనావస్థలోనున్న నిమ్నజాతుల యథాశక్తి నార్థికంబుగను నైతికంబుగను నాధ్యాత్మికంబుగను నుద్ధరించుచుండుట లోకవిదితము. అట్టిచో మా యిర్వురిలో నెవ్వరుగతాసువులగుట మేలు? ఒకవంకఁజూచిన మానవసేవ. వేఱొకయెడఁ బ్రాణిహింస. ఇందేది గణనీయమో యోచింపఁదలఁచినచో దీనదశాకృశాంగులగు లోకులసముద్ధరణంబునకై యత్నించుచు భక్తిసంపాద్యంబై యంతంబున మోక్షప్రదంబై విలసిల్లు వైష్ణవమతవ్యాపనంబుఁ జేయుటయే కడుంగడు లెస్సయని తేలకమానదు. అందుచే నేనే జీవించియుండి నాప్రాణంబునకడ్డురాఁగల నాప్రియపుత్రునే విగతాసుం జేయించెద" నని వితర్కించి యాబాలుని నైతాంబయెంతవిలపించుచున్నను గన్నమదాసుచేతికొసంగి యరణ్యంబునఁ జంపిరమ్మని యాజ్ఞాపించెను.

మాలయగు కన్నమదాసుగూడఁ దమ్మునియందు నపరిమితానురాగంబొద్చుచుండుటచేమనసువోక యాబాలుని దన్నుబ్రోత్సహించిన బ్రహ్మనాయనియొక్క సోదరుండయిన పేరినాయని యింట రహస్యంబుగా డించి వచ్చెను. పేరినాయఁడును నన్నగారికిఁగాని పరులెవ్వరికిఁ గాని దెలియనీక యతిగూఢంబుగ నాబాలుని వేఱొకచోటఁ బెంపఁ జేయుచుఁ బెద్దవానిఁ జేయుచుండెను.

చదువుకొను నీఁడు రాఁగానే సోదరుండగు కన్నమదాసువలెనే బాలచంద్రుండును బినతండ్రియయిన పేరినాయని ప్రయత్నంబులచే



వశీకృతసకలవిద్యావంతుం డయ్యెను. కాని శాస్త్రపరిచయం బింకను బాగుగ నలవడుటకై యూరిబడిలోని సమర్థుఁడయిన గురువునొద్దకు బంపుటకుఁ బేరినాయఁ డుద్దేశించి "యిట్లయినచో బాలచంద్రుఁడు బయలుపడవలసివచ్చు"నని గ్రహించెను. అప్పటికిఁ గుఱ్ఱవానికిఁ బదునైదుసంవత్సరంబు లతిక్రమించుచున్నవి. ఈనిగూఢవర్తనంబు జరిపించుట మిగులఁ గష్టంబుగనుండునని పేరినాయఁడు గ్రహించెను. పసివానిఁ జంపుమని పంపునాఁ డున్న మనోదార్ఢ్యము నేఁడు బ్రహ్మనాయనికి సడలకపోవునా యని పేరినాయఁడు దలపోయుచుండెను.

మాచెర్లగ్రామంబుననే బాహుబలగర్వాన్వితుఁడును గార్యదీక్షాదక్షుండును నింగితజ్ఞానసంయుక్తుఁడును నగు నొక కాఁపుండెను. ఆతని పేరు గండుకన్నమనాయఁడు. బ్రహ్మనాయనికి మిక్కిలి యిష్టుఁడు. ఆతని కొలువుపెద్దలలో నితఁడు మంచిధనవంతుఁడు. ఆతని కొకకొమారిత గలదు. పురుషసంతానవిహీనుఁడయిన యాకన్నమనాయఁ డామెనే వేవిధంబులఁ బ్రేమించుచుఁ గంటికిఱెప్పవలెఁ జూచుచుండెను. తల్లిదండ్రులామెయొక్క యభివాంఛితంబు నెఱవేర్చుట కెన్నఁడును వెనుకాడినవారుకారు. చెక్కుందనంబున కాబాలపెట్టినపేరు. చిదిపి దీపముఁబెట్టవచ్చును. కన్నమనాయఁడును నతని ప్రేయసియు నాసుకుమారిని నెండకన్నెఱుఁగనీయకుండిరి. ఈఁడు వచ్చుచున్నకొలఁది ముఖపద్మంబుపై సారెసారెకుఁ బడుచుండు చూర్ణకుంతలము లావిద్ధములైన యింద్రనీలశకలంబులవలెఁ బ్రకాశించుచు దినదినంబున కామెకపూర్వశోభాతిశయంబు సమకూర్చుచుండెను. విద్యాస్వీకరణకాలంబు రాఁగానే కన్నమనాయఁడు బాలికామణిని నింటనే గురుశుశ్రూషఁ జేయించుచుండెను. కొంచెము భూగోళశాస్త్రంబును నాఁటికిఁ దెలిసియుండిన దేశచరిత్రాంశంబులను గృహనిర్వాహణోచితమైన గణితమునుమాత్రమే కాక యాంధ్రంబుతోఁబాటు సంస్కృతంబుగూడ

నభ్యసించుచుఁ బదునైదు సంవత్సరంబులు వచ్చుసరికి మాంచాలవిద్య యందుఁ గడిదేఱెను. మెదడునుజక్కఁబఱచు పైవిద్యలేకాక ముఖ్యతరంబును ముఖ్యతమంబును నయి హృదయోద్బోధకమై నైతికధర్మ ప్రవర్తనానుకూలమై విభాసిల్లునట్టి మతవిషయక విద్య నెక్కుడుగా నాబాలిక యభ్యసించెను. శాస్త్రజ్ఞానంబుతోఁబాటు మాంచాలకు వయసువచ్చినకొలఁదియు ననితరసౌందర్యచిహ్నంబయిన శరీరసౌష్ఠవంబు కనులపండువుగనుండెను. అంతకుఁ బూర్వమునుండియు మాఱుమూలల డాఁగిడాఁగి తుదకు దేహసౌష్ఠవంబును బ్రాయంబును నాహ్వానింప మనోభావపరిణామంబుల సమకూర్చెడి కామభగవానుండు వచ్చి యామె హృదయంబుననే యధివసింపఁజొచ్చెను.

ఒకనాఁడు గండుకన్నమనాయఁడు సకలగాయకకవిపండితశిఖామణులతోడను సుహృద్వర్గంబుతోడను బలసియున్న బ్రహ్మనాయని కొలువులోఁ గూర్చుండి వివిధవిషయంబులఁగూర్చి ముచ్చటించుచు మాంచాల వివాహవిషయంబుఁగూడఁ దెచ్చి కార్యదక్షుండును వీరపురుషుండును మాంచాలాంబ చేపట్టుటకుఁదగినవాఁడునునగు సుందరాంగుం డెవ్వఁడాయని యోచించుచుండ "నాయొద్ద నొకశిరీషపేశలతనుండును విద్యావంతుఁడును మహావీరలక్షణసమన్వితుండును నగు 'బాలుండు' గలఁ" డని పేరినాయఁడు పలికి పిల్లవానిని దేఁబంపెను. పేరినాయని కెవ్వఁ డట్టికుమారుండు లేఁడని యెఱింగిన యాసభాసదులందఱును ననుమానింపఁజొచ్చిరి. ఇంతలోఁ బాముకుబుసంబువంటి జిలుగువలిపెం బధోంశుకంబుగా ధరియించి పైకుబికియున్న వక్షఃపీఠంబును దేహలావణ్యంబును విశదీకరించుచున్న సన్ననిచేనూలుటంగీనొకటిఁదాల్చి పీతాంబరంబు వలెవాటుగావైచి భూమండలంబున కెల్లప్పుడు నొకసగము దివంబును వేఱొకసగము రాత్రియనియు నిరూపించునట్టు కళకళలాడుచు నైగనిగ్యంబులొలుకు ముఖంబును



గటికచీఁకటి వెదజల్లు తుమ్మెదఱెక్కలవంటి వెండ్రుకలును గలిగి యనంగుఁడు సాంగుఁడైనచ్చెనో యన్నట్లు బాలచంద్రుఁడువచ్చి చూపఱకుఁ బొడగట్టెను.

రాఁగానే యీతఁడెవ్వరని యెల్లరును బ్రశ్నలపైఁబ్రశ్నలఁ గురిపింపఁజొచ్చిరి. ఆసమజ్యయందుండువారెల్లరును దామొక యసాధారణపురుషసందర్శనంబుఁ జేయుచున్నట్లు భావించికొనుచు సందర్భోచితంబుగఁ గన్నమనాయని మొగంబుఁజూడకయే బాలునిగూర్చి పేరినాయనిఁ బ్రశ్నించుచుండిరి. ఆసమయంబునందలి వారి విచిత్రవీక్షణావధానంబులఁ జిత్రించుటకు నెట్టి చిత్రకారునికుంజెయు నాడదని చెప్పిన నతిశయోక్తిగాదు. ఆసభాసదుల శ్రోత్రంబులకును నేత్రంబులకును నొక్కమా అప్రయత్నంబుగఁ బనికల్పింపఁబడుటయే దీనికి ముఖ్యకారణము.

బాలచంద్రముఖవైఖరీదిదృక్షువులలో బ్రహ్మనాయం డగ్రస్థానము వహించి చిత్రకారునికుంజెకును గవిపుంగవునిలేఖినికిని దురవగాహమగునట్టి స్థితిలోనుండెను. తక్కుంగల వారికెల్లరకు శ్రోత్రనేత్రంబులే యవధానంబు వహించుచున్నవిగాని బ్రహ్మనాయునిపట్ల వానితోఁగూడ మేదస్సునకుఁగూడఁ బూర్ణంబుగఁ బనికలిగెను. పేరినాయని నోటినుండి బాలచరిత్ర వాక్యంబులు పూర్ణంబుగ వెలువడకమునుపే బాలుని తమ్మిమొగము దృష్టపూర్వంబయి యుంటచే నాయనికించుక మనస్సులో ననుమానం బుదయింప నాతఁడనిమేషత్వంబు వహించి యోచింపఁజొచ్చెను. అంతటఁ బేరినాయఁడు కొంచెముసేపు మిన్నకుండి యాకుఱ్ఱనిచరిత్రం బామూలాగ్రము వచియించి సభారంగంబునఁ బరస్పర విముఖంబులగు సంతోషశోకరసంబు లనూనంబుగఁ దాండవింపఁ జాల్పడెను. ఇన్నినాళ్ళకు బాలచంద్రుని దివ్యసుందరముఖంబు వీక్షించితిమని యందున్న పెద్దలందఱును నపరిమితా

నందడోలికాందోళనంబున నుండ ముఖవీక్షణ ప్రథమదశావసరంబునఁ గించిత్ప్రమోదసమ్మిళితకోపరసంబు వెలువడఁజేయ నుంకించిన యా బ్రహ్మనాయఁడు మనస్సును దిటవుపఱచుకొని మాలకన్నమదాసును, బేరినాయని, భీషణభాషణంబులఁ దూలనాడుచు, నాననసౌందర్యరసంబుతో మందహాసమాధుర్యరసంబును మేళవింపఁజేయుచుఁ జూపఱకుఁ గనువిందుఁజేయుచున్న యా బాలచంద్రుని మఱలఁగొనిపోయి నఱకిరమ్మని నిర్దయుండై వజ్రీభూతహృదయుండై యొకభటునికి నాజ్ఞాపించెను. అంతట సభాసదులందఱు లేచి "ఉచితజ్ఞా! బాలచంద్రుండు బాల్యంబున నున్నప్పు డెవ్వరో యాతని జన్మము తండ్రికి నష్టదాయకమని వాక్రుచ్చియుంటచే మీరు కుఱ్ఱవాని నరణ్యమధ్యంబున నఱకిరమ్మని పంపినప్పుడు మేమందఱ మానాఁడు చూచిచూడనట్లూరకొంటిమి. కాని నేఁడట్లు మిన్నకుండుట పాడిగాదని యెంచి కోపోపశాంతికై ప్రార్థింప నుంకించుచున్నాము. భగవత్కటాక్షమువలన బాలుండు సజీవుఁడై యుండుట మీకును మాకును నానందదాయకము. ఇన్నిదినంబులనుండియు నీతఁడు సజీవుఁడై యుండినను నవిచ్ఛిన్నప్రతిభాసమున్మేషులై సదారోగ్యవంతులై యున్న మీకు భవిష్యత్కాలంబున నీ చిన్నవాని సజీవత్వంబుచే సేగివచ్చుననుట యవాచ్యము. కావున మాయందు సంపూర్ణదయారసంబుఁ జిల్కి యీసుకుమారశరీరునికి, సకలవిద్యావిశారదునికిఁ బల్నాటి వీరపుంగవుండని పేరెన్నఁదగిన శూరలక్షణసమన్వితునికి, వీరసింహకిశోరునికిఁ బ్రాణభిక్షంబుఁ బెట్టుఁడని మీ పాదంబులువట్టి వేఁడుచున్నా"మని సదస్యులందఱు మొఱ్ఱవెట్టఁగానే "జ్యోతిశ్శాస్త్రపారంగతుండు వచియించిన కొలఁదిదినంబులు గడచెఁగదా" యని బాలచంద్రునిపై బ్రహ్మనాయనికిఁ గలకోపరసపూర్ణహృదయము కొంచెము కొంచెముగాఁ గరుణారసంబులో మునిఁగి తేలాడుచు నందఱితోఁ బాటు మన



శాస్త్రపరిశోధకులకుఁగూడ సమ్మోదావహంబుగ నుండఁబాల్పడె. అప్పుడు బ్రహ్మనాయని భార్యయయిన మైతాంబ యాముద్దుబిడ్డను జూచి 'నాయనా! నామనోహరమూర్తీ! నాబంగరుబిడ్డా! మజ్జీవితాంభోధిసంతరణనౌకాయితా! నాసర్వస్వమా! నాప్రాణమా!' యని పల్కుచు నాతని మూర్ధంబును మూర్కొనుచు ననిర్వచనీయప్రేమపారవశ్యంబునఁబడి యించుకంత సొమ్మసిల్లెను. కొంతసేపటికి నామె మైదెలిసి పిల్లవాని నంతఃపురంబునకుఁ గ్రియారూపకప్రేమావిష్కరణంబునకై కొంపోయెను.

కొన్నిమాసంబులు గడచెను. దినములవెంబడి బాలచంద్రునిపై బ్రహ్మనాయనికిఁ బ్రేమం బపారంబుగ బయల్వెడలుచుండెను. కౌమారంబు సాగనంపుచు బాలచంద్రునికి శరీరసౌష్ఠవము భుజార్గళబలము భ్రూవల్లరీగాంభీర్యము సింహపరాక్రమము మొదలగు సుగుణంబులన్నియు నేర్పడుచు యౌవనారంభదశ నిరూపించుచుండెను. ఆనవమన్మథాకారునికి ముద్దుముచ్చటలతో వైవాహికమహోత్సవంబు సలుపవలెనని తల్లియైన మైతాంబ కెంతయో మనస్సుఱ్ఱటలూఁగుచుండెను. ఇంతియకాక, బ్రహ్మనాయనికిఁగూడ బాలచంద్రునికి నొకతగిన కన్యాలలామంబుఁ గట్టవలెననియే యుద్దేశముండెను.

ఇట్లుండ గండుకన్నమనాయఁడు మఱియొకమాఱు సభలో నిజాత్మజాపరిణయప్రసంగముఁ గావించెను. అప్పుడు బాలచంద్రుని సద్గుణపుంజంబును విద్యాపారంగతత్వంబును జెవులారవిని తనకర్హమైనవాఁడని భావించి తనలో డాఁగియుంటకై ప్రారంభించిన కామభగవానుని సంకల్పసిద్ధత్వం బెట్లుండునోయని యహర్నిశంబుఁ దలపోయుచుఁ దనకోరిక నొక్కింత తల్లితో వచియింపసాహసించినట్టి తన కూఁతురగు మాంచాలాంబను బాలచంద్రుని కిచ్చుటకై యనుజ్ఞ నిమ్మని కన్నమనాయఁడు బ్రహ్మనాయని వేమాఱులడిగెను. కొన్ని

దినంబుల కీసంబంధంబు వాంఛనీయంబని విశ్వసించి బాలచంద్రుని సమ్మతిఁగైకొని బ్రహ్మనయు నైతాంబయుఁ దమయొప్పుదలఁగూడ నొసంగి సుముహూర్తంబు దైవజ్ఞులచే నేర్పఱించి వలయు పెండ్లిపను లన్నియు సవరింపించి సుదినంబున బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యంబుతోఁ గూడఁ బంచమసోదరులను సమానాదరణంబుతో భోజనతాంబూల దక్షిణాదివిధులచే సంతృప్తులం గావించి బాలచంద్రమాంచాలాంబ లకుఁ బాణిగ్రహణమహోత్సవంబు మహానందముతోఁ బరిసమాప్తిఁ గావించిరి.

వివాహానంతరము దినములు పైఁబడినకొలఁదియు బాలచంద్రుండు నూత్నయౌవనారంభముతో సానఁబెట్టిన రత్నమువలె విరాజిల్లుచుండెను. ఆతని బాహార్గళయుగళంబునకుఁ గలబలాతిశయము విరోధినొక్కరినైన మందునకుఁగూడ లేకుండఁజేసెను. కరడుగట్టి యుబికియుండిన యాతని విశాలవక్షోభాగము, నూనూఁగు గొనబు మీసము, సన్నపాటినడుము, గంభీరవాగ్గుంభనము, హృదయనైర్మల్యము వెలార్చుచున్న కోమలవీక్షాప్రసారములు వీరపుంగవులకుఁ గన్నుగుట్టుచుండెను. యౌవనం బనుపురుషుండు బాలచంద్రునిలోఁ బ్రవేశించి దినదినముఁ బరస్పరవైరము పెచ్చుపెరుగుచున్న శరీరబల సౌందర్యంబులప్రతిభలఁ దిలకించుచు నేదిఘనతరమో నిర్ణయింప లేకుండెను. బాహుబలశాలియు నరిభయంకరమూర్తియు నైన బాల చంద్రునితో సమానులెవ్వరును లేకపోయినను జిన్నప్పటినుండియు నెయ్యంబుతో మెలంగుచు నెచ్చటకుఁ బోయినను దోడునీడగనున్న వా రార్గురుస్నేహితు లాతనికిఁ గలరు. అందులో ననపోతరాజను బ్రాహ్మణయువకుం డొకఁడుగలఁడు. ఇతఁడుగాక వెలమదోర్నీఁడు, చాకలిచందన్న, కుంభకారకుమారుండగు తేర్కుఁడు, నగసాలె యయిన చందన్న, క్షురకాత్మజుండయిన మంచన్న యనువారు గలరు.



ఈయాఱుగురుస్నేహితులతో బాలచంద్రుం డెల్లప్పుడుఁ గాలము మహానందముతోఁ గడపుచుండెను. వారందఱు నీతని సోదరునిగా భావించుచు భక్తిసమ్మిళిత మైత్రితోడను విశ్వాసంబుతోడను నాతని గొలుచుచుండిరి. బ్రహ్మనాయని పక్షంబునకుఁ బ్రబలవిరోధియయిన నాయకురాలిపై వారు బాలచంద్రునికంటె నెక్కుడుగాఁ గారాలు మిరియాలు నూఱుచు నిజమైనపక్షాభిమానము వెల్లడించుచుండిరి. పరస్పరవియోగ మొకగడియ మహాయుగముగా నుండునంత నెయ్యము వారిలో వర్ధిల్లుచుండెను. ఇట్లుండ బ్రహ్మనాయఁడు కొంతకాలం బయినవెనుకఁ బెదమలిదేవభూపతికి వయస్సువచ్చుటచేఁ గళ్యాణపురాధీశ్వరుండయిన వీరసోమునికూఁతు నిప్పించివివాహంబుఁ జేసి తాను సింహాసనంబునుండితొలఁగి మలిదేవు మహావైభవంబుతో నందుఁ గూర్చుండఁబెట్టి తానుమంత్రిత్వంబువహించి పరిపాలనంబు నడపుచుండెను.

---

## అయిదవ యధ్యాయము.

అతిబలపరాక్రమసమన్వితుండును మహాశేముషీధురంధరుండును నసమానరాజ్యతంత్రజ్ఞానపారంగతుండును నగు బ్రహ్మనాయని నెన్నైన శక్తిసామర్థ్యంబు లుపయోగించి యాతని మాచెర్లకు వెడలఁగొట్టి స్వహస్తామలకాయమానుఁడయిన నలగామరాజుయొక్క నామమాత్రప్రభుత్వముక్రింద మంత్రిత్వమువహించి నాయకురాలు నానాఁటికిఁ బేరువడుచుండెను. మంత్రిపీఠంబు నెక్కినదిమొదలామె పురుషునికంటెమిన్నగా రాజ్యతంత్రంబునడపుచు రాజామోదవిశ్వాసములను నొందుచుండెను. ప్రజావిశ్వాసమును జూఱగొనినఁగాని ప్రభుత్వమునకు స్థిరత్వం బెప్పుడును సంభవింపనేరదని యెఱింగినయాకొమ్మ సాధ్యమయినంతవఱకు వారికి సమ్మతియైనవిధంబుల నడచుకొనుచుఁ

బ్రజాహిత జీవనమునందు నప్పుడప్పుడు తీరికఁజేసికొని పాల్గొనుచు నెల్లరమెప్పును బడయఁ బ్రయత్నించుచుండెను. బ్రహ్మనాయని కాలంబునాఁటి విధానమును గొంత వఱకుమార్చి రాజ్యతంత్రమునం దారితేఱిన యానాయకురాలు తేనెఁబూసినకత్తియై ప్రజలకొకవంక సౌఖ్యదాయిని యగునట్లే పైకిఁగన్పడి వారిపన్నులమూలమునఁ బ్రభుత్వాదాయమును నినుమడింపఁజేసెను. ఇట్లు కొంతకాలము గడచెను. బ్రహ్మనాయఁడు తనకంటె నన్నివిధములమిన్నయనియు నాతఁడు బ్రతికియుండు నన్నిదినములు దనకుఁ బ్రక్కబల్లెమేయనియు గ్రహించి నాయకురాలు వానికెట్టులయిన నిరంతరంబును సేగి సమకూర్చి కష్టపరంపరలలో ముంచుచు వీలగుచో రూపుమాపఁ బ్రయత్నంబులు సలుపఁజొచ్చెను.

ఇట్లు దుర్గుణోపేతయయిన నాయకురాలు లోలోనఁ దనయాంతరంగికులతోఁ బెద్దయుంబ్రొద్దు సమాలోచనంబుఁగావించి సమీపారణ్యంబులో నివసించుచున్నట్టి భిల్లవరులఁ గొందఱ రావించి వారికి వర్తకులవేసంబులుదగిలించి రహస్యంబుగా వారితోమాటాడి మాచెర్లకుం బంపెను. వారును గొన్ని వర్తకపదార్థంబులు సేకరించుకొని మాచెర్లకుఁబోయి యందుఁ, గొన్నిదినంబులుగడపి తుదకొక నడిరాతిరిఁ దమ ప్రచ్ఛన్నవేషంబులకుఁ దిలోదకంబులిచ్చి నిజహృదయవిలీనదుష్టబుద్ధులు మొగంబులపై మలయుచుండ వారందఱు బ్రహ్మనాయఁడు మలిదేవులుఁ నుండుకోటలో నొకమూలఁ బ్రవేశించి దోఁచుకొనఁ బ్రారంభించిరి. ఇట్లుజరుగుచుండఁ గొంతసేపటికి వారీవఱకొనరించిన దుష్కృత్యంబులన్నియుఁ బరిపక్వమై యధోగతి ప్రాప్తించెనోయన్నట్లుగా వారిలో నొకఁడు సౌధసోపానంబులనుండి దట్టంబుఁగాఱుకొని దృగభేద్యమైయున్న కారుచీఁకటిలోఁ బొరపాటునఁ గాలుజాఱి క్రిందికిఁ బడెను. పడినవెంటనే సవ్వడివిని కోటలోని రక్షకభటుం డొక్కఁడు జాగరూకుఁడై తక్కుంగలవారినెల్లర లేపక మహాపరాక్రమశాలియు



మేరుధీరుండును నయిన మాలకన్నమనాయని గేహప్రఘాణంబుఁ దఱిసి రహస్యంబుగా నాతని లేపి యీవిషయంబు నివేదించెను. అంతటఁ గన్నమదాసుఁడు గోలయయినచో నిద్రాళువులయినవారందఱు మేల్కని నిద్రాభంగంబుఁ గావించుకొందురను భయంబునందగిలి జఘనావలంబియైన ఖడ్గంబు దీప్తులుగురియ దక్షిణహస్తంబున నొకనిడుపాటి సాముకఱ్ఱనుగొని కాలిచప్పుడులేకుండ వెతకివెతకి యాచీఁకటిలోననే యొకరి నిర్వురను దగువిధంబున సత్కరించెను. ఇసుమంతయు సందడిలేకుండుట తమకు లాభకారియని యూహించి యాచోరులందఱు వానిపైఁ దలపడి పోరాడసాగిరి. వీరపుంగవుండును, ధీరాగ్రేసరుండునునగు మాలకన్నమదాసు వీరవీరుండును దండ్రియునైన బ్రహ్మనాయని, మాచెర్ల చెన్నకేశవుని, లోలోనస్మరించుకొని దక్షిణబాహుదండంబుతో నాదండంబును గిరగిరం ద్రిప్పుచు వారిపోటులన్నియు వమ్మొనర్చుచుఁ జేయునదిలేక నిశ్చేష్టులైయున్న యాకుహనావర్తకుల నొక్కరొక్కరినే చంపకుండఁ గ్రిందికొఱగునట్లు చేసెను.

ఊరిలోని కుక్కుటంబులమ్రోఁత చెవింబడునప్పటికి నరిషడ్వర్గంబు బాధించి విభాసిల్లు జ్ఞానివిధంబున వారినెల్లర నిర్వీర్యులం జేసి బంధించి శౌర్యమూర్తియైన కన్నమదాసు నడుమనిలుచుండి ప్రకాశించుచుండెను. కొంతసేపటికిఁ దెల్లవాఱవచ్చుటచే నీవార్త కోటగోడలం దాఁటి గ్రామంబులోనికింగూడఁ బ్రవేశించెను. సూర్యోదయంబయ్యెను. ఊరిలోనివారందఱును మీఁదుమిక్కిలి బాలచంద్రుఁడును దజ్జనకుండును గన్నమయప్రతిమధైర్యసాహసంబులకు నచ్చెరువంది యాతని మిక్కిలి శ్లాఘించిరి. ఆపై బ్రహ్మనాయనియానతోఁ గన్నమదాసు వారందఱివీఁపులపై నిసుకగోనెలనెత్తించి వారిందోలుకొనుచు గురిజాలకుం బ్రయాణమయ్యెను.

ఇట్లు కొన్నిదినంబులు ప్రయాణమొనర్చి యొకనాఁటి వేకువజామున గురిజాలపత్తనసమీపభూమికిఁ గన్నమ యొంటరిగా వారిం

దోలుకొనివచ్చెను. ఇంతలో నీవిషయంబు పట్టణమునందెల్ల యెడల గప్పుమనియెను. ప్రాగ్దిశా భాగంబు వెలవెలఁబాఱుచుండఁగానే కన్నమదాసు దొంగలనందఱనచ్చటనిలుపఁ దానును వారును గాల్యకృత్యంబులఁదీర్చికొనిరి. ఊరిబయటనున్నకొలనిలో దాసు స్నానంబొనర్చి తన విశాలముఖంబున వైష్ణవమతసూచకపుండ్రధారణంబుఁ గావించి బాలభాస్కరుని నులివెలుఁగులు ముఖవికాసంబుఁగూర్ప బయలుదేఱి ప్రథమయామంబు కడచనునప్పటికి నలగామునిహాజారంబుఁ బ్రవేశించెను.

అంతకుమున్నే కన్నమదాసు సాహసంబున వారిని దోలుకొని వచ్చుచుండుట నాయకురాలువిని నలగాముని సూరెలంజేరి "రాజోత్తమా! బ్రహ్మనాయఁడు మనయూరినుండి గ్రామాంతరంబుఁ బ్రవేశించినను మనకింకను హృదయశల్యమై యప్పుడప్పుడు మనఃఖేదమును నిర్భరకోపావేశంబును గలిగించుచున్నాఁడు. మీకాతనియందు నేకారణంబుననో ప్రేమంబు పరిపూర్ణమై వెలయుచున్నది. ఆతఁడిందుండినప్పుడు తత్కృత్రిమచేష్టావళులెల్లఁ దమకుం దెల్లమైయుండెను. ఋణశేషము శత్రుశేషము నుంచుకొనరాదను నార్యోక్తి రిత్తవోవునా? తమకు ప్రేమంబుగురియు బ్రహ్మనాయనిపై వక్రోక్తులుచెప్పుట నాకు విచారమును గష్టమును నాపాదించుచున్నది. కాని మనరాజ్యంబునం దిట్టి ఘోరమైన యన్యాయంబులు సంభవించుచున్నప్పు డవి పౌరుషశాలురైన తమకుఁ గీర్తిదాయకములుకావని మనవిఁజేయుచున్నాను. కాలసర్పంబును బాలుపోసి పెంచినను నైజగుణంబుమానునా?" యని పలుక నలగాముం డదియేమనిప్రశ్నింప నామె వినయపూర్వకముగా "స్వామీ! వినుండు. ఈమధ్య మనయూరినుండి కొందఱు గౌరవనీయులయిన వర్తకశిఖామణులు వ్యాపారార్థ మాడాడ సంచరించుచుఁ గొండొకదినంబున మాచెరలం బ్రవేశించిరఁట. ఆనాఁటిరేయి వీరు గురిజాలవాసులనిగ్రహించి కన్నమదాసు, బ్రహ్మనాయని ప్రోత్సాహంబున



నిజధైర్యప్రతాపంబులు గన్పఱచి వారియందుఁ జౌర్యంబాపాదించి ముట్టడించి దండఘాతంబులచే వారిని బ్రాణావశిష్టులఁగావించి యంతట నూరకుండక వారివీఁపులపై నిసుకగోనెలఁబెట్టించి తోలుకొని నేఁడిటకుఁ దనప్రతాపంబుఁ దెలుపుటకు వచ్చియున్నాఁ" డని తెలుపఁగానే నలగాముండు పాదతాడితకాలాహిభంగి మండిపడుచు నౌడుగఱచుచు భ్రూయుగ్మంబులు ఫాలంబునముడివైచుచు "నౌరా! బ్రహ్మనా! దుర్మార్గశిఖామణీ! ఎంతటి క్రూరకృత్యంబునకుఁ బాల్పడితివి! నీ జ్ఞానంబు మంటఁగలిసెనే? పాపము నాయకురాలెంతచెప్పినను వినక నీయందవ్యాజమయినప్రేమంబుతో నిన్నినాళ్ళుంటినిగాని నీబుద్ధి నేఁటికి స్పష్టమైనది. నీకృత్రిమవ్యవసాయంబులువిని మేము నిర్విణ్ణులమైతిమి. ఛీ! దుష్టా! నీపేరుఁదలపెట్టిన పాపముగాని వేఱుగా" దని బ్రహ్మనాయనిఁ గఠినోక్తులనిందించెను. తరువాత, నాయకురాలు దూరంబుననున్న బ్రహ్మనాయనిపైఁ బగఁదీర్చుకొనుటకంటె నచ్చటికి "వర్తకశిఖామణులఁ" దోలుకొనివచ్చిన యావైష్ణవమతావలంబకుఁడయిన మాలకన్నమదాసును జిత్రవధఁగావింపవలెనని కుటిలాలోచనంబులఁ గావించి యాతనిని "వర్తకులను" భూపతికింజూపించి యాతం డవశ్యంబు వధ్యుండని పెక్కుసారులు నొక్కి వక్కాణించెను. కాని యాత్మనాథుండు విషయమంతయుఁ గన్నమదాసునోట విని "వీరందఱు మాచెరలలోని వారిదేవిడీలోఁ జౌర్యక్రియారంభులై యుండిరనియు వారిని సమయంబుఁజూచి పట్టుకొంటిననియు నిదంతయు ధ్రువపఱుపఁ గలననియు సమక్షంబున నివేదింపవచ్చితిననియు నితఁడు వాక్రుచ్చుచున్నాఁడు. ఇది విశ్వాసార్హముగాకపోయినను నితండు బ్రహ్మనాయని యాజ్ఞచేఁ బ్రవర్తించువాఁడు గావున నవధ్యుండు. ఈభంగి విపరీతచర్యలఁగావించు బ్రహ్మనాయఁడే యవశ్యము నిందార్హుఁడు. వానిపైఁ గత్తిఁగట్టవలెఁగాని యీతనివధింప సమంజసంబుగాఁదోపఁ

లే"దని నాయకురాలితోఁ బలికెను. అంతవారిర్వురు నాయనిగర్హించి దగ్గఱనున్న యాతని బెదరించి కొన్ని ప్రతివచనంబులఁబడి బలపరాక్రమ ధైర్యసాహసభీముండయిన కన్నమను దుదకు మాచెరలకుం బంపివేసిరి.

“వర్తకవృత్తియందున్న వారిపైఁ జౌర్యక్రియాపరాధం బారోపించి కన్నమదాసుచే నింత కఠినకార్యంబుఁ గావింపఁజేసిన యాదుర్మార్గుండయిన బ్రహ్మనాయఁడు గౌరవార్హుండుగాఁ”డని నలగామరాజు సభలో ననినప్పుడు నాయకురాలిహృదయం బానందకందళితం బయ్యెను. రాజహృదయం బించుక వ్యతిరేకభావం బూనినవెంటనే నాయనిపైఁ గావింపఁదలఁచుకొన్న దుష్కృతచయంబు లెన్నియున్నను వానికన్నిఁటికి నంగీకారం బనాయాసంబుగాఁ బొందవచ్చుననియు నివ్విధంబునఁ దన విరోధిని నిర్వీర్యుని జేయవచ్చుననియు నాయకురాలు చలపోసెను. బ్రహ్మనాయనిపై రాజునకుఁగల కోపంబనునసలంబునకు సమయంబుఁ జూచి తగిన యింధనంబుల నామె సమకూర్చుచుండెను. దినంబులు గతించినకొలఁదియు నలగామరాజునకు నాయనిపైఁగల విరోధ మతిశయింప నాయకురాలెంతటిపని సేయఁదలచుకొనినను సడ్డులేకుండునట్లు పొడకట్టుచుండెను.

కన్నమదాసు గురిజాలపురాధీశ్వరునిచేతను ధూర్తాంగనయైన యాతని మంత్రిణిచేతను నతికఠినముగా నిందింపఁబడి బెదరింపఁబడి గురుసన్నిధిం జేరెను. అంతట బాలచంద్రుఁడు, బ్రహ్మన, గండుకన్నమ మొదలగువారందఱుం జేరి దాసుపై శత్రువులుగురిపించిన బెదరింపుఁ బలుకుములుకులచే వ్యాకులితహృదయులై పదంపడి కోపారుణనేత్రులై కోఱమీసములం దువ్విరి. బ్రహ్మనాయఁడు “ఔరా! అవివేకా! నలగామా! నీరాచరికపు మొదటి దినములకును నాయకురాలు మంత్రిత్వంబువహించిన తరువాతికాలంబునకును నెంతటి తారతమ్యమున్నది! తొలుత నాయందు నీకుఁగల భక్తివిశ్వాసములకును



నిప్పుడు నీవు వెలువరించుచున్న కృతఘ్నతకును నాహృదయము పరిపూర్ణవిచారమిళితకోపరసంబుతో గుబ్బటలాడుచున్నది. ఇంతదనుక నీచే నేనెంత యవమానింపఁబడియున్నను నీయందు నాకు నిష్కల్మషమయిన ప్రేమభరంబు పొంగి పొరలియుండుటచే లోలోన నొచ్చుకొంటినిగాని బయటికిమాత్రము నేనెన్నఁడును నిందించియుండలేదు. కన్నమదాసుపై నీవు చూపిన నిందావాక్యములు నీతోడునీడయయిన యాబాలరండకన్పఱచిన కోపాతిశయంబును బైపెచ్చు నన్ను మీరిర్వురు గర్హించినవిధమువిని నాహృదయము మండిపోవుచున్నది. అట్లయినచో వారు చోరులుగాక వర్తకశిఖామణులనియేనా మీయందఱయూహ! ఔరా! ఎంతవైపరీత్యము! నిరాధారముగాఁ దోడిమానవులఁ జోరులని యిట్లుహింసింపనెంతువా? ఎంతఘోరమగు నపరాధారోపణము! ఇదంతయు నీకుఁబుట్టినబుద్ధిగాదు. పిశాచావిష్టుఁడయినవాఁడు తత్ప్రేరితదుశ్చేష్టావళుల కధీనుఁడయినట్లు నాగాంబావిష్టుఁడవై భిన్నహృదయుఁడవై ప్రవర్తించుచున్నాఁడవు. నిన్నుఁజూచిన నాకుఁ గోపోద్రేకంబుకంటెఁ గనికరంబు వేయిమడుంగులుగాఁ బొరలుచున్న”దని యందున్నవారందఱయెదుటఁ బలికెను. అటుపయి సదస్యులు తమలోఁదాము బ్రహ్మనాయని మనఃపారిశుద్ధ్యంబునుగూర్చి యవ్యాజస్తోత్రంబులతో గుసగుసలువోయిరి.

ఆజన్మవిరోధియయిన బ్రహ్మనాయని జీవితం బింక వెతలపాలు సేయు నుద్దేశముగల యాధూర్తవనిత పరధనాపహరణోద్యుక్తుండైన చోరునివితమున నేకాగ్రచిత్తంబుతో నాలోచనల మునిఁగి తేలుచుఁ దుదకొక్కనాఁ డొడ్డువట్టెను. నాయఁడొప్పుకొన్నచో నామెత్తు లాతని నవిచ్ఛిన్నకష్టపరంపరలయందు దింపునని పూర్ణంబుగ నెఱింగి యాలేమ స్వహస్తామలకాయమానుఁడయిన నలగామునియొప్పుదలకై యాతనిసన్నిధిం జేరి సవిమర్శనంబుగా నాకుటిలోపాయంబును నాలోచించుచునట్లొనర్చెను. భూనాథుఁడును గొంతవడి పర్యాలోచించి యా

యెత్తుగడకు నామెను గడుంగడు శ్లాఘించి "ప్రతిపక్షముం బూని కాలు ద్రవ్వుచున్న నాయని ప్రతిభ సాధింపఁదగినదే" యని యవ్యాజమయిన యంగీకారం బొసంగెను. పరుని సాధించుటలో నతిచాతుర్యంబున మెఱయు నాజాణ రాజు సమ్మతింపబడసిన వెంటనే సంతోషసౌధాగ్రం బెక్కి తాండవింపఁదొడఁగెను.

నరనాథుని యాజ్ఞంబొందిన మఱునాఁడే నిరాలస్యంబుగఁ గమ్మ నొకటి వ్రాసి ప్రభుని చేవ్రాలుఁగూడఁ దీసికొని యొక భటునిం బిలిచి "స[illegible]ంబునఁ బ్రయాణమై వాయుజవంబున మాచెరలకుం బోయి మలిదేవుని యాస్థానంబుఁ బ్రవేశించి సముచితవినయగౌరవములతో మంత్రియగు బ్రహ్మనాయని కీయుత్తరం బీవలయు"నని యాజ్ఞాపించెను. సేవకుండును నాముదల శిరసావహించి బయలుదేఱి మఱునాఁడు మలిదేవుని కొల్వువేళకుం జేరి నిజాగమనంబు నాయనికిం దెలియంబఱప నాతఁడును సవినయంబుగ భటుని రావించి యర్హసత్కారంబులఁ గావించి చేతికందీయఁబడిన యుత్తరంబును గ్రహించి కొనవఱకు నొకమాఱు చదువుకొనెను. అప్పుడు గాంభీర్యమును గోపోపేతమయిన వక్రమందహాసంబును మొగంబున ముప్పిరిగొని కలిసి నర్తించెను. నిరంతరశాంతవికాసంబులఁ బొఱఁద్రోలి తత్థానంబుల విచిత్రవికారంబు లుదయించుటచే మనంబులం దాందోళనంబు పడుచున్న సభాసదుల కందఱకు నెల్గెత్తి నాయఁ డిట్లు కమ్మను వినిపించెను.

"శ్రీశ్రీ సకలకళావిశారదులును భీమపౌరుషసమన్వితులును మానవంతులును శాంతశమదమాదిసద్గుణ విరాజితులును రేచర్లాన్వయపారావారశీతమయూఖులును నగు బ్రహ్మనాయని పాదపద్మముల సన్నిధికి — విధేయుఁడయిన నలగామరాజు హృదయపూర్వకనమస్కారంబులు గావించి యొనర్చు విజ్ఞాపనములు.

మహాశయా! మనము పరస్పరసమాగమసంభాషణములు గావించి చాలదినము లతిక్రమించినవి. మీకుఁ బ్రేమాస్పదులయిన



మాతండ్రిగారి కాలంబునుండి కొలఁది సంవత్సరంబుల క్రిందటివఱకు నిచట మంత్రిత్వమువహించి యుండుటయేకాక మీదుమిక్కిలి మీరు పరమకృపాసంయుతమైన హృదయముతో నన్ను నెంతగౌరవంబునఁ బెనిచితిరో నేనెన్నఁటికిని మఱవఁజాలను. ఈమధ్య మీరొనర్చిన మలిదేవవివాహపట్టాభిషేకమహోత్సవంబులకుఁ గార్యాంతరముచే రావీలు లేకుండుటవలనఁ గడువిచారించినాను. లోపం బెవ్వరిదిగానున్నను గారణాంతరంబులచే వియోగంబు తటస్థించుటచే నామనం బెంత యుదిలకొనుచున్నదో నేనెఱుంగుదును. భగవంతుఁ డెఱుంగును. కడవంబడిన దానికి వగవం బనిలేదు. వర్తకవృత్తియందున్న వర్తకపుంగవులఁ గొందఱ మీశిష్యుండును గుమారుండును నయిన మాలకన్నమదా సెంత యవమానమొనర్చినను మీరది తగవుగాదని చెప్పక యెంత యూరకొన్నను మీయందు సహజానురాగంబు నాహృదయము వెలువరించుటచే నిన్నినాళ్ళకు మఱల నొక్కపరి మిమ్ముంగూడి సంతోషసౌఖ్యంబులఁ గొన్నిదినము లోలలాడవలెనని యుద్దేశించినాను. ఇఁక నొక్కపక్షంబులోపలఁ బ్రజాసంతోషదాయకంబయిన సంక్రాంతి పండుగరానున్నది; కాన నాఁడు మహావైభవసమేతంబుగ నొక కుక్కుటసమరంబుఁ దలపెట్ట నిశ్చయించి దానిం విలకించి పాల్గొనుటకై యితరరాజన్యులతోఁ బాటు మలిదేవభూపతిని, మిమ్ములను నాహ్వానించుచున్నాను. ఇంతకాలంబయిన వెనుక ననురాగంబునఁ జూపఁబడిన నాయభీప్సితంబును నెఱవేర్ప సంకోచింపరని విశ్వసించుచున్నాను.

గురిజాల. }

ఇట్లు విధేయుఁడు,
నలగాముఁడు.

ఈకమ్మ చదువంబడునప్పుడు బ్రహ్మనాయని మాద్రిఁ గించిత్కోపసూచకంబయిన వక్రహాసంబు నొనర్పనివాఁ డాసభలో నొక్కండును లేఁడు. అందున్న ప్రతివ్యక్తియు నలగాముఁడు కుటిలోపాయుఁడై

యాహ్వానించుచుండెఁగాని హృదయపూర్వకంబుగాఁగాదని తలపోసెను. "నిన్నఁగాక మొన్న మనకన్నమదాసును నానాదూషణవాక్యంబులనాడి పైపెచ్చుమిమ్ములఁగూడ నిందించి యాతనిబాఱఁదఱిమించిన యీ నలగాముఁడు మేడిపండువంటి తనమనస్సునందు దురుద్దేశంబులుగలిగియే యీనాఁడు కోడిపోరునెపంబుఁబెట్టి యాహ్వానపత్రం బంపినాఁడు. ఈపిలుపుగర్హ్యము, నిరాకరణీయ" మని కొందఱును "కాదు. పౌరుషశాలియైనవాఁడు పోయి యెత్తుగడయేమియో నిర్భయంబుగఁ గనుంగొనిరావలసినదే" యని మఱికొందఱును బలువురు పలుతెఱంగులఁ బలికిరి. అంతట బ్రహ్మనాయఁడు లేచి "సభాసదులారా! ఈయుత్తరంబులోని వాక్యధోరణి తేనెపూసినకత్తియే కాని వేఱుగాదు. నాకేదేనొక యపకారం బపేక్షించియే యీపన్నుగడ వారు పన్నియుందురు. కాని ప్రేమపూరితహృదయంబుచేఁ గాదు. ఇయ్యది నిరాకరణీయం బని భావించికొన్నను నీలేఖయందు నన్ను సంబోధించుచు "మానవంతుఁడ" ననియుఁ "బౌరుషోపేతుండ" ననియు నతండు సాభిప్రాయంబుగాఁ బలుకుచున్నాఁడు. ఈమాటలవలన మానవంతుఁడును బౌరుషోపేతుండును నగువాఁడెవ్వఁడును రాకుండనుండరాదను భావంబు తప్పక స్ఫురించుచున్నది. మానం బసమానంబుగా గణించు నేను పోకుండుట గౌరవదాయకముగాదని నామనస్సాక్షి నాకుబోధించుచున్నది. కానున్నది కాక మానదుకదా! కానిండు తప్పక పోయివచ్చెద" నని గంభీరంబుగాఁ బలుకుచు నర్థగాంభీర్యంబుగల మఱికొన్నిపదంబులు చూపించెను. పిమ్మట సభలోనున్నవారందఱు నాయని శబ్దార్థగ్రహణ శక్తికిమెచ్చి తాముగూడనట్లే యోచించి కడ కాతనినిర్ణయము నంగీకరించిరి.

సభాసదులందఱు బ్రహ్మనాయని యుద్దేశముతో నేకీభావముం జూపినతోడనే యాతండును దగురీతి నొప్పుదలకమ్మ నొకటివ్రాసి యావచ్చిన వార్తాహరునిచే గురిజాలకుఁ బంపించెను. తరువాత సం



క్రాంతిదినంబుదనుక నాయఁడును మలిదేవులును గోడిపోరుపిలుపు దుర్మనఃప్రేరితంబగుననియు నందుచే గొంతహాని తప్పక సంభవించుననియు భావించిరి.

అచ్చట గురిజాలయందును నరపాలుండును నాయకురాలును బ్రహ్మనాయని యంగీకారలేఖఁజూచి విపరీతసంతోషాంబుధి నోలలాడిరి.

---

## ఆఱవ యధ్యాయము.

కొన్నిదినంబులు గడచునప్పటికిఁ బండుగదినంబుగూడ వచ్చెను. ఆనాఁటికిముందే గురిజాలపత్తనమునందే కాక తదితరప్రదేశంబులయందును నలగామునిపక్షమువారును, నితరరాజన్యపక్షములవారును బ్రహ్మనాయనిపక్షమువారును గుక్కుటసమరప్రదర్శనంబుఁ గావించెదరని చాటింపఁబడెను. నాయఁడు ప్రియశిష్యుండును బుత్రుండునునయిన మాలకన్నమదాసును వెంటనిడుకొని కొందఱు ముందునడచుచుండఁ జిఱుగజ్జియలమ్రోఁతసహజగాంభీర్యంబు రెట్టింప రాచఠీవితో నల్గడలఁ బరికించుచు బంగరుపల్లకీలపై నెక్కియుండు తామ్రచూడంబులతో బయలుదేఱి పండుగనాఁటి ప్రాతఃకాలంబునకు గురిజాలసమీపంబునకు వచ్చెను. నలగామునికి బదులుగాఁ బంపఁబడిన నాయకురా లర్హాసత్కారంబులుగావింప వారిని ముందఁగాఁబోయి కలిసికొని యాదరించి యూరేగింపులతో నూరిలోనికిం గొనివచ్చి నలగాము నింటదించెను.

బహుదినంబులకయిన సమాగమంబునకు నలగాముం డపరిమితానందం బనుభవించునట్లు కాన్పించుచు వారియందఱియొక్కయు రానిమలిదేవులయొక్కయు యోగక్షేమంబులనారసి ప్రత్యుత్తరంబులతో సంతుష్టిం జెందెను. పైకిఁ బచ్చిగడ్డికప్పడునోదంబువలె నింపైన లారు వానివాక్యంబు లతిగంభీరములనియుఁ గృత్రిమస్వభావజన్యంబు

లనియు వీరకుంజరుండయిన నాయఁడు క్షణములో గ్రహించెను. కాని నలగాముని యాహ్వానలేఖలోని పదముల యర్థముంబట్టి దైవముపై భారంబువైచి తెగించి యిట్లురావలసివచ్చెనుగాని వేఱొండుగాదు. పోనిండు. ఇట్టి కృత్రిమమనస్సుతో నుండువారియింటదిగుట సమంజసంబుగా లేదని తలపెట్టుటకైనను వీలులేకుండఁ బ్రతిపక్షులు మాచెరల రాజ్యమంత్రియయిన నాయనికి బైకి మహాదరణంబు గావించుచునే యుండిరి. అట్టి యాదరణంబు సకారణంబుగ నిరాకరించుట యాతనికి గౌరవనీయముగఁ దోఁపలేదు. కావున రేచెర్ల వంశ్యునిమనస్సు మిక్కిలి విషమావస్థయం దుండెను.

పండుగకు ముందటినాఁడే గురిజాలలోని యాబాలగోపాలముఁ దలగడుగుల ముగించికొనిరి. సంక్రాంతినాఁడు రాజాస్థానమునకును రాజోద్యోగులకును సెలవుదినమగుటచే నెవరియింటవారు పండుగజరుపుకొనుప్రయత్నము లొనర్చుచుండిరి. పూర్వాచారపరాయణులయిన వైదికోత్తములు యథావిధిగాఁ గూష్మాండదానాదికంబులఁ గావించికొని యానాఁడు పితృదినంబుగఁ బరిగణించిరి. ఇతరవర్ణములవారు ముఖ్యముగాఁ జతుర్థవంశజు లతివైభవంబుగ నాఁడు షడ్రసోపేత భోజనములలో మునిఁగి తేలుచుఁ బ్రతిసంవత్సరంబును దామునడపుచున్న కోడిపోరుల మాసివైచి రాచవారిపోరితంబునుజూచి యానందింపవలెనని యిచ్ఛగించిరి. వారాబాలవృద్ధంబుగాఁ బోరుపట్టయిన పురబాహ్యప్రదేశంబున సమావేశమయిరి. సూర్యుఁడించుక తీక్ష్ణత్వము డించిన వెనుక సకలపక్షములవారును స్నేహభావంబున నొక్కమాఱుగా వివిధయానంబులమీఁద సభారంగంబు నలంకరించిరి. ప్రాఁత నెయ్యంబు మఱవక గౌరవభావముఁజూపు స్వభావంబుగలపెద్ద లనేకులు బ్రహ్మనాయనికిఁ గవ్వడి నమస్కరించి పూర్వపరిచయంబు నినుమడించికొనిరి. నాయఁడును వారితో సరససంభాషణంబులు



మహాసంతోషంబునఁగావించి నలగాముని యాజ్ఞాప్రకారంబుగఁ గోడిపోరుఁ బ్రారంభించెను.

ఆనాఁడువచ్చిన యితరరాజన్యులందఱును వారిలోవారు నవ్వులాటలకుఁ బందెంబులువైచికొని కోడిపోరు సలిపిరి. నాయకురాలి పక్షంబువారును బ్రహ్మనాయనిపక్షంబువారును దమతమపుంజులను ముద్దుపేరులతోఁబిలుచుచు వానిమెడలుదువ్వుచు, ముద్దిడుకొనుచుఁ గత్తులఁగట్టి పందెంబులనొడ్డి వానిని రంగంబులోదించిరి. నాయకురాలు తొలుదొల్తన దురుద్దేశపూర్వకంబుగ నే నాయనికోడితో నీఁడురాని తన కోడిని నెకటింబంపి చంపించుకొనెను. రెండవపర్యాయముగూడ నట్లేయొనర్చి రెండుతడవ లోడుటచే విచారసమ్మిళితకోపంబుఁ జూపు నట్లు నటించుచుండ, నలగాముం డామెను నెమ్మదిపఱచి యవసరంబగు నెడల రాజ్యంబొడ్డుటకును నధికారంబిచ్చి ప్రోత్సహించెను. ఆపయి మఱొక్క పందెంబునఁగూడనోడఁగా నిట్టియాటలయందును, బ్రొద్దుపోవని సోమరిపోతులాడుకొను చీట్లాటలయందును నిజంబుగ రాఁగల పక్షాభిమానవాదోపవాదంబు లుదయింపఁజేసికొని యానైఱజాణ నాయనితో దుర్వివాదంబులొనర్చుచు నాతనికిఁగూడ నించుక కోపోదయంబుఁ గావింపఁజేసి "ఓయీ! నాయఁడా! అట్లయినచో నాలవతూరి నిష్కల్మషహృదయంబులతో నిర్వైరముఁ బుంజుల విడిచిచూతము. ఈమాఱెవ్వ రోడుదురో వారు రాజ్యంబువదలి యేడుసంవత్సరంబులు గ్రామాంతరంబున నివసింపఁబోవలెను. ఇందుకుఁదప్పిన గురువధపాతకం బొనర్చినవారగుదురు. ఇట్టి ప్రతిజ్ఞావాక్యంబులొనర్ప ధైర్యంబును నభిమానపౌరుషంబులు నున్నచో నీకార్యంబునకుఁ గడంగుము. లేదేని "గడచిన మూఁడుపందెములయందును నన్యాయంబుఁ గావించితిమని యొప్పుకొం" డని గంభీరంబుగా ఘోషించెను. పిడుగులవంటి యాపలుకులు వినఁగానే సభాజనంబులకు గుండె లవిసెను.

అనవద్యావధానంబుతో వారందఱు బ్రహ్మనాయని ప్రత్యుత్తరంబునకై వేచియుండ నతఁడుత్తరక్షణంబుననే లేచి "నాగాంబా! నీవాడిన నియమంబులకు నే నంగీకారమొసంగుచున్నాను. ఈతూరియోడినవారేడేండ్లు కడగండ్లఁగుడిచెదరుగాక" యని సగర్వంబుగా వాక్రుచ్చెను. అంతట మఱలఁ బందెముపడెను.

కౌరవపాండవద్యూతంబున దుర్యోధనుఁడు తనపక్షంబున దుశ్శీలుండయిన శకుని నాడించిన తెఱంగున నాగాంబయుఁ దనకు బదులు దుర్ధీకుండును కృత్రిమోపాయధురీణుండును నగు గంగవరము కట్టుబోతు నొకని నియమించి బ్రహ్మనాయని నొప్పించెను. అప్పటికిఁ జీకటిపడుచుండెను. చీఁకటియనిపించని రాచ దివ్వటీలు వెలుఁగుచుండెను. ఎంతవెలుఁగుచుండినను బగటిపూట కాకపోవుటచేతఁ బ్రతిజ్ఞావాక్యంబులాడుకొనుపట్టున సభారంగమున మూఁగియున్న పెద్దమనుష్యుల సందడిలో నీనూత్నపురుషుండు పూర్వపువానికి మక్కికిమక్కిగా నేర్పఱచియున్న యొకపుంజును దీసి విడిపించెను. దుష్టోపాయములకుఁ బుట్టినిల్లయిన యాపురుషుండు వివిధంబులగు పన్నుగడలతో నాయనిపక్షంబువారి నొప్పింపక తుదకెట్లో బ్రహ్మనయొక్క పుంజును దనపుంజుచేఁ జంపించెను. అంతట నెల్లెడల నలగామునికి జయసూచకంబులగు కరతాళధ్వనులు మిన్నంటెను. ఆసమయంబున నలగామపక్షంబులోని సంతసంపుఁ గలకలము వర్ణనాతీతమైయుండెను. కొందఱు తమ యుత్సాహంపు టెత్తుఁజూపించుటకో యన గుప్పించి బయలులో దుముకుచుండిరి. కొందఱు పరిపూర్ణోత్సాహంబు తమ్మావరింప మాటాడుటకుఁగూడఁ జేతఁగాక హాసవిలాసచేష్టలతో సముద్రగంభీరులైయున్న రాజమంత్రిణులచుట్టు మూఁగుచుండిరి. నాగమయు నలగాముఁడును సంతోషరసంబుతో నింపిన నిండుకుండలవలెఁ దొణకకుండిరి.

నాయఁడును దదనుచరులును మేఘావృతాకాశంబుపై నక్షత్రములవలె సమ్మోదంబుఁ దక్కియుండిరి. విచారాగ్నిచే బ్రహ్మనాయని



హృదయము దహింపఁబడుచుండెను. కాని నలగామునిపోల్కి నాతఁడును జలించినట్లు పైకిఁగన్పడలేదు. తానొక్కఁడేకాక రాజ్యంబు గురిజాలపురాధీశ్వరునిహస్తగత మొనర్చి మద్దేవులుగూడ మాచెరలవిడిచిపోయి యేడేండ్లిడుమలంబడుదుర్దశ ప్రాప్తించెను. కాని విధి మునించినప్పు డేమిచేయఁగలఁడు? వెన్నంటియున్న కర్మంపుఁజెయ్వులెంతటివారికైనను ననివార్యములుగదా!

మిన్నుముట్టిన యుత్సాహంబులు, హృదయంబులఁ గలగుండువెట్టిన చింతాగ్నిజ్వాలలు కొంతసేపటి కొకింతశాంతించెను. పదంపడి నాగాంబలేచి సదస్యులఁగూర్చుండ నియమించి సభాస్థలంబు నిశ్శబ్దంబుగావించి నాఁటికోడిపోరునుగూర్చి కొంతవడి ముచ్చటించి యందులకై యేర్పఱుపఁబడిన కఠిననియమములఁగూర్చి నొక్కివక్కాణించి సాభిప్రాయంబుగా బ్రహ్మనాయని నుద్దేశించి చెప్పికూర్చుండెను. అంతట నోటమిపక్షంబువాఁడయిన బ్రహ్మనాయఁడు కష్టపరంపరల నొకచీరికింగొనని జ్ఞానియగుటచే నియమబద్ధుఁడై నరపాలాదులు సగర్వంబుగా సోపాలంభంబుగా హర్షింప నందఱయెదుటఁ గొలఁదిదినములలో మాచెరలరాజ్యంబునువీడి సపుత్రమిత్రబాంధవంబుగా మలిదేవరాజులును దానును బరరాజ్యంబులందు సంవత్సరసప్తకంబు గడపెదమని వాగ్దానమొనర్చెను. పరమజ్ఞానియు నీతికోవిదుఁడు నయిన బ్రహ్మన్న "నియమంబుల ననుసరింపఁగల" నని చెప్పినవాక్యంబులకు రాజుపక్షంబున నాగమ్మ సంతోషంబు నుగ్గడించుచు సభనుజాలించెను. అందఱును నెవరియిండ్లకు వారుపోయిరి. ఆనాఁటిరేయియు బ్రహ్మాదులు నలగాముని యాహ్వానము నిరాకరింపలేక వారియింటనే కుడిచి మఱునాఁ డుదయము రేపకడలేచి చింతాశల్యంబు హృదయంబును మాటిమాటికి బాధించుచుండ మాచెరలపురంబుఁ బ్రవేశించిరి.

ఈచెడుగుఁగబురు మునుముందే తెలిసినయారాచవారందఱుఁ దమతమ యుల్లంబులు డిల్లపడ నిద్రాహారంబులులేక విచారంబునఁ

గూరుచుండిరి. బ్రహ్మనాయఁడు మొదలగువా రంతఃపురంబునఁ బ్రవేశింపఁగానే దాసదాసీజనంబులు గోలుగోలుమను నేడ్పుటెలుంగులతో వారి నెదుర్కొనిరి. బ్రహ్మన యాసాయంతనంబునఁ బుత్రమిత్ర స్నేహిత పౌరవర్గంబుల రావించి సభఁ జేయించి వారి సమక్షంబునఁ గుక్కుటసమరంబుఁగూర్చి వాక్రుచ్చి పోరు కుతంత్రమిళితమైయుండినట్లు తనకుఁ బొడగట్టియుండెననియుఁ దానేమియు వాని నదిరించి. సకారణంబుగా రూఢిపఱుప వీలుగాకుండెననియు నేర్పఱుపఁబడిన నియమంబు లలంఘ్యంబులనియు—మొదలగు విషయంబులు విస్పష్టంబుగా వారికిఁ దెలియఁబఱచెను. అంతటఁ బౌరులు వడిన మనోవేదనకు మితిలేకుండెను. బ్రహ్మన మలిదేవులపై మాచెరలవాస్తవ్యులకుండు మమకారము వియోగంబును సహింపనిదైయుండెను. రాచవారును వారివియోగంబునుగూర్చి మిగులఁ జింతాక్రాంతులయిరి. బ్రహ్మాదులును బౌరులును బరస్పరానునయంబులఁ గావించికొని యెవరియిండ్లకు వారు చేరిరి.

గురిజాలపట్టణంబున నాయకురాలును దత్స్నేహితులును బ్రహ్మనాయనికి ముట్టినయాపదనుగూర్చి సంతోషరసంబును వర్షించుచుండిరి. కోడిపోరు పరిసమాప్తంబయి కొన్నిదినంబులయినను నాయనివారు మాచెరలనుబాసి యింకనుబోలేదని గురిజాలవారు కంటగించుచుండిరి. చదువరులారా! చూచితిరా రాచటెక్కపునీతి. శత్రువున కెల్లప్పుడు నశుభంబులు గలుగుచుండవలెననియుఁ, దాను శోభావంతుఁడై విభాసింపవలెననియుఁ దద్రాజ్యం బూఁచముట్టుగ హరింపవలెననియు రాజు చింతించుచుండుట సాధారణము. నిజముఁజూచినఁ బరరాజ్యాక్రమణవాంఛ భూపాలునిజీవితవృక్షంబునకు వేరుపురుఁగువంటిది. శరీరము తానుగా దనువిజ్ఞానోదయము ముక్తిసాధక మెట్లగునో యట్లే పరరాజ్యము తనదిగాదనియు దానిపై నాసవడియుండుట శ్రేయోదాయకంబుగాదనియు నెంచుట తేనిక సౌఖ్యావహము. దుర్బుద్ధియే



మనంబునఁ బొడసూపినచో నది తిన్నగఁ జెడుతెన్నును జూపించుచు నరపాలుని నధఃపతితునిజేయును. రాజన్యులలో జన్యం బెన్నఁడు పొడసూపినను దానికి నిగూఢమైన రాజ్యాక్రమణవాంఛయే మూలకందమని గ్రహింపవచ్చును.

బ్రహ్మనాయనితో మఱల నెన్నఁడేని బూర్వస్నేహంబుఁ బురస్కరించుకొని నలగాముఁడు వానితో మంచిమాటాడుచోఁ దనకుఁ దిలోదకంబొసంగఁబడు ననుదుస్తంత్రంబుతో నాధూర్తాంగన రాజునొప్పించి కోడిపోరొకటిఁగల్పించి మహాజ్ఞానబలవంతుఁడయిన బ్రహ్మనాయని దేశాంతరంబునకు వెడలఁగొట్టి యింతకుమున్నఱచేతనున్నప్రాణములు లోనవైచికొని గుండెపైఁ జేయివెట్టుకొని హాయిగా నిద్రింపఁదొడఁగెను. అవును! దుష్టోపాయంబులుగూడఁ గొన్నియెడల ఫలించును. దీనికంతటికిని వాని ననుభవించువానికర్మపరిపాకమే కారణముగాని వేఱుగాదు.

అచ్చట మాచెర్లపట్టణంబున నాబాలగోపాలము రాచవారి వియోగభారంబు సహింపలేక కుందుచుండ విశ్వామిత్రుని కుటిలోపాయంబులచే దేశాంతరగమనోన్ముఖుఁడైన హరిశ్చంద్రునిపోల్కి నొకనాఁడు సపుత్రమిత్ర బాంధవంబుగా మలిదేవుండు బయలుదేఱిపోయెను. ఆనాఁటి వియోగసమయము పౌరులకును, రాజ్యతంత్రంబునడపుచుఁ గంటనుఃప్తిఁబెట్టుకొని ప్రజాసౌఖ్యంబులఁ గాచుచుండు బ్రహ్మనాయనికిని బరస్పరదుఃఖభాజనంబుగా నుండెను. ఊరనింతకాలంబునుండియుఁ గోటలో మహావైభవంబులతోడను వాద్యఘోషంబులతోడను నలరారుచుండిన తేఁడగు మలిదేవుఁడును దజ్జనసమూహంబులును వెలికడుగువెట్టఁగానే పట్టణము మృతకళేబరంబువలెఁ గన్పట్టెను.

కోటలో నెచ్చటఁజూచినను బావురుమనుచుండెను. మంత్రియైన బ్రహ్మనాయనికిని మలిదేవునికిని నత్యంతప్రేమాస్పదులయి

యుండినవారనేకులు చాలదినములవఱకుఁ దద్వియోగంబుఁగూర్చి కంటఁదడిపెట్టుచునే యుండిరి. చాలకాలమువఱకు రాచబాటఁ బోవునట్టి మాచెరలలోని ప్రతిమానవవ్యక్తియు నొక్కమాఱా కోటవైపు తొంగిచూచి పూర్వవైభవదినంబులు స్మరించుకొని కాలపురుషునిలీలలు దృష్టాంతపూర్వకంబుగా నుగ్గడించి పోవుచుండెను.

పలనాటివీరుండయిన బ్రహ్మనాయఁడు కాలవశంబున వైభవంబులఁ బాసి మలిదేవాదులతోఁగూడి కొన్నిదినంబుల కేలేశ్వరముకడఁ గృష్ణాంతరంగిణీ స్నానంబులొనర్చి దాసిందాటి మందాడియను నూరం బ్రవేశించి నివసించుచుండెను. అచ్చటనే యేడుసంవత్సరంబులు దమ జీవితంబుల సుఖంబుగాఁగడపి యనంతరంబు కృష్ణవంకకుఁ దిరుగవచ్చునను నూహతో నాయఁడు మందాడిలోనే నివసింప నిశ్చయించెను. సర్వసంపదలతోనింతకుమున్ను తులఁదూఁగుచుఁ బ్రజాసంఘములతోఁ గలిసిమెలసియున్న మలిదేవుఁడు, బ్రహ్మనమొదలగు వారందఱు మందాడి వాస్తవ్యులతోఁ దలలోనాలుకగా మెలఁగుచుండిరి. వారినిజూచిన వారెల్లరుఁ బురాతనకర్మబాధమిట్టిదని తలంచుచు నలాదుల నుదాహరణంబుగాఁ గొనుచుండిరి. చాలకాలంబచ్చటనే కాఁపురంబొనర్ప నిశ్చయించిన బ్రహ్మనులయూహలకు రెండుసంవత్సరంబులు గతించునప్పటికి విఘాతంబులు వాటిల్లునట్లుండెను. తానొకటిఁదలఁచిన దైవమొకటిఁదలఁచెను.—కాదు—నాగమ్మ వేఱొకటిఁదలఁచెను.

అధఃపతనముఁజెందినవాని నుద్ధరించుట ఋజుమార్గులగు రాజులకు నైజము. అట్టివానిని మఱింత యణఁగఁద్రొక్కుట దుర్మదోద్ధతులగు రాజన్యులకు సాజము. పాపము సర్వస్వము విధివశంబునఁ బాసి నెత్తిపై గుడ్డతో దేశాంతరగతుండైన బ్రహ్మనాయని నంతటితో వదలక శత్రుశేషముండుట రాజనీతికాదనితలంచి నాయకురాలు నలగామునివలలోఁ బడవైచికొని తదాజ్ఞంబొంది యాతనివేధింపఁ గుటిలోపాయంబు లింకను బన్నుటకుఁ బ్రారంభించెను.



మందాడిలోనుండిన మలిదేవబ్రహ్మనులు నాయకురాలు తమకుఁ జేయు దుశ్చేష్టితంబులు తమ దేశాంతరగమనంబుతో నంతమొందునని తలపోసి సాధారణజనులవలె జీవయాత్రను గష్టసుఖంబులతోఁ గడపుచుండిరి. స్వకుటుంబజీవనంబునకై కావలసిన గోవృషభాదిపశుజాలంబులు తొలుదొల్త మందాడికి వచ్చునప్పుడే వారు మాచెరలనుండి కొనివచ్చిరి. వానినే వారానాఁటిగృహమేధులతోఁబాటు మానప్రాణధనంబులతోఁ దుల్యంబులుగాఁ జూచుకొనుచు వాని సుఖదుఃఖంబులు దమవిగా భావించుకొనుచు వానిపై సత్యానురాగంబునావిష్కరించుచుండిరి. ఆకాలపువారికుండు పశువులమీఁది ప్రేమ యీనాఁటివఱకు నవిచ్ఛిన్నముగా నిరాతంకముగా నమోఘముగాఁ బల్నాటియందు సాగుచున్నదని యెల్లరకుఁ దెలియును. బ్రహ్మనాదులు బిడ్డలవలెఁ జూచుకొను పశువులకేమాత్రము సేగి సంభవించినను మిన్నకుండక తద్రక్షణకార్యంబునకై తమ ప్రాణంబులు తృణప్రాయంబులుగాఁ జూచుకొనుచుండిరి.

ఒకనాఁటిరేయి పొద్దుపోవువఱకు మలిదేవులును బ్రహ్మనయు గండుకన్నమనాయఁడును మాలకన్నమదాసును గోధనరక్షకుండయిన లంకన్నయును ముచ్చటలాడి భోజనంబుగుడిచి యెవరిచోటికివారు నిదురింపఁబోయిరి. మాలకన్నమయును, లంకన్నయును మఱియుంగొందఱును ముందటివలె నాఁటిరాత్రియు గోష్ఠంబులోఁబరుండిరి. ఊరు మాటుమణఁగెను. ఎచ్చటఁజూచినను నిశ్శబ్దంబుగానుండెను. రాత్రి ద్వితీయయామంబు కడచునప్పటికిఁ గొంతకొంతరొద యూరిలో నింకను మెలఁకువలోనున్నవారికి వినఁబడుచుండెను. కాని మెలఁకువ వచ్చినవారెవ్వరును నిద్రాదేవినివిడిచి పోనొల్లకుండిరి.

గోష్ఠంబులోనిస్థితి మహాభయంకరంబుగా నుండెను. లంకన్నయుఁ దదితరపశురక్షకులును గాఢనిద్రఁ జెందియుండ గోష్ఠంబున

కుత్తరపుఁగొననున్న పశుసమూహంబులు అంకెలు వేయుచుఁ బైపైకి దుముకునట్లు వినఁబడుచుండ జాగరూకుఁడయిన లంకన్న తత్క్షణంబ లేచెను. మఱికొందఱుఁగూడ లేచిరి. వారుత్తరదిక్కున కేఁగి యచ్చటఁ గౌపీనమాత్రధారులును, నీలశరీరులును దృఢకాయులును భయంకర స్వరూపులును ఖడ్గహస్తులును నగు భిల్లులఁగొందఱఁ జూచిరి. ఆదొంగలగుంపేఁబదికి మించియుండునట్లు లంకన్న మదింపువేసెను. నిఱుపేదకుఁబెన్నిధి, నాఁకొనువాని కన్నము దొరకినట్లు చేతులతీఁటతో నుండు లంకన్నకీచోరబృందంబు నుఱుముసేయుట కవకాశముగలిగెను. మాలకన్నమ మొదలగు వీరశ్రేష్ఠులఁ బిలిచినచోఁ దనకుఁ గలిగిన యీగొప్ప యవకాశము తప్పిపోవునని యెఱింగిన లంకన్న యిఁకెవ్వరిని లేపక లేచియుండిన నల్వురైదుగురును దానునుమాత్రము చేతులందు దృఢమైన కత్తి కఱ్ఱలధరించి వారిందాఁకిరి. చోరులలోఁ గొందఱింతకుమున్నే పశుసమూహంబులలోఁ గొన్నిఁటిని గృష్ణాతటిని వంకకుఁ దోలియుండిరి. ఒక్కయుత్తరపుదిక్కున మాత్రమే కాక గాలికి నలువంకలగృహంబులు ముట్టికొను వైశ్వానరునిపోల్కి నాచోరబృందము మందలో నెల్లెడలదూఱి వానిని దఱుమఁజొచ్చెను. లంకన్న యియ్యది కనిపెట్టి తనతోడలేచియున్న నలువురును నాల్గువంకలకుం బోవ నియమించి కన్పడిన దొంగలనెల్లఁబట్టి చీఁకటిలో నేలపైఁబడవైచి మట్టాడుచుండెను. ఇదంతయు సందడిలేక జరుగుచుండెను. తమపక్షంబున లంకన్న ముష్టిఘాతంబులచే నుఱుముసేయంబడిన వారిందిలకించి భిల్లప్రజంబంతయు నొక్కపెట్టున భయంకరస్వరూపంబులతో లంకన్నను జుట్టుముట్టెను. అతఁడును నరవాయిఁగొనక గఱ్ఱను సాముఁ ద్రిప్పుచు నతిభీకరంబుగాఁ జెలరేఁగుచు నాత్మరక్షణముఁ గావించుకొనుచుండెను. ఇట్లు కొంతసేపగునప్పటికి లంకన్నచేలావు తఱిగిపోయెను. అతఁడుండిఁయుండి క్రిందఁబడి సొమ్మసిల్లుచుఁ "గన్నమా! చచ్చితిని—



చచ్చితి"నని గంభీరదీనస్వరంబున నొక్కమాఱఱచెను. వెంటనే కాచియున్న యాతస్కరులొక్కుమ్మడి వానిపైఁబడి తమవారిం బరిమార్చిన కోపాతిరేకంబుచే సమానమైన ప్రత్యపకారంబుఁ గావించిరి. ఇంతలోఁ "జచ్చితి"నను ధ్వనివినిన వీరాగ్రేసరుండయిన మాలకన్నమదా సడావడిగాఁ బ్రక్కపైనుండిలేచి కారణంబులారయక యతివేగముగాఁ జేఁగఱ్ఱఁబూని "ఇదిగో! వచ్చితిని— భయపడవల"దని మాఱుమ్రోఁత మ్రోఁగునట్లు కేకలువేయుచు గజయూథంబులోనికిఁ గేసరివలె నాభిల్లచయంబుమధ్యంబునకు నొక్కత్రుటిలో దుమికెను.

ఇట్లు దుమికినకొలఁది నిముసముల కీసాగినవ్యవహారమంతయు మనస్సునకుఁ బట్టించుకొనుచు గోష్ఠంబునాక్రమించి చెలరేఁగుచున్న యాతస్కరనివహంబును లంకన్నమాద్రిందాఁకి వారికి నూపిరాడనీక చేఁగఱ్ఱతో సాముఁద్రిప్పుచు మఱొక్కచేతఁ దననిశాతఖడ్గంబు విక్షేపించుచు, గన్నమదాసు పాండవబలంబులతోఁబోరు సూర్యాత్మజుని జూపఱకు జ్ఞప్తికిందెచ్చుచుండెను. ఇంతకలకలంబచ్చట జరుగుచున్నను నూరిలోనివారి కిసుమంతయుఁ దెలియకుండెను. తూర్పు తెలతెలవాఱుచుండెను. పక్షిసంతానంబులయెలుంగులసందడు లాకులనడుమ వినవచ్చుచుండెను. ఆభిల్లులు మహావీరుండయిన కన్నమదాసుతోడి కయ్యంబునకు వెఱచి పాఱిపోవుటకైనను నాయోధుండట్లు సేయనీయఁడయ్యె. అందుచేఁ దమలో నెందఱీల్గుచున్నను వారొక్కండుగూడ మిగులకుండువఱకుఁ బోట్లాడవలసివచ్చెను. ఇట్లరుణోదయకాలంబునకు నామ్రుచ్చులందఱు నొక్కండుగూడఁ దిక్కకుండఁ గన్నమదాసు బాహాబలానలంబున కాఁగక మ్రగ్గి నేలంగూలిరి.

ఆవేళకుఁ బ్రతిదినంబునులేచి కాల్యంబులు నిర్వర్తించు పూర్వాచారనైష్ఠికబృందంబు లీమార్గంబునఁబోవుచు విషయంబంతయు విని తరువాత గ్రామంబునఁ జాటిరి. అప్పు డూరిలోనివారు

గోష్ఠంబుసమీపించి కన్నమకు స్తోత్రంబులతో నారతులెత్తి వానినింటికిం గొనివచ్చిరి. ఆహా! కన్నమదాసు శౌర్యము! లంకన్నచావఁగానే మెఱపువలె మెఱసి దొంగలపైఁదుమికి వారినెల్లర నెక్కటిమైనుఱుమాడిన యాతనిబాహుబలమును దలఁచుకొనిన నీనాఁడు మన శరీరంబులు గగుర్పొడుచుచున్నవి. ఇట్టిమహాశౌర్యంబు వెలిఁబుచ్చిన తనశిష్యునిఁజూచి బ్రహ్మనహృదయ మానందతరంగితమయ్యెను. ఆగ్రామటికలోని జనులుమాత్రమే కాక యితరగ్రామవాస్తవ్యులుగూడ నీశూరకృత్యమునువిని వచ్చిచూచి కన్నమను వేనోళ్ళ నగ్గించిరి. అప్పుడు కన్నమ "ఔరా! దుర్మార్గులచెయిదంబుల కంత ముండదుగదా. శత్రుత్వము మార్తురనణఁచుటకై యెట్టి నీచకార్యంబులనయినఁ బ్రేరేపించును. నీచత్వంబున కొడిగట్టు టవమానంబని యెంచనీదు. కాలవశంబున సర్వరాజ్యంబుఁబాసి యిట్లసుఖజీవనంబు గడపుచున్నను దయమాలి మలీమసచిత్తులై నలగామఁడును నాయకురాలును నింకను మనలపై నిట్లు దాడివెడలుచున్నారు. మనలనిప్పుడు కోఱలూడఁబెఱికినపాములుగా భావించి శాత్రవులు విజృంభించుచున్నారు. వారికుటిలోపాయం బొకటి యీరాత్రి నణఁచివైచితిఁగాని ముందిం కెట్టిదుష్టోపాయంబులఁ బన్నుదురో తెలియకున్నది. నలగామునిదయ్యముపట్టి యిట్లాడించుచున్నది. ఈదుష్కార్యంబులన్నియు నాతని కెఱుకలేకుండ జరుగునా? ఛీ! ఛీ! తుద కెట్టిదుష్టోపాయంబులు గనిపెట్టినారు!" అని బ్రహ్మనమొదలగు వారెల్లరయెదుట ననెను. అప్పుడు బ్రహ్మన "వారే యిట్టి దుష్కార్యంబొనరింపించిరని యెట్లనఁగల"మని ప్రశ్నించినవెంటనే శిష్యవతంసుండు "తండ్రీ! రాత్రి నాచే ఖడ్గఘాతంబులఁదిని క్రిందఁబడి మరణబాధ లనుభవించు కొందఱు నాయకురాలిఁ దలంచుకొని 'ఆముండచే నింతచేటు దెచ్చికొంటిమి గదా' యని వాపోయి"రని ప్రత్యుత్తరం బొసంగెను.



నాయకురాలింకను దుష్కార్యనిర్వహణోపాయంబుల మానకుంటచే బ్రహ్మన చాలవేసటయుఁ గోపంబును సూచించి కన్నమతోడను దమప్రభువగు మలిదేవునితోడను "ఇంక మనమీయూరినుండి బయలుదేఱుట మంచిది. దుష్టులకు దూరంబుననుండుట మేలని పెద్దలువచింతురు. చటులశౌర్యాప్రతిమానుండయిన మనలంకన్న నేలఁగూలిన మాట విని మనయందఱ హృదయము లతిదుఃఖపూరితములయినవి. ప్రస్తుతము బలముఁదక్కియుండుటచే నాయకురాలు మనలకింకను నెంతటిపనినైనఁ గావించును. ఇంతియ కాక, శ్రీశైలక్షేత్రంబు మహాపవిత్రస్థలమనియు విజ్ఞానధనులగు విరాగులకు నయ్యది నెలవనియు మనము చాలదినములుగా వినుచున్నాము. ఈదొంగలగుంపును జంపిన కోపంబుచే మనమీఁదఁ బ్రతీకారంబు మఱల నాయకురాలు సాధించుననుట యథార్థము. కనుక శ్రీశైలంబు చాలదూరంబుగావున వారి ప్రయత్నంబులు విశేషముగా సాగనీకుండుటయు భగవత్సందర్శనంబుఁ గావించి పాపతప్తులమగు మనము గతకల్మషులమయి యందుండు మహనీయులఁ బూజించుభాగ్యము గలిగించుకొనుటయు మంచిదిగాఁ దోఁచుచున్నది. వెనుక హిరణ్యకశిపునిదాడి కాఁగలేక భగవంతుండును గొన్నినాళ్ళు తప్పించుకొని తిరిగెనని ప్రతీతి. కావున నీయుద్దేశము గౌరవహీనమని యెంచవల"దని బ్రహ్మన వాక్రుచ్చెను. అంతట వారందఱును సమ్మతించి యామఱునాఁడే బయలుదేరి దొమ్మర్లరేవు కడఁ గృష్ణానదిందాఁటి విశుద్ధమనంబులతో శ్రీశైలమునకుం బోయిరి.

అచ్చటఁ బ్రకృతివైచిత్ర్యంబులను దేవాలయసౌభాగ్యంబును దర్శించుచు దేవతారాధనంబును సన్యాసులకుఁ బూజలను సలుపుచుఁ జాలదినంబులు గడపి యాయనఘులు మఱలఁగొన్నాళ్ళొక్కయూరనుండుట కుద్దేశించి సమీపంబుననున్న మేడపి యనుగ్రామంబుఁ జేరి యది వీరపుంగవులకు స్థానంబగుటచే దానికి వీరమేడపి యనుపేరుఁ బెట్టి యచ్చటనే నివసించుచుండిరి.

## ఏడవ యధ్యాయము.

మందాడియందుఁ బల్నాటివీరులు కొలఁదికాలంబు మాత్రమే కడపిరి. కాని, వారు నాయకురాలిదుండగము లొకటికి రెండు మితిమీఱుచున్నను జంకుకొంకులేక శాంతచిత్తములతో స్వసామర్థ్యోపాయంబులచే వానినన్నియుఁగడవంబుచ్చుచు వీరమేడపియందుఁ జాలకాలంబుఁ బోఁబుచ్చిరి. చాలకాలంబననేల! వారిగడువుపరిమితిలో మిగిలిన సంవత్సరంబులన్నియు నచ్చటనే కడపిరి. ఏడవసంవత్సరంపుఁ జిగురందుకొనుచుండిరి. బ్రహ్మనాదులకు "గడువుఁ బూర్తింజేసితిమిగదా! ఇంక మఱలఁబోయి యథాపూర్వము మాచెర్లయందు వానచినుకునకై వేచియుండు చాతకంబులపలె సత్ప్రభుత్వంబునకై వీరులరాక కెదురుచూచు ప్రజాళిని సంతోషపెట్టవచ్చు"నని యాలోచనంబులు మిక్కుటంబులగుచుండెను. కాని కాలపరిమితిఁ గడపఁగానే తమంతటఁదాము రాజ్యాంబాక్రమించుట గౌరవప్రదంబుకాదని యెంచి నీతికోవిదుండగు బ్రహ్మన తగినరాయబారి నొకనిఁబంప నిశ్చయించెను. బాలచంద్రుండును దత్స్నేహితులగు దుడుకుమగలును "ఏమీ! రాయబారమా? ఎందులకు? కాలవశంబున మావటివాని యంకుశంబునకు లొంగు మదగజంబట్లీవీరబృందము వారిచేతిలోఁబడి న్యాయముననో యన్యాయముననో తేజంబింతవఱకుఁ గోల్పోయి యవమానంబువడసినది. ఈయవమానంబువేఁడిమి చాలకయేనా మనమిప్పుడు వారికాళ్ళయొద్దకు రాయబారింబంపి రాజ్యంబిండని ప్రార్థింపఁజూచుట? మన మెందులకు ముందుగా వారిని బ్రార్థింపవలెనో మాకుఁదోఁచలేదు. ఇయ్యది శూరవరులకుఁ గూడనిపని. ఈనాలుగుదినంబులుగడపి మీసపుటొడుపుఁజూపుచు రాజ్యంబాక్రమించుకొనుట పౌరుషముగాని యాచ్ఞానైచ్యంబున రాయబారంబంపుట సమంజసంబుగాఁ దోఁపలేదు. అంతగా వారప్పుడు మించివచ్చినచోఁ జేతులతీట వోవునట్లు



సమరంబుసలిపి విజయలక్ష్మిని గడింపవచ్చు" నని బ్రహ్మనతోఁ బలికిరి. "ఈవాక్యంబులు పెద్దలు గౌరవింపఁదగినవికావు. మీరు నిన్న మొన్న వయసుఁగోఁబడుటచేఁ బ్రపంచానుభవంబు మీకు మిగులఁదక్కువగా నున్నది. కార్యనిర్వాహకునికి సమయోచితప్రజ్ఞ, దృఢాలోచనము, నీతికోవిదత్వము, శాంతచిత్తము నత్యావశ్యకములు. గడువుమించినది గదాయని తొందరపడి కార్యము నెఱవేర్పనెంచుట లగ్గుకాదు. మన గౌరవంబునకు హానిలేకుండఁ బ్రజాభిప్రాయమునకు భయపడుచు శాంతచిత్తంబుతోఁ గర్జంబుసాగింపవలెను. ఇట్లురాజ్యంబుఁ గోల్పోయి చెల్లియుండియుఁ దుదకు రాయబారంబులు నడపిన మహామహులు పూర్వమెందఱులేరు? జగదేకవీరులును, దృణీకృతధార్తరాష్ట్రులును నయినభీమార్జునులనునిర్వురిఁ దమ్ములఁ జేతిక్రిందనుంచుకొని యాగడువుముగించి తుదకు ధర్మరాజు శ్రీకృష్ణుని రాయబారిగాఁ బంపుకొనలేదా? అది పెద్దలయాచారము. అనతిక్రమణీయ"మని యుక్తాయుక్తజ్ఞుఁడయిన బ్రహ్మవీరుఁడు బాలచంద్రాదులతోనని వారింగూడ నొప్పించి రాయబారి నేఱికొనఁ బ్రయత్నించెను.

రాయబారినేఱికొనుట కష్టసాధ్యము. వాఙ్నైపుణ్యము, సమయజ్ఞత, యుచితసంభాషణము, నిస్తులావగాహనశక్తి, పరహృదయపరిశోధనసామర్థ్యము, రాచఠీవి, మొదలగునవియన్నియు రాయబారికవశ్యం బుండఁదగినవి. కన్నమదాసు, బాలచంద్రుండును లేచి "యిట్టిమహాగుణంబులు కలిగినపురుషపుంగవులు మనలోనెందఱో యున్నా"రని ప్రీతివాక్యంబులాడఁగానే "ఇవిమాత్రమే కాదు; వీనికన్నిఁటికి మిన్నయైనది రాయబారంబు విజయసూచకంబుగా నొనర్పఁగల రెండుపక్షంబులవారితోడఁ గలిగిన బాంధవ్యసంబంధము. దీనితో సమానంబేదియులేదు. మనయిరుతెగలవారితోడను బాంధవ్యంబుగలిగిన మహాగౌరవయుతుం డొక్కఁడున్నాఁడు. అతఁడు కళ్యాణపురాధీశ్వరుండగు

వీరసోముని మనుమండయిన యలరాజు. ఇతనిమేనత్తనేకదా మన పెదమల్లదేవుని కిచ్చినది. ఇంతియకాక, యలరాజు నలగాముని కల్లుండగుటచే నితఁడిరుపక్షంబులకుఁ గావలసినవాఁడు. కనుక నితని రాయబారిగానంపుట కార్యనిర్వాహకంబని తోఁచుచున్నది. ఇందు మీయభిప్రాయంబే"మని యక్కడనున్నవారందఱను బ్రహ్మనాయం డడిగెను. నాయనిదూరదృష్టి కందఱును మెచ్చి వల్లెయనిరి. ప్రభువైన పెదమల్లదేవుఁడును సమ్మతించెను. తరువాతఁ గొన్నిదినంబులకు నలరాజుం బిలువనంపి కావలసిన విషయంబంతయుఁ బెదమల్లదేవుఁడు చెప్పి యొక శుభదినంబునఁ దానును బ్రహ్మనాయఁడును రాయబారిని గొంత దూరముపోయి సాగనంపిరి.

అలరాజు వెడలినవెనుకఁ గార్యంబు సఫలంబు కాకపోదనియు బాంధవ్యసంబంధంబు తగినట్టులానుకూల్యంబు సమకూర్చుననియుఁ గొందఱుతలంచిరి. కన్నమ, బాలచంద్రుఁడు, మొదలగు యుద్ధవీరులు "రాయబారిని బంపినాము కాని కార్యంబు సఫలీకృతంబగునని పూర్ణవిశ్వాసంబు మాకులేదు. మన మెంతప్రయత్నించినను శ్వానపుచ్ఛంబు వంకరతీరనట్లు వారి దుర్హృదయంబు చక్కఁబడదు. అట్లని మానుట మంచిదికాదు. పురుషప్రయత్నంబుండవలెను. తరువాత దైవమే కలండు. భగవదనుగ్రహంబుచే రాయబారంబు ఫలవంతంబయి మన రాజ్యంబు వారు ధర్మబుద్ధితో మఱల మనలకొప్పగించినచో సంతోషమే. లేకనిరాకరించి కయ్యంబునకుఁ గాలుద్రవ్వ సూచన లగుపడుచో నరిభయంకరశౌర్యప్రాచుర్యంబునకు నొకమా అవకాశంబు గలిగినదని సంతసింపవచ్చును. ఇందువెనుకాడువా రెవ్వరును మందునకైన తేరనుట లోకవిదితముగదా" యని గంభీరోక్తులు పలికిరి.

అలరాజు బయలుదేఱినకొలఁదిదినములలో నలగాముని పట్టణంబుఁ జేరెను. నాయకురాలిన్నిదినంబులనుండియు మలిదేవులకుఁ



గావించిన దుండగంబు లాతఁడు వినియుండుటచే మామగారైనను నలగాముఁడు త్యాజ్యుఁడేయని లోలోన నిశ్చయించుకొనినను నట్టిమనోభావము వెలిఁబుచ్చుట రాయబారంబును ఫలకారిగాఁజేయదని యెఱింగిన యలరాజు సద్హృదయమునే నటించుచు రాజుగారియింటికిఁ దనరాకఁ గబురంపెను. నలగాముఁడును నంతఃపురంబులోని స్త్రీజనంబును మిక్కిలి సంతసించిరి. రాజుపక్షంబునఁ గొందఱు రాజోద్యోగులును నాయకురాలును వాని నాహ్వానింపఁబోయి యర్ఘ్యపాద్యాదులొసంగి యింటికిఁగొనివచ్చిరి. నలగాముండు దద్గృహయోగక్షేమంబు లరసి యాదరించెను.

అంతటఁ గుశలప్రశ్నంబులడిగి నలగామునితోఁ దాను వీరమేడపినుండి బ్రహ్మనాయనిపక్షంబున మాటలాడుటకై తమయొద్దకు వచ్చితిననియు మఱునాఁడు కొలువుకూటంబున వచ్చినకార్యంబుఁ బ్రస్తావింతుననియు నలరాజు వాక్రుచ్చెను. నాయకురాలిముఖప్రకాశము చీకురించెను. ఆనాఁడుగడచెను. మఱునాఁడు కొలువులోనికింబోయి యలరాజు లేచి సభకును రాజునకును నమస్కరించి "భూవల్లభా! రాజ్యంబుఁగోల్పోయియున్న మలిదేవభూపతి నన్నుఁ దమకడకంపినారు. వారు మున్ముందు మీయందఱయోగక్షేమముల విచారించి తాము మీలోనఁ బెద్దలకును జిన్నలకును దండప్రణామాశీర్వచనంబుల నొసంగినట్లు చెప్పుమని నాకాజ్ఞాపించినారు. అందుముఖ్యముగా బ్రహ్మనాయఁడు గురిజాలపృథ్వీవల్లభులగు తమయొక్క దిగంతవిశ్రాంతయశశ్చంద్రికను మిగులఁబ్రశంసించి కోడిపోరుఫలితంబు ననుసరించి సంవత్సరసప్తకంబును మొన్నగడచినపున్నమతోఁ బరిసమాప్తిం గావింతుమనియుఁ బోరునకుఁ బూర్వంబు దమక్రిందనుండి నాఁటినుండి నేఁటివఱకుఁ దమకధీనమైయున్న మాచెరలరాజ్యంబుఁ బునఃప్రసాదితంబుఁ జేయుదురని యాసపెట్టుకొని యుంటిమనియు నయ్యాది

నివేదించుటకై యీరాయబారి నంపుచుంటిమనియుఁ జెప్పుమని నన్నంపినాఁడు. దైవంబు ప్రాతికూల్యంబు వహించుటచే నాఁడు కోడిపోరొక్కటి ప్రాప్తించెఁగాని లేకున్నచో వారును మీరును నీరక్షీరంబులవలెఁ గలయికతో నుండెడివారే కదా! కర్మఫలంబుఁ దప్పింపనేరికినిగాదు. మలిదేవులును మీరును నన్నదమ్ములగుటచే మీరిర్వురుం బొందొనగూడియుండుట మీకును దేశమునకును క్షేమంకరము. అన్నదమ్ములనియేకాక యిరుగుపొరుగు రాజ్యంబులవా రన్యోన్యసుహృద్భావంబుననుంట పాడిగాని వేఱొండు తెఱంగు లాభదాయకముగాదు. అట్టివిభజనములోని నష్టము పరరాజన్యదండయాత్రాసమయంబుననే కాని విడివేళల జ్ఞాపకంబునకురాదు. మలిదేవుఁడు తమతోడను, నాయకురాలితో బ్రహ్మనాయఁడును స్నేహంబుననుండి యెవరిరాజ్యంబునవారు ప్రజలకు సౌఖ్యకరులుగా నుండఁ బ్రయత్నింపవలెనని వారియూహ. నియమభంగంబు లేకుండఁ దమగడువుఁ బూర్తి చేసియుంటచే మఱల రాజ్యంబు వారికిచ్చి గౌరవించుట పాడియగును. నేఁజెప్పవలసినదంతయుఁ జెప్పితిని. తరువాతఁ బ్రభువులయిష్ట"మని నివేదించెను.

ఇందులకుఁ బాదతాడితసర్పంబువలె మండిపడుచు "నీవిషయం బంతయు శ్రైపాలుండీవఱకే యోచించుకొనియుండెను. మీ మొఱలాలకించువా రిందెవ్వరును లేరని వారితో దూతవైననీవు స్పష్టముగాఁ జెప్పుము. రాజ్యంబుఁగోల్పోయి కడగండ్లఁగుడుచుచున్నను—జంతచచ్చినను పులుసు చావలేదనునట్లు—మాపై నెంతవిరోధభావంబు వెలిఁగ్రక్కుచుండిరో మాకుఁ జారులవలనఁ దెలియవచ్చినది. మీవంటి నీచబుద్ధులు దేశద్రోహులుఁ బరనిందాపరాయణులు మఱలఁ బ్రవేశించి యాప్రజల బాలింప నెంతమాత్రము నర్హులుగారనియుఁ బ్రజాభ్యుదయంబుఁ గోరువారు దీనికెన్నఁడును సమ్మతింపరనియు, నట్లు తమకు



యథాపూర్వంబుగా రాజ్యంబిచ్చి పాలింపించుట మాచెరలవారి గొంతుగోయుటతప్ప వేఱుకాదనియు, సన్మార్గవర్తనులగు గుర్జాల ప్రభువులకే యీరాజ్యము జన్మస్వత్వమ్ముగా భగవంతుఁడు ప్రసాదించె ననియు వారితో నొక్కి వాక్కాణింపుము. దుర్మార్గులపక్షంబుఁ బూని రాయబారంబునడపు నీనురుద్యోగంబునకు నీవొప్పికొనుట మీమామగారి కెంతయుఁ దలవంపులుగా నున్న"దని నాయకురాలు రాజుపక్షంబునఁ బ్రత్యుత్తరంబిచ్చెను.

అంతట నలరాజు కోపరక్తనేత్రుండై "ఏమీ! వారిమొఱలాలకించువా రిందెవ్వరును లేరా? ఛీ! దుర్బుద్ధీ! దేశద్రోహాదిసకల దుర్గుణములకు నిధానమవునీవా? వారా? కొలఁదిదినంబులలోఁ బల్నాటి వీర్యంబునకుఁ బెట్టినపేరయిన ధీశాలురు శాంతశమదమాదిసద్గుణమణివిరాజితులునగు బ్రహ్మనాదులు మిమ్ముఁదమకుఁ బాదాక్రాంతులగునట్లు చేసినప్పుడుగాని మీకు నాపలుకులు చెవికెక్కవు. ఆహా! గడువుఁబూర్తిఁ జేసికొని వారు తమరాజ్యంబు నాక్రమింపఁజూచుట యెంత యసమంజసముగాఁ గన్పట్టినది! చెట్టునకు వేరుపురువువలె నీవీనరనాథునికడఁ జేరి తదుద్దేశములుమార్చుచు దుర్బోధలఁ బెక్కులొనర్చి యాతని వశ్యునింజేసికొని రాజ్యంబు ననిర్వచనీయదుర్యశఃప్రాగల్భ్యంబున నేలుచున్నావు. నేఁటివఱకు నీవాడినమాటకు నడ్డుసెప్పువారెవ్వరును లేకుండుటచే వారిన్నికష్టముల పాల్గావలసివచ్చెను. ఇన్ని దినంబులనుండియు మీదుర్యశంబు వెలిఁబుచ్చకుండు నుపాయంబుతో బ్రహ్మన కష్టంబులన్నియు సహించియుండెను. సహనంబునకు మితి యున్నది. అతఁడింక నీదుండగంబు లెంతమాత్రము సహింపఁడు. అలుగురాజుపై నుండు ప్రేమాతిశయంబుచేతను జిన్ననాఁటినుండి నలగామరాజుగారిపై నభిమానంబుచేతను బ్రహ్మనాయఁడు తనశౌర్యంబు మీపైఁజూపక యోటువడినట్లూరకున్నాఁడు. ఇంక వారిప్రతాపాతి

శయానలంబునందు మీరందఱు మ్రగ్గిపోవుట నిస్సంశయంబు. ముఖ్యంబుగా నీయీసుఖజీవితం బంతంబొందుటకే యీరాజ్యనిరాకరణంబు వెలిఁబుచ్చినా"వని యామె నించుక మందలించెను. ఆమందలింపుల నొకచీరికింగొనక నాయకురాలు రాజునెదుట నేమనక లోలోనఁ గోపానలదందహ్యమాన యగుచుండెను.

అలరాజాడిన దుర్భాషణంబులువిని నాయకురా లూరకొనదని సభలోనివారికందఱకు గోచరించెను. తరువాత నలరాజు నలగామునితోఁ గూడఁ బ్రసంగించి రాజ్యనిరాకరణంబే రాయబారంబునకుఁ బ్రత్యుత్తరంబుగాఁగొని రా జెంత కాదుకూడదనినను నంతఃపురంబున భుజింప నొల్లక యానాఁడే బయలుదేఱి సమీపమందున్న చెర్లగుడిపాడునకుం జేరఁజూచెను.

అచ్చటఁ బూర్వంబునుండియు మలిదేవపక్షాభిమానులయిన వారెందఱో యుండిరి. వారియిండ్లఁ గొలఁదిదినంబులుగడపి మునుముం దెల్లే యుద్ధంబు సన్నద్ధంబగుంగదా యనువిశ్వాసంబునఁ జుట్టుపట్ల గ్రామంబులలో బ్రహ్మనపక్షంబు నాసించి పనిచేయువారలకై ప్రయత్నంబులుసలిపి యనంతరము వీరమేడపికిం బోవఁ దలంచెను.

గురిజాలకువచ్చి రాజు కొల్వుకూటంబున సామంతామాత్యబృందవిద్వజ్జనంబులు బలసియుండ వారియెదుటఁ బల్నాటిరాజ్యం బవక్రపరాక్రమంబున నచ్ఛిన్నధైర్యంబున నిరాఘాటముగా నేలుచున్న తనపై నిందావాక్యంబులాడి తన్నుఁ దృణప్రాయునుగాఁజూచిన యలరాజు నాత్మకోపానలంబునకు శలభంబుగఁజేయ సమకట్టి యాతని మామగారియెదుట విశేషించి కోపవచనంబులాడుట సమంజసంబుగా నుండదేమో యనుశంకచే నాయకురాలు మెదలకయుండినను యాతఁడింటికిం బరువువాఱకముందే తగిన శాస్తిఁజేయింపవలె నను దృఢాభిప్రాయంబుతో నుండెను.



నలగామరాజునకు నరసింగరా జనుపినతమ్ముం డొకఁడుండెనని చదువరులకుఁ దెలిసియేయున్నది. పెదపినబాలమలిదేవులు బ్రహ్మనతో నీవలకు మాచెరలకుం జేరిరి కాని ఘట్టినరసింగు లిర్వురును నలగాముని యింటనే యుండిరి. మొట్టమొదటినుండియు నరసింగరాజు నాయకురాలికిఁ జేదోడు వాదోడుగానుండి, యతిస్నేహంబునఁ బ్రవర్తించుచుండెను. ఆమె రాజునకుఁ దెలియకుండఁగూడ రాజసోదరునికి నప్పుడప్పుడు కొంతకొంత ధనసహాయంబుఁ జేయుచునే యుండెను. అతికృతజ్ఞతఁజూపించు స్వభావంబుగల నరసింగు నేఁడు దనకు సాయంబుఁజేయంగలఁడని మంత్రిణి కడునుత్సహించి యాతనితో రహస్యంబుగా నాఁడేమేమొపలుకాడి యాతని నొప్పించి కొందఱ భటుల నిచ్చి యెచ్చటికో నరసింగుం బంపెను.

సంధికుదురకపోయెనను విచారంబు మనంబున దందడిగొన తలవ్రాఁత దుర్లంఘ్యంబుగావునఁ గయ్యంబు గాకతప్పదని భవిష్యత్కర్తవ్యముఁగూర్చి పలుమాఱు తలపోయుచుఁ దనతోవచ్చినభటులతో నలరాజు చెర్లగుడిపాడునకుం జేరఁబోవుచుండెను. త్రోవలో మహారణ్యంబొకటి కానవచ్చెను. ఆ కాంతారంబులోనుండియే చెర్లగుడిపాడునకుం బోవలసియుండెను. అందుఁ బ్రవేశించునప్పటికి జామునకుఁ బైగాఁ బొద్దుపోయెను. ఇంక మూఁడుగంటలలోఁగాని యాగ్రామంబుచేర వీలులేదు. ఇంతలో నిర్వుర భటులం దీసికొని వెనుకనుండి నరసింగు వచ్చి యలరాజుంగలిసికొనెను. పినమామగారగుటచే నలరాజతని గౌరవసూచకభాషణంబు లాడెను. నరసింగుగూడ నలరాజుతో నత్యధికప్రేమంబున మాటలాడుచు రాయబారంపువిషయంబుఁగూడఁ జర్చింప మొదలువెట్టి—సాధారణంబుగా నిర్వురుసంభాషించుచుఁబోవుచుఁ గొండొకయెడఁ గూర్చుండునట్లు—విషయావధానైక్యంబుచే వారు తమపల్లకీల నచ్చటనేదింపి యొకచెట్టు క్రిందఁ దివాసీపైఁగూర్చుండిరి. బ్రహ్మ

నాదులకు నాయకురాలొసర్చిన దుండగంబుల నలరాజు వరుసవెట్టి నిరూపించునప్పుడు నరసింగు కాదనలేకపోయెను. కాని హృదయంబు లోనివిషయం బావంతయుఁ దెలియనీయకుండెను. అలరాజు కొల్వునుండి వెడలిపోయినవెనుక రాజునకును నాగమకును వీరివిషయమై యభిప్రాయభేదం బించుకకల్గెనని సాభిప్రాయంబుగా నరసింగు మొదటనే వాక్రుచ్చుటచే నలరాజుమనస్సు చిగిర్చి యింతసేపు వానితో మాటాడఁజేసెను. రెండుపక్షములకు సమరంబు తప్పుననియు వారందఱు నీరక్షీరంబులవలె నుంట కవకాశం బేర్పడెననియు నలరాజుతలంచెను. రెండుజాము లతిక్రమించెను. భోజనంబునకు వేళ మించుచుండెను. ప్రసంగం బింకను ముగియలేదు. నరసింగు లేచెను. జామాతయు మాటాడుచునే నిలువంబడెను. ఇర్వురును బ్రసంగించుచునే యానంబులపై నెక్కిరి. సాగుచుండిరి. సంభాషణంబు ముగియలేదు. ఒక్క-క్రోశంబు బోయీలునడచిరి.

అచ్చట నరణ్యమధ్యంబున నిర్వురుబాటసారు లన్నాదిపదార్థంబులువండుకొని భోజనంబునకు లేవనుంకించుచుండిరి. వారు శైవమతావలంబకులయిన బ్రాహ్మణోత్తములుగా వారివేషంబులు చెప్పకయే చెప్పుచుండెను. నరసింగును నలరాజును దోలీవఁజనుచుండుటఁగాంచి వారి దివ్యవిగ్రహంబు లాశ్చర్యంబుగాఁ బొగడుచు నాకపటబ్రాహ్మణులు వారి ద్వారఁదమకడ నాతిథ్యంబుఁగొనవలెనని ప్రార్థించిరి. అంతకు మున్నే భోజనంబున కకాలంబయ్యెనని యాసుకుమారశరీరు లిద్దఱును వల్లెయని వారు వండుకొన్నయాచెట్టునకు సమీపంబుగా వేఱొక చెట్టుకడ దిగి చేరువనుండు కొలనిలో స్నానాదికంబులు నెఱవేర్చి భస్మంబు మొగంబున నలఁదివచ్చి కొంతవడి శివపూజయొనర్చి భోనంబునకుఁ గూర్చుండిరి. చేసినవంటకంబుల నాకపటద్విజులు నరసింగునకును నలరాజునకును బ్రత్యేకత్వంబు సూచించునట్లు వడ్డించుచుండిరి.



కొంతసేపటికి భోజనంబు ముగిసెను. మఱల గురిజాలకువచ్చి రాయబారంబునడపుచో మేలుచేకూరునని నరసింగు వాగ్దానంబొసంగియుంటచే నతండొప్పుకొని చెర్లగుడిపాడునకు గండుకన్నమనాయఁడు వచ్చియుండెనని పూర్వగ్రామంబున వినియుంటచే నతనితోమాట్లాడి మఱలఁ దప్పక నలగామునికడకువత్తునని నరసింగుతోఁజెప్పి యాయూరికిం బోయెను. నరసింగంతట నాయకురాలి యుద్దేశము సక్రమంబుగా నిర్వర్తించినవాఁడగుటచేఁ త్వరగా గురిజాలపట్టణంబునకుం జేరెను. నరసింగలరాజుతోఁ గలిసి సంభాషించినవిషయంబు గురిజాలలో నెవ్వరికి—రాజునకుఁగూడఁ— దెలియకుండెను.

అలరాజు పాపమాశాంబరీభూసురుల భోజనంబుఁగొని త్రోవఁబట్టి కొంతదూరము చనునప్పటి కాతనికి వాంతులు ప్రారంభించెను. అయ్యవి క్రమక్రమంబుగా ముదిరి తత్ప్రదేశంబున భటులమందు మాత్రలచే ననివర్త్యమానంబులై తుదకు నలరాజు భూలోకంబుఁ బాయుటకుం గారణంబులయ్యెను. తోడనున్నభటులు విషణ్ణహృదయులై మహాభీతితోఁ బ్రాణంబు లఱచేతఁబెట్టుకొని చెర్లగుడిపాడుం జేరి గండుకన్నమనాయనికి నీదుర్వార్తవినిపించుచు భోజనంబు నలరాజునకును నరసింగునకును నాకపటబ్రాహ్మణులు వడ్డించుటలో ద్వైధీభావంబుఁ గల్గించుటనుగూర్చి విస్పష్టంబుగ వక్కాణించిరి.

అంతటఁ జెర్లగుడిపాడులోని పెద్దలంతఱును దీనిని విమర్శింప భోజనముగావించినప్రదేశమునకుం బోయిరి. అలరాజునకును నాతని యనుచరులకును నించుకంతభేదంబుతో వడ్డించి యారాత్రికూడ నందేయుండి! మఱునాఁడు ప్రయాణంబుసల్పెదమని ప్రసంగవశంబునఁ జెప్పియుండిన యాకైతవధాత్రీసురద్వయ మాప్రదేశంబునతేకుండుటఁ గాంచి వారు నాయకురాలిచేతను నరసింగుచేతను నలరాజురాకకుఁ బూర్వమే యీ దురుద్యోగంబునకై పంపఁబడిరనుట నిశ్చయంబయి

యుండుననితలంచిరి. తరువాత నలరాజుపడియున్నచోటఁ బరీక్షింపఁగాఁ గ్రక్కఁబడియున్న పదార్థంబు విషసమ్మిళితంబైయున్నదని వారిలోని వైద్యశిఖామణులు గ్రహించిరి. నాయకురాలిట్టిమహాపాతకంబుఁ గావించినదని యూరూర మ్రోఁగెను. గురిజాలయందును వీరమేడపి యందును నది ప్రతిధ్వనించెను.

గురిజాలరాజ్యంబునం దంతటను రాయబారి ఘోరమరణంబు ప్రజాసంఘంబులందుఁ గోపంబునకుఁ గారణంబయ్యెను. ఈ విపత్తునకెల్లఁ దనదుశ్చేష్టితంబే మూలబీజమని నలగామునికి నాయకురాలు దెలియనీకుండెను. ఇంతియకాక నరసింగు చెర్లగుడిపాటి కాననంబులో నలరాజుఁ గలిసికొనినవిషయంబుఁగూడ రాజుచెవిం జొరకుండునట్లు మంత్రిణి తగునేర్పాటు లొనర్చెను.

వీరమేడపిలో నీదుర్వార్త యామఱునాఁడే వచ్చిపడెను. ప్రజాహృదయంబులయందుఁ గోపరసంబు తలమునుకలుగాఁ బొంగిపొరలుచుండెను. ఎవ్వాని మొగంబునఁజూచినను గోపదేవత తాండవమాడుచుండెను. ఇంక బ్రహ్మనాదులఁగూర్చి చెప్పనవసరములేదు. వారికీ వార్త హృదయంబును గోపశోకరసంబులచే నింపి బ్రద్దలుచేసెను. బ్రహ్మనాయఁడు కన్నమనాయఁడు బాలచంద్రుఁడు మొదలగు యోధవరులందఱు నాయకురాలందున్నచోఁ గత్తి కొక్కకండచొప్పునఁ దీయునంతటియావేశమును వెడలఁగ్రక్కుచుండిరి. అలరాజు చావునకై యేడ్పును, నంతకంటె వేయిమడుంగులుగాఁ గ్రోధంబును బయలువెడలుచుండెను. ఆయోధబృందంబున మార్తురపై దుముక నుద్యోగింప నీడఁ బోయినవాఁ డొక్కండైనను లేక యందఱును దక్షిణము యుద్ధసన్నాహములొనర్పవలయునని హెచ్చరించిరి. బాలచంద్రుఁడుచూపులకుఁ బదునెనిమిదేండ్ల లేఁబ్రాయపువాఁడయ్యును వయసుమీఱిన పోటుమగలకంటె నెక్కుడుగాఁ దన నూనూగుమీసంబుపైఁ జేయివైచి



హుమ్మని పదఘట్టనంబుఁ జేసి కోపానలదీప్తులు కనుగెలంకుల స్రవించుచుండ భీకరాకారుండై "ఔరా! బాలరండా! ఏమీ! యింతకండకావరమా? కన్నులు నెత్తికెవచ్చినవా? మర్యాదకొఱకు రాయబారిం బంపితిమికాని నీకును గాజులుదొడిగించికొని కూర్చుండియున్న నలగామునికిని జడిసి పంపితిమనుకొంటివా? అట్టిసాటిరాచవానిని రాయబారిగాఁబంప నెంతక్రౌర్యంబు వెలిఁగ్రక్కినావు? నీశిరంబును మన్నిశాత ఖడ్గవిక్షేపత్రుటితముగాఁ జేయఁదలఁతుఁగాని నీవు నిర్భాగ్యమైన యీ యాఁడుపుట్టువుఁ బుట్టుటచే నావంటిమగనికి నీపైఁ గత్తిఁదూయుట యవమానకరంబు. నీవిషయంబున నేనిప్పుడు కోఱలుదీసిన సర్పంబువలె లోలోనఁ గోపంబుఁగ్రక్కుట తటస్థించినది. నీచేఁ బ్రోత్సహింపఁబడి మునుముందుగా నిర్వురు బ్రాహ్మణవేషధారుల నరణ్యంబులోనికిం బంపి వంటకంబు సవరింపఁజేసి ప్రత్యేకంబుగా నలరాజునకు విషాన్నంబుఁ బెట్టించి కపటప్రేమంబుఁ జూపినయారాక్షససమానుని నామదోన్మత్తుని నరసింగును నెల్లేని యుద్ధభూమిలో నిల్లునట్లుగాఁజూచి శ్లాఘాపాత్రుండనై శౌర్యముంజూపి పగదీర్చుకొన నవసరమయినచో నేనుగూడ మడియుటకు సిద్ధముగానున్నా"నని సపౌరుషంబుగాఁ బలికెను. కన్నమ కోపావిష్టహృదయుఁడై "తమ్ముఁడా! ఇంత ఘోరకార్యంబొనర్చిన యానాయకురాలిఁగూర్చి యూరకొనియుంట పాడిగాదు. కావున నేను మహాశేముషీమంతుండను ధీరుండునునయిన బ్రహ్మవీరునికి శిష్యుండనయినచో నాయకురాలిని యుద్ధభూమిం బట్టుకొని బంధించి తండ్రిగారియెదుట నిలిపి తత్పాదాక్రాంతం జేసెదనని యీసభామధ్యంబున శపథంబుఁ జేయుచున్నా"నని గంభీరంబుగాఁ బలికెను.

ఇట్లనేకయోధు లనేకప్రకారంబులుగాఁ బ్రజ్ఞలుసారించి తాత్కాలికకోపోపశమనముఁ గావించికొనిరి. నిండుకుండయయిన బ్రహ్మన కోపోద్రేకంబు స్తంభింపఁజేసికొని మునుముందు కర్తవ్యంబేమని

గాలివానకుముందుండునట్టి శాంతంబుఁ బోనిశాంతంబుతో గంభీరాలోచనంబులు గావించుకొనుచుండెను.

తరువాతఁ గొంతసేపటికి బ్రహ్మనాయఁడు సాలోచనంబుగా లేచి ప్రభువైన పెదమలిదేవుని సభాసదులను గలయంజూచి సంబోధించి "మన యిరుకక్షులకునుగల వ్యవహారంబు ముదిరినది. రాయబారిం బంపి వారియనుమతింగొని మా చెర్ల రాజ్యంబుఁ బ్రవేశించుట పాడియని మునుముం దూహించితిమి కాని న్యాయ్యంబుగ నొసంగవలసిన రాజ్యంబు నిరాకరించుటయేకాక రాచబిడ్డయయిన యలరాజుంగూడ రూపుమాపుదురని కలలోఁగూడఁ దలంపలేదు. ఇట్టికార్యంబు మన పౌరుషంబు నాహ్వానించుచున్నది. ఇప్పుడోహటించితిమా శాశ్వతంబైన కళంకము పల్నాటిశౌర్యంబుపై నిలిచియుండును. కావున నోయోధవరులారా! మన మణుమాత్ర మాలస్యంబొనర్పక యీవచ్చు కార్తికమాసారంభమునుండి యుద్ధంబొనర్చుటకై తగుసన్నాహంబు లొనర్పవలెనని మిమ్ములనందఱ హెచ్చరించుచున్నాను. కాని యిట్టిమహాకార్యంబునకు సమకట్టుటకుముందు మా ర్తురకు మనయుద్దేశంబు సవిస్తరంబుగఁ దెలియంబఱచి సిద్ధంబుగ నుండుఁడనుట రాజనీతికావున మనభటులలో నొక్కని వారికడకుం బంపుద"మని పలుకఁగానే గుసగుసలతో మిగిలినవారందఱును బ్రభువైన పెదమలిదేవుఁడును సమ్మతించిరి. అంతట విశ్వాసపాత్రుండగుభట్టు నొకని రావించి వానితో "నీవిప్పుడు గురిజాలపురికింబోయి నలగామమహారాజుసభకు సమస్కరించి 'మీ రన్యాయముగా నీయవలసియుండిన రాజ్యంబు నిరాదరణపూర్వకంబుగా నిరాకరించుటయేకాక పైపెచ్చు రాజనీతికివిరోధంబుగా రాయబారియైన యలరాజుంగూడ విషాహారంబుఁబెట్టి సమయించితిరిగావునఁ బగఁదీర్చుకొనుటకును రాజ్యంబు జయించుకొనుటకును మీపై యుద్ధంబుఁబ్రకటించి యీవచ్చు కార్తికమాసారంభము



నుండి కార్యమపూడిం జేరి మిమ్మెదుర్కొన నిశ్చయించిరని తెలియఁజేయ మలిదేవరాజేంద్రుఁడు నన్నుఁబంపినాఁ' డను సందేశంబును నీవు రాజునకు నివేదింపు"మని బ్రహ్మన యాజ్ఞాపించెను. బాలచంద్రుఁడు, కన్నమదాసు భటునితోఁ దమశపథంబులఁగూడ నలగామునితోడను నాయకురాలితోడను జెప్పుమని నొక్కి పలికిరి. అంతట భటుండు మలిదేవు ననుజ్ఞంబొంది గురిజాలకుంబోయెను.

భటుఁడు యుద్ధసందేశంబుఁగొని గురిజాలకుం బయనంబు కాఁగానే క్షణముగూడ నాలస్యంబొనర్పక వీరులు యుద్ధసన్నాహంబు గావింప మొదలుపెట్టిరి. మలిదేవభూపతితమ్ములు, బ్రహ్మనాయఁడు, బాలచంద్రుఁడు, మాలకన్నమదాసు, గండుకన్నమనాయఁడు, చనిపోయిన యలరాజునకుఁ దండ్రియయిన కొమ్మరాజు—మొదలగువారు కార్యాలోచనసభంజేసి పిమ్మట వివిధప్రదేశంబులకుఁ బోయి నాయకురాలిచేఁ దమకుఁ గావింపఁబడిన దుష్కృత్యంబులు దృష్టాంతపూర్వకంబుగా యాషిపఱచుచు జనాభిప్రాయంబుఁ దమవశంబుఁ గావించికొని వారిలోని యోధమణులను సైనికులనుగా వేనవేలు దమలోఁ జేర్చుకొనసాగిరి. ఏవైపులకుఁబోయినను బ్రజాభిప్రాయంబు నాయకురాలికి వ్యతిరేకంబుగా మాఱఁజొచ్చెను. బ్రహ్మనాయనియందు నెల్లెడలఁ బ్రజాసంఘంబులకు గౌరవంబు ప్రబలమయ్యెను. ఆతఁడు యుద్ధోపన్యాసములచే వివిధగ్రామంబులలోనిపౌరుషశాలుర నెల్లరను నరేంద్రుండు నాగస్వరంబున నాగంబులనాకర్షించునట్లుగా సమాకర్షించి వారిని మీసంబుపైఁ జేయివైచి నాయకురాలిఁగూర్చి పరుషవాక్యంబు లాడఁ బురికొల్పెను. అనేకసహస్రసైన్యంబుల బ్రహ్మనాయఁడు దనవశంబుగావించికొని సమరోత్సాహసముద్రంబున మునిఁగి తేలాడుచుండెను.

తరువాత యోధవరులెందఱో సైనికనివహంబెంతయో యాశ్రితులు మొదలగువారెందఱో లెక్కించుకొని వారంద

లకుఁ గావలసిన భోజనసామగ్రులు సేకరించి కార్యమపూడికిం బంపి యచ్చట యుద్ధభూమికిఁ గొంతదూరంబుగా శిబిరంబుల నేర్పఱించి వచ్చుటకు గండుకన్నమం బంప నాతం డట్లు సేసెను.

యుద్ధసందేశంబుఁ గొంపోయిన వీరభటుండు నాయకకవివైణిక విద్వజ్జనబృందంబుచే బలసియున్న నలగామునికొల్వుం బ్రవేశించి ప్రభువునకు నమస్కరించి మలిదేవుం డంపినయుద్ధసన్నాహవార్త వినిపించెను. అంతట నలగాముండు తోఁకఁదొక్కిన పామువలెఁ గోపంబుఁ గ్రక్కుచు "ఏమీ! అలరాజుచావునకు మారాజకుటుంబం బెంతయు దురపిల్లినదికాని యాతనిమరణంబునకు మేమే కారణముగా నిరూపించుచుంటివా? ఆహా! దుర్మార్గుఁడా! మలిదేవా! ఇట్టియబద్ధంబులు వల్కినట్టిది నాల్కా! తాటిదూలమా! ఇట్టికారణంబులు గొన్నింటిఁ గల్పించినఁగాని నీపక్షంబునకు సైనికుల బలపఱచుకొన వీలులేదనుకొంటివికాఁబోలు. ఇట్టిదుర్బుద్ధికి రాజ్యంబుగూడ నొసంగవలెనా? ఛీ ఛీ! నీకు సూదిమోపినంతఁగూడ రాజ్యం బీయను బొమ్ము. కార్యమపూడిం జేరెదను. పౌరుషశాలివైనచోఁ బైకివచ్చి మాదుస్తరమైన సైన్యసముద్రంబును సంక్షుభితంబుఁ గావించి జయించిపొమ్ము; లేదా! నోరుమూసికొని మిన్నకుండుమని ప్రత్యుత్తరం బంపితినని బ్రహ్మనతోడను రాజుతోడను నివేదింపు"మని యాభటునితోఁ బలికెను. ప్రతిసందేశంబుఁ గొని భటుఁ డానాఁడే బయలుదేఱి వీరమేడపికిం బయనమయ్యెను.

నలగాముండును నాయకురాలును దదితరాప్తవర్గంబును గార్యాలోచనసభయందుఁ గూడి యుద్ధవిషయం బామూలాగ్రముగాఁ జర్చించి సాధకబాధకంబులారసి వెనుదీయుట పల్నాటిశౌర్యంబునకు లగ్గుగాదని నిశ్చయించి వేర్వేఱునాయకుల వేఱువేఱుద్యోగంబుల నియమించిరి. యుద్ధసామగ్రులం గూర్చుటకుఁ గొందఱును, ఖడ్గా



ద్యాయుధపరిశీలనం బొనర్చుటకుఁ గొందఱును, గార్యమపూడి యుద్ధభూమిం జేరవచ్చునిజపక్షాభిమానులగు భూపాలురకు శిబిరంబులు వేయింపఁ గొందఱును, నితరకార్యంబులకుఁ గొందఱును శక్తిమంతులు నియమింపఁబడిరి. నాయకురాలు వివిధరాజన్యులఁ దమపక్షంబునకు నాకర్షింపఁ దానే బయలుదేఱిపోయెను. తమక్రిందనుండి యప్పనంబుఁ జెల్లించువారిలో భయముచేఁ గొందఱును గప్పంపుబాధఁ గొంతవఱకుఁ దగ్గించెడినిబంధనలతో మిగిలినవారును సైన్యగజాశ్వములం గొనిరా నిచ్చగించిరి. భూవాంఛయో లేక యపరిమితధనవాంఛయో హృదయంబును బాధింప నితరరాజపుంగవులు గొందఱు సహాయం బొనర్ప సమ్మతించిరి.

అంతటఁ గార్తికమాసారంభంబున నొక్కనిర్ణీతదినంబున నాశ్వికపదాతిసైన్యంబుల వెంటనిడుకొని రాజపుంగవులు నిర్భరోత్సాహముతోఁ గార్యమపూడిరణరంగంబునకు నలగామునిం గలియఁ బయనమైరి.

భటునిచేఁ బంపిన ప్రతిసందేశంబును విని ద్విగుణీకృతావేశులై వీరులు ముఖ్యముగాఁ గొమ్మరాజుహృదయవ్రణంబు మాన్పుటకును ననంతరము రాజ్యసంపాదనంబుకొఱకును గార్యమపూడి యుద్ధభూమికిం బయలుదేఱ నిశ్చయించిరి. పెదమలిదేవభూపతి యాప్తవర్గంబు నంతయుఁ జేరంబిలిచి "వీరపుంగవులారా! మనము యుద్ధభూమికి నెల్లి నేఁట సాగిపోవలయును. మగవాండ్రమందఱ మొక్కండైన నిట మిగులకుండ సంగ్రామభూమికిం బయనంబగుచో వీరమేడపియందున్న మన స్త్రీజనంబునకుఁ గాపెవరుందురు? విరోధిజనంబులం దందఱు యుద్ధభూమికి వత్తురని యూహించుట కేవలము ప్రమాదము. పురుషులందఱు రణరంగంబున కేతెంచినవార్త యెదిరికక్షులోనివారు విని రహస్యంబుగా వీరమేడపికివచ్చి గందరగోళముఁ జేయుచో మనమేమి

చేయఁగలము? అనేకదినంబులనుండియు నాయకురాలి దుశ్చేష్టితంబులు చవిఁజూచుచున్న మన కిట్టియూహాలు పొడముట స్వాభావికమే కాక యావశ్యకంబుగూడ నైయున్నది. కావునఁ బెద్దలమగు మన మందఱము సమరప్రదేశంబునకుం బోయి శక్తికొలంది శౌర్యపటుత్వంబులుసూపి చేతికినైనచో రాజ్యంబు జయించుటయో లేక చచ్చి వీరస్వర్గం బనుభవించుటయో — యేదేనొకదానికి సిద్ధంబుగనున్నాము. బాలమలిదేవుఁడును, బాలచంద్రుండును, దత్స్నేహితబృందంబును ముందున కక్కఱకు రాఁదగినవారలు, వృద్ధికాములు, లేతవయసువారునగుటచే నట్టివారిని మనతోఁగూడం గొనిపోయి యవసరమగుచో రణదేవతకుం బలియిచ్చుట సమంజసంబుగాఁ దోఁపలేదు. కావున వారు వీరమేడపియం దుండవలెననియు బాలమలిదేవుండు ప్రభువుగాను బాలచంద్రుండు మంత్రిగాను బ్రాహ్మణపుత్రుండును ద్రోణాత్మజునికి సమానుండును నయినయనపోతు కార్యాలోచన సభాధిపతిగాను ధీమంతురాలయిన మాడచియనుదాసి యంతఃపుర రక్షణాధికారిణిగాను నుండవలెనని యాజ్ఞాపించుచున్నా"నని పలికెను. అంతట బాలచంద్రుఁడు, చాందన్న మొదలగువారు లేచి "ప్రభువరా! మేమిన్నిదినంబులనుండియు మామాపౌరుషంబుల నాయకురాలి సైన్యంబుపయిం జూపసమకట్టి సమయంబునకై వేచియున్నాము. అట్టితఱిఁ దమయాదేశము మాకు హృదయశల్యమై బాధించుచున్న"దని వినయపూర్వకంబుగా వచించినను రాజు వారిమొఱ వినకుండుటచే వా రంగీకారంబుఁజూపి వీరమేడపియందే యుండసమ్మతించిరి.

పిమ్మట మలిదేవభూపతియు బ్రహ్మనాదివీరశ్రేష్ఠులును దమకుఁ దోడైవచ్చిన వివిధయోధనికాయంబులును గొలఁదిమంది నలగామునికి విరోధులయిన రాజులును వారివారి యాశ్వికాదిదళంబులును మహాసంరంభంబునఁ బయనమై కార్యమపూడికిం బోయిరి.

---



## ఎనిమిదవయధ్యాయము.

వీరులలో నగ్రగణ్యులయిన బ్రహ్మనాయఁడు, మాలకన్నమదాసు, గండుకన్నమనాయఁడు, మొదలగువారందఱు సేనాసమూహంబుల వెంటనిడుకొని పోవ వీర్యాతిరేకంబున నుక్కుమిగిలిన గండరగండఁడైన యాసింహకిశోర మాబాలచంద్రుఁడు సస్నేహితుండై వీరమేడపియందే కాలక్షేపముఁ జేయవలసివచ్చెను. పేరుగల మగలకందఱకుఁ గార్యమపూడిఁ జేరుటయే కర్తవ్యమని యెఱింగియు రాజాజ్ఞ నిర్వహించుటావశ్యకంబగుటచే లోలోన నుత్సాహంబు సడలించుకొనుచు బాలుండు తల్లియైన యైతమ్మయొద్దనేయుండి ముద్దులుగుడుచుచుండెను. చిన్నతనంబునుండియు బాలునికి వయస్యులయియుండిన దోర్నీఁడు, చందన్న మొదలగువారింగూడి బొంగరాలాడుట వాడుకగానుండెను. పనిపాటలేమియు నింటలేకుండుటచే నాసింగంపుఁగొదమకిప్పుడు బొంగరములపై నాసపోయి యతఁడు తనతోడివారలంగూడి యాడనిశ్చయించెను. అంతట వాని నల్లారుముద్దుగాఁ బెంచుచున్న యైతాంబ పెట్టెలోని బంగరుబొంగరాలఁ గొన్నిఁటినొసంగి యప్పటికాతఁ డెల్లప్రాయంబుననున్నను— నెంతిపెద్దయయినను గొడుకు తల్లికిఁ బ్రేమాస్పదుఁడే కావునఁ—గుమారు నంకంబునఁ జేర్చి మూర్ధంబుముద్దిడి వానిం బంపెను. బాలచంద్రుం డనపో తనుబ్రాహ్మణస్నేహితునిగూడఁ దీసికొని మిగిలినచెలికాండ్రకుం గబురంపి తాను సముచితాలంకారమండితంబయిన యొకపొట్టే లెక్కి గ్రామాభ్యర్ణ విజనప్రదేశంబున కేగెను. ఇంతలోఁ జందన్న మొదలగువారును "నన్న గార్లయిన" బాలచంద్రానపోతులయాజ్ఞ ననుసరించి సొగసైన బొంగరంబులఁదీసికొని యూరిబయలునకుంబోయి వారిం జేరిరి. బ్రహ్మనాయనిపుత్రుండయిన బాలచంద్రుఁడు సమధికోత్సాహంబుతోఁ బొంగరా లాడఁబోవుచుండెనని మేడపిలోని యాబాలగోపాలమునకుం దెలిసెను. ఊరిలోని చిన్న

లును బెద్దలును జేరువడిన బాలచంద్రునియాటయొక్క సొబగుంజూడం బోయిరి. అత్తలబాధలేనిపడుచు లెందఱో యాతని, నాతనియాటను జూడవలెనని కుతూహలపడిరి.

ఇట్లూరిలో గృహవ్యాపారములందు నిమగ్నులుగానివా రెందఱో యాయాటచోటునకు వచ్చి నలుగెలంకుల మూఁగిరి. ముత్తెంపుఁ గుట్టుగల పట్టుకుచ్చుదారంబులఁ దీసికొని యాడఁదగువా రందఱును రంగంబునఁ జేరిరి. అందుఁ దారానివహంబునడుమఁ జంద్రునివలె నాటగాండ్రమధ్యంబున బాలచంద్రుఁడు కాంతిపుంజంబు వెదచల్లుచుండెను. వారందఱు నొకరికొకరు తీసిపోవువారు కాకుంటచేఁ జేనుండి బొంగరము జాఱినప్పుడు భుజాబలవిక్షేపంబులు 'రంయ్' మని ధ్వనించుచుండెను. అందు ముఖ్యముగా బాలచంద్రుని బొంగరము చేనుండిపడి నేలపై నెన్నియో వన్నెలుచిన్నెలు సూపుచుఁ బ్లుతాదిగమనంబుల నెఱపు మేలుజాతివారువంబుపగిది బహువిధంబులగు నడకలఁ గాన్పించుచు వీరుని బాహుబలాతిశయంబును వేనోళ్ళఁ గీర్తించుచున్నదో యనఁ బాటపాడుచుండెను. బొంగరంపు నిలకడఁగూర్చియు ధ్వనిఁ గూర్చియు ననపోతాదివీరపుంగవులు యథాశక్తిఁ బ్రయత్నించుచున్నను బాలచంద్రునియాటసొంపుమాత్ర మందుఁ గన్పడలేదు.

ఇట్లు కొంతసేపుజరుగునప్పటికి నిరవధికప్రతాపంబున వెలుఁగుచున్న బాలచంద్రుని బంగారుబొంగరము దుర్దైవవశంబున నురవడితోఁ బోయి వనితాజనసంఘంబులోఁ బసుచుఁదనంపుమిసిమిం జెన్నలరారు నొక గయాళిగంపచరణంబునకుం దాఁకెను. ఆ కోమలి తత్క్షణంబున 'నయ్యో' యని నేలకొఱగెను. అంతటఁ బలువురు చుట్టుమూఁగిరి. బాలుండును భక్తివినయంబులు సూచించుచు స్నేహితులతో దగ్గఱకుంబోయి క్షమింపవేఁడుకొనెను. ఆలతాంగి కించుక స్మృతితప్పెను. మాటాడలేకపోయెను. పార్శ్వస్థులు సముచితోపచారంబులు



గొంతవడిచేయ నామె లేచి కూర్చుండి కన్నీరువెట్టుచుండెను. బాలచంద్రుఁడు మఱల నామెతో "తల్లీ! ప్రమాదవశంబున నాబొంగరము నీకాలికిం దాఁకినది. కాని బుద్ధిపూర్వకంబుగ నేనట్లుచేయలేదు. పొరపాటుగాన క్షమింపవేఁడుచున్నా" నని సవినయుండై పలికెను. పిమ్మట నాలేమ ముక్కుపైఁ జెమ్మటలుగాఱుచుండ మొగంబు జేవురింప రక్తాక్షియై, "ఛీ! పొరపాటని బొంకెదవేల? స్త్రీజనంబిచ్చటనున్నదని తెలియదా? జాగరూకత వలదా? ఇఁక నీప్రతాపంబులు నాతోటి యాఁడుదానిపయింగాక మఱెక్కడ? నాకాలెంత నొచ్చినదిరా! వీరాగ్రేసరులనెల్లరఁ గార్యమపూడికింబంపి యింటనాఁడుదానివలెఁ బ్రొద్దుపుచ్చుచున్నావు. నీపౌరుషము మంటఁగలుపనా? నిజమైనశౌర్యవిస్ఫురణంబున్నచో యుద్ధభూమికింబోయి మీసంబుదువ్వుదుగాని రిపులను జడిసి నావంటియబలలను బాధించుటకుఁదప్ప యింటనేల యుందువు? నీతండ్రియయిన యాబ్రహ్మవీరునికిఁ గడుపు చెడఁబుట్టినావు. పో పొ" మ్మని ప్రత్యుత్తరంబుగా నిందించెను.

ఇంతదనుక వినమ్రుఁడై చేసినతప్పునకు లోనఁగుందుచు నావైశ్యలతాంగిని క్షమాపణంబుఁగోరుచున్న యాపోటుమగఁడు పౌరుషోద్రేకకారకభాషణంబులువిని మనంబునఁ ద్రొక్కిసలాడుచు "ఏమీ! నేనాఁడుదానివలె నింటనుందునా? నాపౌరుషం బాఁడుదానియెదుటనే కాని పనికిరాదా? యుద్ధభూమికిం జంకి యిందుంటినా? ఛీ! ఇట్లుద్రిక్తహృదయుఁడనై యింట నుండఁజాల" నని పల్కుచు శరీరంబు కంపింప నౌడుకఱచుచుండెను. అనపోతును దదితరస్నేహితబృందంబును, రాజాజ్ఞ నుల్లంఘించి బాలుండు వెడలుట సమంజసంబుగాదని యెఱింగి మనస్సులోఁ గుందుచుండినను వారుగూడఁ గయ్యంపు దియ్యందనంబు రుచిం జూడ గమకించుచుండిరి. బాలుఁడావైనొక్కక్షణంబుగూడ సందేహింపక గ్రక్కునఁ బొట్టేలెక్కి నలిరేఁగిన

పౌరుషంబుచే ముందువెనుకఁజూడక నెచ్చెలులతోఁగూడ మాటాడక తిన్నన నింటికేగెను. అనపోతు మొదలగు నేస్తకాండ్రును బాలచంద్రుఁ డేమొనర్చినఁ దామునట్లేచేయుటకు నిశ్చయించుకొని మైతాంబ కడకేగిరి.

అచ్చట బాలుండు బొంగరంపుటాట విషయంబంతయు నానుపూర్విగఁ జెప్పి తనయుద్ధరంగప్రయాణంబుఁగూడఁ దెలుపుడు సేసెను. అతనికి వాదోడుగా ననపోతు మొదలగు వయస్యులును సమయంబుఁగని "అమ్మా! పెద్దలందఱును దోషావేశపూరితులై వీర్యంబు రూపెత్తి నట్లు యుద్ధభూమియందుఁ బోరాడఁబోవుచుఁ బిఱికిపందలమగుటచే మమ్ముల నీపురంబున డించిపోయిరనియు మాకునింకేమియుఁ గార్యంబు తోఁపక పిల్లాటలాడుచుంటిమనియుఁ గొందఱ కీయూరఁబొడగట్టినది. ఈమాటలు చెవింబడినప్పుడు బాలునితోఁబాటు మేమును గోఱలు వెఱికిన కాలసర్పంబులవలె రోషావిష్టశౌర్యపరాక్రమప్రభావంబుల దిగ్రమింగుకొనుచుఁ గార్యమపూడిం జేరుటకు నీయనుజ్ఞఁబొందుటకై నిన్ను వేఁడవచ్చితిమి. కుమారరత్నసములగు మమ్ములను, బాలచంద్రుని దీవించిపంపి మాపేరు నిలువంబెట్టు"మని బహువిధంబులఁ బ్రార్థించిరి. అంతట నామానవతి కన్నీటిబొట్టుముత్తెంబులం జార్చుచు "నాయనా! బాలచంద్రా! నాకన్నతండ్రీ! నాముద్దుబిడ్డా! నాబంగారుబొమ్మా! నీవియోగంబు నేనెట్లు సహింపఁగలను? కానకకన్న సంతానమగుటచే నిన్నల్లారుముద్దుగాఁ బెంచుచుండిన నాకు నెడఁబాటు గల్పింప నెట్లోర్తువు? తండ్రీ! సంతానంబును దైవంబు ప్రసాదించుటకై నేఁబడినశ్రమంబులు నేనోఁచిననోములు నేఁజేసినతపంబులు పూజార్చనవిధానంబులుం స్మరణకువచ్చునప్పుడిప్పటికిని నిట్టూర్పు విడుచుచుందును. నేమ్రొక్కని వేల్పులేదు. నేఁగ్రుంకని తీర్థములేదు. నేమెట్టనిపుణ్యస్థలంబులేదు. ఎన్నినాళ్ళకును సఫలీకృతమనోరథనుగాక తుదకు మొండి



పట్టుపట్టి మాచెరల చెన్నకేశవునే మదినెంచి నిత్యపూజావిధానంబుల సంవత్సరంబులుసలుప నామహాత్ముండు దయపుట్టి నాకు నిన్నుఁబ్రసాదించినాఁడు. నానోములపంటవయిన నిన్నెట్లు వాసియుందును? బాలచంద్రా! సీతవిషయంబున రామునివలె— ఎవరో నిందావాక్యంబు లాడినారని కోపించుటతగునా? లోక మనేకరీతులుగ నుండును. "లోకో భిన్నరుచిః"అని వినలేదా?" అనియింకను ననేకవిధంబుల సకరుణంబుగాను సకారణంబుగాను బ్రతిమాలుకొనెను. కాని లోక మిట్లాడుకొనుచున్నదికదా యని తత్కళంకంబుఁ దీర్చుకొనుటకుఁ—దల్లి యొక్క దీనవాక్యంబులు చెవింబడుచున్నను— రోషశౌర్యంబులతో మిళితమైయున్న బాలుని యుద్ధోత్సాహంబు పెచ్చుపెరుగుచుండెను. బాలచంద్రుని యెడఁబాటునకై మైతాంబ యెంత వేదనపడుచున్నదో దానికి రెండింతలుగా నన్నదమ్ములందఱయొక్క కారణయుక్తములగు ప్రార్థన లొక్కుమ్మడిగా నామెమనస్సును వేధింపఁజొచ్చెను. ఆమెకంటె వారు విద్యయం దారితేఱిన ధీశాలురగుటచే వారిమాటలనామె త్రోసిపుచ్చలేకపోయెను. చివరకు బాలుండు తల్లియానకై యామెపాదసరోజంబులఁబట్టి ప్రార్థించుచుండ నామె గ్రుక్కఁద్రిప్పుకొనలేక "తద్భార్యయయిన మంచాల యొప్పదనియు భార్యామోహపాశంబులఁబడి పోఁజాలఁ"డనియు దృఢంబుగానమ్మి "అట్లయినచో, బాలచంద్రా! నీభార్యకడకుంబోయి దానియొక్క మనస్సంతోషంబుఁ జూఱకొని యనంతరంబుపొ"మ్మని యానతిచ్చెను.

తల్లియాడినవాక్యంబు లాకర్ణించి నిర్భరానందకందళితహృదయారవిందుఁడై బాలచంద్రుండు మామగారయిన గండుకన్నమనాయని యింటనున్న తనభార్యయగు మంచాలాంబ కడకుంబోయెను. సమగ్రోత్సాహంబున నాతని నెయ్యులును నాయనియింటంగూడిరి. మాతాజ్ఞఁబొందుట కష్టసాధ్యంబుగాని కులాంగనల దీవనలంబొంది

వెడలుట సుకరంబనియెంచి యావీరకుమారుండు మంచాలయొద్దకుం బోయెను. తనపైఁదల్లికిని నిల్లాలికిని ననురాగంబు గాటంబుగనే యుండెనుగాని మాతృవాత్సల్యబంధంబుకంటెఁ దరుణీప్రేమబంధమే విడఁదీయుట దుస్సాధ్యమని పాప మావేశంబున నతనికిం దోఁపలేదు. తల్లిపైఁ బ్రేమంబునకును నర్ధాంగిపైఁ బ్రేమంబునకును దారతమ్యము రసజ్ఞులకేకాని తక్కొరులకుం దెలియదు. తొలుతటిది జననియందే నిండి నిబిడీకృతంబై యుండునుగాని తల్లిపైఁ బిల్లవాని కంతగానుండుట సాధారణముగాదు. కాని కులకాంతవిషయంబున నట్లుకాదు. ఇందు రాగంబు నిరవధికపరిపూర్ణత్వంబున విరాజిల్లుచుఁ బరస్పరన్యస్తంబై యుండును. మగనియందు భార్య కెంతమక్కువయో కాంతారత్నంబునందు నాథుని కంతనంటు. తల్లిపై నుండిన ప్రేమానుబంధంబు నించుక తాత్కాలికముగాఁ దొలఁగింపఁగలిగెనుగాని మాంచాలయందలి రాగంబు మాత్ర మాతనిఁ బోనిచ్చునట్లు కన్పడలేదు. మగని స్నేహంబె యెల్లప్పుడాసించియున్న యాచకోరనేత్ర బాలచంద్రవదనచంద్రికలు ప్రసరించినతోడనే యపరిమితానందభరితయయ్యెను. బాలచంద్రుండామెను బుట్టినింటవదలి కొన్నివారంబు లతిక్రమించుటచే నాఁడామదవతి మనోహరముఖంబు నీక్షించినతోడనే బాలుండు సమ్మూఢచిత్తుండయ్యెను. గృహాభ్యంతరంబున కిర్వురుంబోయి మాటలాడఁదొడంగిరి. నిమిషంబులు దాటినవి. గంట లతిక్రమించినవి. యామంబులు పర్యాప్తినవి. వెలుపలనున్న స్నేహితబృందం బాతురపడుచుండెను. లోనికిం బోయి పిలువనంపుటకు వారికి ధైర్యంబు చాలకుండెను. అనపోతు మొదలగువారికిఁ గోపంబు బాలునిపై రగులుకొనుచుండెను.

బాలచంద్రుండు గదిలోనికిం జేరి సరిగంచుతగటుదుప్పటిపైఁ బువ్వులారఁబోసిన బూరుగదూదిపఱుపుపై వెన్నుఁజేర్చి విద్యాగృహాకృత్యాదివిషయంబులఁగూర్చి యెదుటనున్న లతాంగితో సమయోచి



తంబుగ మొగంబున మందహాసచంద్రికలఁ బొదవెట్టుచు నేమేమో పెద్దయుం బ్రొద్దు మాటాడుచుండెను. కాని బాలుం డెంతసేపామె సమక్షంబున నుండినను యుద్ధభూమిప్రయాణం బాతని మనస్సునకు జ్ఞాపకమే రాలేదు.

గృహప్రఘాణంబునందు యుద్ధాభిలాషులై వేచియున్న చందన్న, యనపోతు మొదలగు వా "రింకనైన రాకపోవునా"యని యత్యంతనిశ్చలచిత్తులై వేచియుండిరి. బాలచంద్రుని కీగొడవయే లేదు. ఆరాత్రియుం గడచుచుండెను. చెలికాండ్రు రాతిరి ప్రొద్దుపోవుఁటకు వానికొఱకుఁ గాచుకొని యర్ధరాత్రంబునఁ బన్నుండిరి. తెల్లవాఱెను. గ్రామంబునఁ బిన్నపెద్దలందఱు లేచిరి. అనపోతుగూడ స్నేహితులతో లేచి కాల్యంబులఁదీర్చికొని మహాకోపసంరంభంబున నుద్దండమూర్తియై భయంబు వీడి లోనికింబోయి తాను వదినెగా భావించుచున్న మంచాలదేవిని సైతము గమనింపక యామెతో సరససల్లాపంబులాడుచున్న బాలచంద్రుని సమీక్షించి "ఓయీ! వివేకశూన్యా! కార్యం బేదియో యకార్యం బేదియో గ్రహింపలేక ప్రాపంచికదుర్విషయమోహాంబుధిలోఁబడి కొట్టుకొనుచుంటివా? విషయలోలత్వమే సత్కార్యాచరణంబునకు గొప్పయడ్డంకియని ప్రపంచానుభవమింకను నీకుఁ దెలుపలేదా! నీవెందులకై మావదినెగారికడ కేతెంచితివో మఱచితివా? పలుపాట్లఁబడి కార్యంపూడియుద్ధభూమికింబోవ నైతాంబ నెట్లో నొడంబఱిచి తుదకీడఁ జెప్పిపోవుటకై రాఁగానే యది విస్మృతివచ్చినదా? ఛీ! ఛీ! నీవర్తనము గర్హ్యము. స్త్రీసంభాషణవాగురయందుం జిక్కుకొని కర్తవ్యం బెఱుంగక వీరపుంగవుండనని యింకను నీవెట్లు పేర్వడయ సాహసింతువు? నీశౌర్యంబునకును ధైర్యపరాక్రమంబులకును నేటికి వీడ్కోలు చెప్పి యింకఁ బామరుండవై సంచరింపఁజూచుట నీకెట్లుండునోకాని నీస్నేహితులమయిన మాకుమాత్రము నలువురిలోఁ

దలవంపులుగా నుండఁగలదు? ఔరా! ఒక్కరిలాలనలోఁబడి యుక్తా యుక్తవిచక్షణజ్ఞానములేక యుద్ధభూమికిఁబోవ వేచియున్న మామా టంగూడ మఱచి కార్యవిముఖుఁడవై వర్తించు నీదుర్వర్తనం బిఁక నైనమాని మార్తురకు గుండెలు చెదరునట్లు భవదీయశౌర్యలక్ష్మి యొక్క నర్తనసంరంభంబు సంగ్రామరంగంబునఁ బ్రదర్శింతువా లేదా? లేకున్నచో స్త్రీజనంబుతోఁబాటుగా నింటనేయుండి కోమటి యన్నమ్మమాటల సార్థకంబొనర్పుము. మొదటినుండియు నిన్నున్నగాఁ జూచుచున్న నేనీనాఁడిట్లు గంభీరపరుషవాక్యంబు లాడవలసివచ్చి నందులకు క్షమింపుము. దయయుంచి నిర్గమనోద్యుక్తులమైయున్న మాకు నీయనుజ్ఞనిమ్ము. సందేహింపకు"మని గంభీరవచోరచనలం గురిసెను. కోపోద్రిక్తనయనుండై యనపోతు బాలచంద్రునితోఁ బలుకుట కారంభించునప్పుడు మంచాల మొట్టమొదటఁ గళవళపడి నోట మాటలేక మొగాదిగఁ జూచుచుండెను గాని కొంతసేపయినవెనుక బాలచంద్రుం డచ్చటికేలవచ్చెనో గ్రహింపఁగలిగెను. అనపోతు శాంతింపఁగానే కలంగిన హృదయంపు టావేదనంబు మొగంబుపైఁ గనంబఱచుచు బాలచంద్రునింజేరి "ప్రాణేశ్వరా! మగవారి బహిర్వ్యాపార విషయంబులందును నాఁడుదాననగు నేను సందర్భోచితంబుగఁ జెప్పవలసి వచ్చినందులకు క్షమింపుఁడు. మఱఁదిగారి గంభీరభాషణంబులంబట్టి మీరందఱుఁ గార్యంపూఁడి రణక్షేత్రంబునకుంబోవ నత్తగారియనుజ్ఞం బొందినట్లును నటమీఁద నాకుఁ జెప్పిపోవచ్చినట్లును గనిపించుచున్నది. కోమటి యన్నమ్మగారి విషయంబు విని ఖేదపడినాను. ఆమె మాటలవలన మీరు యుద్ధభూమికిం బోనుండినట్లిప్పుడు దెలిసెనది. ఇదియెంతయు నాకు హృదయాహ్లాదకరముగా నున్నది. ఇంతకుమున్నే మీరు మామగారితోఁబోయి యుండవలసినదని నేనిదివఱకే కలంతపడి యున్నాను. ఇప్పు డత్తగారియనుజ్ఞంబొందియు యుద్ధారంభదినము



వచ్చుచున్నది కాన నాలసించుట కార్యదక్షతగాదు. మీరు వెడలి మీశౌర్యప్రతాపంబుల దాయలపైఁగన్పఱచి విజయలక్ష్మింజేకొని వచ్చుటకు మిమ్మునుబురికొల్ప నాహృదయంబు తొందరపడుచున్నది. పల్నాటి వీరపుంగవులని పేర్వడిన మీరు యుద్ధంబున నిర్వక్రపరాక్రమంబుఁజూపి నాకుఁ జెవిపండువు సేసినచో ధన్య నయ్యెదను. అన్నమ్మగారి విషయంబు నేఁడు రాకపోయినను మామగారు మొదలగువారందఱు సంగ్రామరంగంబుఁ జేరఁబోవఁజూచి మిన్నక మీరిందుండుట నామన స్సొప్పకున్నది. భూపాలునియాజ్ఞావాక్యశృంఖలంబునఁ దమరును మామఱఁదులును బంధితులయినారనివిని కొంతవడి చింతించితిని. కాని రాజాజ్ఞావ్యతిరేకక్రియాబోధనదోషంబు నాకాపాదిల్లినను నిట్టి విషమస్థితియం దన్యథాకరించుట దూరదృక్కుల లక్షణముగాదు. ఈనాఁడు మలిదేవనరనాథుఁ డాఁడువారి సంరక్షణంబునకై మిమ్మిందు డించిపోయినను రేపాకవేళఁ బాలికలనియందుండిన మన వీరపుంగవులందఱు నిర్జితశౌర్యులయినయెడ నాఁడయినను, మీరచట లేకుండుటచేఁ బ్రభువు వగలంగూరుట నిశ్చయము. కీడెంచి మేలెంచవలయు. కాలగర్భంబున నేమున్నదో తెలియదు. నాథా! ఇన్నిసారులు మనమీ విషయంబు నాలోచింపఁబనిలేదు. అలరాజుభార్యగళంబునందలి విస్ఫురన్మాంగళసూత్రంబుఁ ద్రుటితంబుగావింపఁ బాల్పడిన యానరసింగును జీవంబుతో నుంచుట మీవంటి శూరాగ్రేసరులకుఁ గీర్తిదాయకముకాదని నాకుఁదెలియును. మామగారి కెన్నివిధంబులనో కుయుక్తులచే రాజాభిమానంబుఁ బురస్కరించుకొని హృదయవ్యాకులంబుఁ గావించిన యావిధవ, నానాయకురాలి, నింకనైనను వీరపుంగవ శౌర్యాగ్ని కింధనంబుఁజేయుటకు మీవంటివారు యుద్ధాభిలాషులగుట నాకుమాత్ర మసమ్మతముగానుండునా? మీరు పోఁదలంచి యత్తగారి ముదలవడసియుండుట శుభావహము. మీ రాభీకరాహవ

రంగంబున దుమికి ఖడ్గంబుఁ జేనలంకరించి మదానేకవయూధంబులు దిరుగాడునచోఁటఁ దాము ప్రావృణ్మేఘయుక్తశంపాలతావితానంబు వలె విరాజిల్లుట నాకు సంతోషదాయకముగాదా? నాకీవిషయంబుఁ బ్రత్యేకంబుగా వక్కాణింపఁబనిలే"దని పలుక బాలచంద్రుండు శ్లాఘా దరహాసచంద్రికలఁగురిసి "మానినీ! నీపలుకులు హృదయానందంబును గందళింపఁజేయుచున్నవి. నీవంటి యుత్తమగుణనిధి నాకిల్లాలుగా దొరకుట నిజముగా నాపూర్వపుణ్యతపఃఫలంబని విశ్వసించుచున్నాను. నే నింతకాలం బాలసించుట చాలఁబొరపాటు. నీవుమాయుద్యమంబునకుఁబ్రోత్సాహంబొసంగితివి. కాని తేనియాజ్ఞ యిట్టిస్థితియం దుల్లంఘనీయంబుగాఁ గన్పట్టినను మేము తదాజ్ఞాకారణంబయిన స్త్రీరక్షణంబునుగూర్చి విచారింపకుండఁ గలనికిం బోఁజూచుట లెస్సగా"దని యనుమానంబు బయలుపెట్టఁగానే యామానవతి "నాథా! మీరట్లు చింతింపఁబనిలేదు. అంత యావశ్యకంబయినచో నిందుండు నంగనాజనంబు గూడఁ బురుషస్వభావంబుఁ గాన్పించునుగాని పగఱకు వెన్నీయదని దృఢంబుగా నమ్మిపొండు. మాపుట్టినింటివారివంశంబు బలపౌరుషశౌర్యసమార్జనంబుఁ గావించుటలో నత్తింటివారి వంశంబునకుఁ దీసిపోదనియుఁ దత్సంపాదనంబుపట్ల స్త్రీపుంవిభేదరాహిత్యంబుంటచే నొకింత మిన్నయేయనియు నార్యపుత్రునికి వినయపూర్వకంబుగ మనవిఁజేసికొనుచున్నాను. ఇంకమీ రాలసింపఁదగదని నాయుద్దేశ"మని పలికెను. అంతట "సమయోచితాచరణశీలా! మాంచాలా! సంతసించితిని. భర్తకన్నంబిడునపుడు తల్లివలెఁ, బనులుసవరించునపుడు దాసిపగిది, శయనసమయంబున రంభమాడ్కిఁ, గార్యాలోచనంబుపట్ల మంత్రికరణి నిల్లాలు ప్రవర్తింపవలెనని యార్యోక్తి. అందు నిజముగా నిప్పుడు కార్యాలోచనంబున నన్ను సంతుష్టుంజేసితివి. ఇంకనే మనలంజనదు. ఇదిగో! ఈఖడ్గముం జేకొని మఱలనాకి"మ్మని యాతండ



నుడు నాలతాంగి భర్తృవిజయం బాశీర్వదించుచు నాఖడ్గంబుమఱల నిచ్చెను. అటుపయి ననపోతు ముందునకుసాగెను. ముందునకుఁ జనుచుండు ప్రాణనాథుని జేసైగచే వెనుకకుంబిలిచి నాలుగైదు నిమిషంబులేమియో శ్రవఃకుహరంబున మాటాడిపంపెను. ఇట్లుబాలుండు వెనుకకుమఱలెనని కొంతసాగినవెనుక ననపోతు గ్రహించెనుగాని తద్విషయగ్రహణసామర్థ్యంబుమాత్రము లేకపోయెను.

వెలమదోర్నీఁడు, చందన్న, యనపోతు మొదలగు స్నేహితులును దదనుచరులును గలియ దాదాపు శతసంఖ్యతో వీరమేడపి నుండి బాలచంద్రుండు బయలుదేఱెను. నక్షత్రమండలంబునడుమఁ దేజఃపుంజంబుతో విరాజిల్లునట్టి యాబాలుఁడు— వారిలోఁగొందఱు జవనాశ్వంబులమీఁదను గొందఱు గాల్నడకతోడ వచ్చుచుండఁ—దాను మాత్రము సర్వాభరణభూషితంబును దర్శనమాత్రభయోపాదకముఖంబును నగుపొట్టేలెక్కి సోదరబృందంబు సూరెలంగొలువ హాసవిలాసగానచేష్టావళులు యుద్ధంబునందలి చులకదనంబును రూపడఁ జేయుచుండ "బాలుండవగుటచే నుద్రేకంబునఁ గదనభారంబు నింత నిర్లక్ష్యముగాఁ జూచుచున్నావు; కాని దానితీవ్రరూపం బింతకు వేమడుంగులుండు"నని తెల్పుటకోయన సూర్యుండు తీక్ష్ణమరీచులంబంపినను వాని నొకచీరికింగొనక త్రోవంజనుచుండెను. సరిగంచుగల యుష్ణీషంబునకు దిగువ మొగంబుపై జాఱులేఁజెమ్మటముత్తెంపు ముత్తెంబులు స్నిగ్ధములయిన యాతని చెక్కుటద్దములంజాఱి యించుక యానూనూఁగుమీసంపు సొంపునకు నూత్నశోభం జేకూర్చుచుండెను.

వారెన్నియో క్రోశంబులుదాఁటిరి. అనంతరము తటాలునఁ బొట్టేలాపి బాలుండు వస్తువిస్మృతిసూచకచిత్తవిక్షేపంబుఁ గన్పఱిచెను. అనపోతు మొదలగుయోధు లందఱుఁ గ్రమంబుననాఁగి విషయగ్రహణైషణులై యాతనిఁబ్రశ్నింప "నెంతప్రమాదపడితిని! మాంచాల

తోడ సంభాషణంబుఁ గావించుచు నాముద్దుటుంగరముఁ దదంగుళీయంబును, నాముక్తాహారంబుఁ దత్కంఠంబునను నుంచి క్రమ్మఱ నప్పుడు వానిని విస్మరించివచ్చితిని. వాని నే నెన్నండును నెడఁబాసి యుండలేదు. యుద్ధకౌతూహలంబుగల యీ పవిత్రసమయంబునం దావస్తుద్వయము లేకుండుట నాకెంతయో కొఱంతగానున్నది. ఏమిచేయఁగలను?" అని మిక్కిలి విచారింపఁజొచ్చెను. కార్యమపూడికి నాలస్యంబుగా వెడలుట యిష్టము లేకున్నను, దద్వస్తుద్వయాభావంబాక యనావశ్యక మానసికాందోళనంబునకుఁ గారణంబే కాని భవిష్యత్కార్యనిర్వహణంబున కిసుమంతయు నాటంకము లేదనుట యెఱింగియున్నను వారిలో నన్నివిధంబులఁ బెద్దయును మహాయోధాగ్రేసరుండును నగు బాలుని కడ్డుఁ జెప్పి మనస్సు నొప్పింపఁ జూచుటయం దొకరికి నిష్టము లేకుండెను. అంతట మిన్నకుండుట పాడి కాదని తలపోసి యనపోతెదుట నిలచి "నే నింటికి మరలి మా వదినెగారి యొద్దనుండు నా రెండువస్తువుల నతిత్వరితంబుగఁ గొనివత్తును. మీరాఁగక పోవుచుండుఁడు. కార్యమపూడి యింకను జాలదూరంబున నుండఁగనే వచ్చి మిమ్ముఁ గలిసికొందును లె"మ్మని పలుక బాలుం డానందం బొంది యంగీకారంబొసంగి యాతని వెనుకకుం బంపెను. అతఁడును ననుమానరహితమనస్కుండై యొక్క యవనాశ్వంబుపై నెక్కి మేడపికిం బోయెను.

అతిత్వరితకాలంబున వాయువేగసమానంబైన యావారువంబుపైఁ బట్టణంబుఁ బ్రవేశింపఁగానే యనపోతురాక సర్వజనంబులకును విస్మయకారణంబై యనేకు లనేకవిధంబులుగాఁ బృచ్ఛించినను బ్రత్యుత్తరాపేక్ష యాలస్యంబునకు నిదానంబని యెంచి యాతం డొక్కరికైనను మాఱుమాటనీక బిరబిర మాంచాలాగృహోపకంఠంబుఁ దఱిసి గుఱ్ఱంబు దిగి లోనికిం బోయెను. అచట నామె తల్లియైన రేఖాంబతోఁ బ్రసంగించుచు శుభ్రదదపంక్తిపైఁ జిఱునగవుఁ



దాపటంబుఁ జేయుచుఁ జూపఱకు వేనికాంతి ప్రశస్తతరంబను శంక నాపాదించుచుఁ గెలంకులనుండి యాళీజనంబు చేసేతనూఁపుచుండఁ గనకడోలికాభ్యంతరంబున శచీదేవినింబోలి వైభవంబుతో నూఁగుచుండెను. అంతనతండా కోమలిం జూచి యంబాఁగెను. ఒకక్షణము వెనుక మాంచాలయుం దిరిగిచూచి యాశ్చర్యంబు నటించుచు నాగమన కారణంబుఁ గూర్చి పృచ్ఛింప సవిస్తరంబుగ నొక్కి చెప్పి యాలసింప వ్యవధి లేదనియు బాలుండు మఱచిపోయిన యారెం డాభరణముల నొసంగు మనియు నాతండు మిక్కిలిఁ బ్రార్థించెను. ఎంతప్రార్థించుచున్నను మాంచాల మొగంబున నట్టి తొందర కన్పడకుండుటయేకాక యామె యనావశ్యకప్రశ్నావళుల నడిగి కాలయాపనముం జేయఁ జూచుచుండెను. తొలుదొల్త నామె తమకెంతయో ప్రోత్సాహంబు నొసంగి మఱల నిట్లు తద్వ్యాఘాతబుద్ధిఁ బ్రవర్తించుచుండుట శోచనీయంబుగాఁ దలంచి యాబ్రాహ్మణవీరుం డించుక విసుగుం గన్నఱచెను. అంతట మాంచాలయు లేచి "మంచిది, శయనాగారంబున నెందో వానిని బెట్టియుంటిని. వెతకి తెచ్చెద" నని లోనికిం బోయి యెంతసేపటికిని రాకుండెను. ఘటికాద్వయం బతిక్రమించెను. ఎంతకును రాకుండుటఁ జూచి యనపోతు రేఖాంబతోఁ గూడ లోనికిం బోయి గదిగుమ్మంబుకడ నిలువంబడి చూచుచుండెను. మాంచాల, యనావశ్యకంబగుటచే మనస్సున నిష్టంబు లేకున్నను బైకి నించుకంత తొందర నటించుచు నాయాప్రదేశంబులు వెదకుటకుపక్రమించెను. దర్శనమాత్రంబున సౌఖ్యంబు నందిచ్చు బూరుగదూదితోఁ జేయఁబడిన కెంబట్టు జమిలిపఱుపు క్రిందను, నంతటఁ గమ్మవలపులు వలచుచుఁ బ్రకృతి సౌందర్యదేవత శయనించినదో యన్నట్లు పొడగట్టు వివిధలతాంతంబులచేఁ బరిష్కృతంబయిన యాతూలికాశయ్యకు శిరోభాగంబున నమర్పఁబడిన తలగడలజంటక్రిందను, నెల్లప్పుడును బల్నాటి వీరపౌరుష

స్తోత్రపాఠంబులను, నెడపా దడపా మన్మథశ్లోకంబులను, వల్లెవేయుచు నగారంబంతటికి మనోహరవికాసం బొడఁ గూర్చుచుండు శుకీశుకసంతానంబులయొక్క సువర్ణపంజరంబు లందలి మణిమయవేదికోపరిస్థలంబులందును, గతనిశి బాలచంద్రునితో సరసప్రసంగంబులందేలునప్పుడు భార్యాభర్తృముఖంబుల ప్రతిబింబంబులఁ జూపి యిద్వరకుఁ బ్రేమహాసంబుల వెలువరించిననిద్దంపునిల్వుటద్దంబునకుఁ బృష్ఠభాగంబునందును దదితరప్రదేశంబులందును వెదకి వెదకి యాసుకుమారశరీర యలఁతం జెంది కూర్చుండెను. ఇదంతయు ననపోతు చూచుచునే యుండెను. ఏమిచేయఁగలఁడు? అప్పటికే బాలచంద్రాదులు చాలదూరంబుపోయి యుందురనియుఁ దానుదొర్తఁ జెప్పినట్లు వారినింగలిసికొనుట దుస్సాధ్యంబనియు భావించెను. అంతియ కాక, "నేను వృథాగా నింతసేపాలస్యంబొనర్చితిని. ఎందులకై వెనుకకు వచ్చితినో యాకార్యంబు నెఱవేఱలేదు. ఇప్పుడు రిక్తహస్తంబులతోఁ జనిన బాలచంద్రుం డేమనునో! ఇంతమాత్రపుఁగార్యంబు నెఱవేర్పలేకపోయితినని పరిహాసంబొనరించి బాలుండు నన్నుఁ దనదయకుఁ బాత్రునిగాఁ జేసికొన నిచ్చగింపఁడేమో! మఱియు,నీవిషయం బెట్లున్నను, నేవెడలులోపలనే యతండుయుద్ధభూమికింబోయి యుత్సాహోద్రేకంబు దన్నురంగంబునకుం జేర్పఁగాఁ దత్తద్యుద్ధకేళీవిలాసంబుల నెఱపి,యందఱను జిందఱవందఱగాఁ బఱిమార్చి యెదిరి పక్షంబునందలి పేరుగలయొక్కయోధునినైన నాకు మిగుల కుండఁ జేయునేమో యనుభీతి పెచ్చు పెరుగుచున్నది. ఇట్లే యాలస్యంబుఁ గావించిన ననుకొనినంత జరిగి తీరును. (ఆలోచించి) కాని మ్మేన రేమనుకొనినను, బాలచంద్రుండు రిక్తహస్తుఁడనైన నన్నుఁ జూచి యపోహపడమి యెన్నినిందావాక్యంబులాడినను సహించుకొని యుండెదనేకాని మరలి యుద్ధభూమికిం బోకుండ నుండఁ జాలను. హృదయంబునందలి యుద్ధాశ తరంగితమై



గుబ్బతిల్లుచున్నది. నేనింక నిందుండఁజాల" నని యావిప్రకుమారుండు హుటాహుటి బయలునకునడచి మఱల నశ్వారూఢుఁడై ప్రజలు శంకావిష్టులై పల్కరించినను మాఱు మాటాడక మునుపటి కంటె నెక్కుడుగా మనోవేగంబుఁబోని వేగంబున యుద్ధభూమిం జేర స్వారిఁదీయుచుండెను. ఏమాత్ర మావీరుండు దరితీపులేకుండఁ జాలదూరము సాఁగిపోయెను. తుదకు నలగొండ చేరువకురానుండెను.

విఫలమనోరథుండయిన యనపోతు మఱలఁ గార్యంపూడి యుద్ధక్షేత్రంబునకుం బోఁజూచునా లేక బాలచంద్రాజ్ఞానిర్వహణాసామర్థ్యంబున మోహమోడి వీరమేడపియందే యుండునా యనుసందేహంబున మాంచాల వికలచిత్తయైయుండెను. అనపోతశ్వారూఢుండు గాఁగానే యెందేగునోయని కళవళపడుచున్న యాసుందరి యంతఃపుర సంరక్షణాధికారిణి యయిన దాసిని రావించి యుద్దేశంబు నెఱింగించి యావిప్రవీరుం డెచ్చటి కేఁగునో చూచి వానితోఁగూడఁ బొమ్మనియుఁ దచ్చేష్టితంబులఁ గనిపెట్టుమనియు నొకవేళ నాతండు యుద్ధాభిముఖుం డగుచుండినచో 'ననపోతునకు వేఱొకయుపాయంబుచే యుద్ధవైముఖ్యంబుఁ జేకూర్పు' మనియెడితానిచ్చు నుత్తరంబును భర్తకు నెల్లేని ముందుగాఁ బోయి కార్యంపూడిలో నిమ్మనియు నామెయాజ్ఞాపించెను. ధైర్యబలోపేతయయిన మాడచి వీరపురుషుని వలె సుందరతురంగరాజంబాం దధిరోహించి తలవెనుకకుఁద్రిప్పక ముక్కునకు సూటిగాఁ బోవుచుండు ననపోతుదారినే తానుగూడ వెనుకనుండి పోవుచుఁ జూపుమేరలోనుండు నలగొండ సామీప్యంబును జేరెను;కాని మాడచియొక్క యుద్దేశం బిసుమంతయు ననపో తెఱుఁగఁడయ్యెను.

అనపోతు నలగొండ సమీపించి ముందునకు స్వారిదీయుచుండ మధ్యేమార్గంబున నొక యశ్వత్థవృక్షశాఖ కొకవిశాలపత్రంబు గట్టఁబడి యుండుటఁ బొడగాంచెను. అదేమియోయని చూచుటకు నాతనికి

మనసు గలిగెను. అంతట గుఱ్ఱంబు డిగ్గి సమీపానోకహంబునకుదానిం దాఁటఁగట్టి తచ్ఛాఖపైకిం బోయి యాపత్రంబునుదీసి బాలచంద్రుని వ్రాఁతగా నెఱింగి యొకటి రెండు నిమేషంబులం దేయుండి దానింజూచెనుగాని తొందరతో వ్రాయంబడినదగుటచేఁగాఁబోలు నస్పష్టాక్షరంబులు పెక్కులుండుటచే దానిం జేతఁగొని క్రిందికివచ్చి తద్వృక్షచ్ఛాయఁ గూర్చుండి యొక్కొక్క యక్షరంబే తీయఁ బ్రారంభించి తుదకు నీ ప్రకారంబున దానిం జదివెను.

"తమ్ముఁడా! నీ యిష్టప్రకారము మేము ముందునకుం బోవుచున్నాము. జయాపజయంబులు మునుముందు నిర్ణయింప నేరికిని శక్యంబు కాకపోయినను దోర్బలవిశ్వాసప్రేరితమై నాహృదయంబున నుదయించు నవిరళయుద్ధానందరసము మాటిమాటికిఁ దన్నిర్ణయంబు ముందే కావించుకొనుచున్నది. దీనికిఁ గారణము చాలవఱకుఁ దమ్ముల సహాయసంపదయని చెప్పక తప్పదు. అన్నిటికంటె భవత్సహాయము నాకు మహోత్కృష్టము వాంఛనీయము నైనను నీవిషయంబుపట్ల నేనొక శృంఖలంబుచేఁగట్టువడియున్నానని చెప్పుటకు సంకోచము భయము కలుగుచున్నవి. నీవు బ్రాహ్మణజన్మమెత్తి చాలదినంబులవఱకు వేదవిద్యాప్రవీణుఁడవై ధనుర్విద్యాభిరుచిం గలిగించుకొని నాతోఁబాటుగా దద్విద్యయం దసమానపాండిత్యంబు గడించినావు. నాఁటినుండియు మనకిర్వురకుఁగల నెయ్యము నరనారాయణుల నేస్తంబు నీసడించుచు దినదినాభివృద్ధిగాఁ బెరుఁగుచున్నది. ప్రస్తుతము నీయభిప్రాయముప్రకారముగా నీయందు నేనింత దయారహితహృదయముఁ జూపింపవలసివచ్చుటకు నీ ద్విజజన్మమే కారణముగాని వేఱుగాదు. ఇందునుబట్టి బ్రాహ్మణజన్మము నిరసనంబుఁ గావించుచుంటినని లేశమాత్రము శంకింపఁ దగదు. నీవంటి బ్రాహ్మణులపట్ల నాకుఁగల యభిమాన మపారమని నేనే చెప్పుకొనుట యాత్మస్తోత్రమని నాకుఁదెలిసినను విషయప్రాముఖ్య మట్లుచేయ నన్నుఁ బ్రేరేపించుచున్నది.



ప్రకృతమునకు వచ్చెదను. ఈదిన ముదయము మాంచాలయొక్క గృహంబు మొగసాలనుండి మన మిర్వురము వెలికి వచ్చుచుండ లోన నిలిచియున్న నాపత్ని నన్ను వెనుకకుం బిలిచి యేమేమో చెవి వైచినట్లు నీవు కనిపెట్టియే యున్నావని యూహించుచున్నాను. నీచేఁ బ్రదర్శితంబయిన యుద్ధోత్సాహరసప్రవాహము కూలంకషంబగుచుండుటఁజూచి దూరదర్శినియైన యామె "బ్రాహ్మణుని యుద్ధంబునకుం గొనిపోవ నతండు పరిపంథిబలంబులచే నేలంగూలినయెడఁ దజ్జన్యమహాపాతకంబు వెంటఁబడి పలుపాట్లువడఁజేయుననుట స్పష్టము. సృష్టిస్థితిలయంబులలో నొకయుద్యోగంబున కధినాథుండై దినదినము నిలింపాధిపత్యాదిసురసేవితపాదయుగళుండై మహావైభవంబున వెండికొండపయి వెలసియుండునట్టి యా పురారికే యాజగదీశ్వరునికే బ్రహ్మహత్యాదోషంబు దప్పలేదని పురాణములు ఘోషింపుచుండ మనవంటివారిమాట లెక్కయేమి? కావున నొకయుపాయంబున ననపోతును వెనుకకుం ద్రిప్పివేయు" మని యొక కోరికం గోరెను. అంత నామాటల కొప్పుకొని యుండవలసి వచ్చినది. తొల్తనే నీకాయుద్దేశంబెఱుకపడఁజేసిన సభిముఖవాదోపవాదంబులు సాఁగుననియు నందుచేఁ గాలహరణం బగుట వాస్తవంబనియు నెఱింగి యది యప్పుడే బయల్పఱుపక ముక్తాహారవ్యాజం బొందు కల్పనఁజేసి నిన్ను వెనుకకుం బంపి నీకావేదనను గలిగించినాను. భార్యాభీప్సితం బెట్లున్నను నాకుఁ గూడ నామె చెప్పినదియే సమంజసమనిగ్రహించి వల్లె యంటిని. నీకు నాయందు భయభక్తు లుండినమాట సర్వజనవిదితము. అట్టిభయభక్తులీసమయంబునఁగూడ నుపయోగించి పాండవులవలె జ్యేష్ఠునివాక్యంబుఁ బరిపాలించినా వనుకీర్తి గడింపఁ గలవను నాసతో 'సోదరా! యుద్ధవైముఖ్యంబు వహించి యీప్రదేశంబునుండి యింటికి మరలవలయు' నని జ్యేష్ఠుండనయిన నేను దమ్ముఁడగు నీకు నాజ్ఞాపించుచున్నాను.

వైళము యింటికిఁబోయి వీరమేడపి నవసర మైనచో రిపులబారిఁ బడకుండ సంరక్షింపుము పొమ్ము. *సద్గుణముల మూర్తియే బ్రాహ్మణుఁడని పెద్దలుచెప్పుదురు. బ్రాహ్మణులు దన కతిప్రియులని శ్రీకృష్ణభగవానుఁడు గీతయందుఁ బల్కియున్నాఁడుగదా! అట్టి బ్రాహ్మణోత్తముఁడైన నీవు—బ్రాహ్మణగుణంబునకుఁ గళంకంబు రాకుండ—భ్రాత్రాదేశ పరిపాలనంబుఁ గావింతువని నమ్ముచున్నాను.

ఇట్లు నీసోదరుఁడు,

బాలుఁడు."

ఆలేఖ సాంతముఁజదివి యనపోతు నిశ్చేష్టుఁడై నిర్వీర్యుఁడై క్రిందఁబడెను. నోటినుండి మాట రాలేదు. మొదలునఱికినవృక్షము వలె నేలంబడెను. భార్యాపుత్రులు విగతాసువులైనచో నేలంబడి పొరలుచుండు ప్రాకృతమానవునిపగిది బాలుం డసవర్ణుఁడయినను నేకోదరునిగా భావించుచుండిన యాబ్రాహ్మణవీరపుంగవుం డెన్నిదినంబులనుండియో మహాయుద్ధరంగంబునఁ గనఁబఱచుటకై నిల్వఁబెట్టియున్న బలశౌర్యంబులు నాఁటితో బ్రుంగినట్లు పలవించెను. ఆహృదయావేదనంబు వర్ణనాతీతము. బాలచంద్రాదేశశంకువు హృదయంబును బట్టి పల్లార్చుచుండెను. అంతస్తాపము పెచ్చుపెరిగి జిహ్వాద్రవంబు నొక్కుమ్మడి శోషింపఁజేయుచుండెను. అయ్యవసరంబునఁ దత్ప్రదేశంబు నిర్మానుష్యమైయుండెనని యాతఁడూహించుకొనుచుండెను. ప్రొద్దెంతయో జాఱిపోయెను.

అనతిదూరంబుననుండి తురంగంబుపైవచ్చుచు ననపోతు చేష్టాక్రమంబులఁ గంటవత్తిఁబెట్టుకొని కనిపెట్టుచుండిన మాడచి యతండు శాఖాబద్ధమైయున్న పత్రంబును గ్రిందికిం దెచ్చుటయు దానిం బరికించి చింతాక్రాంతుఁడయి క్రిందఁ బడుటయు నామె పొడగాంచెను. ఆలేఖ యెవ్వరి కెవ్వరువ్రాసిరో యామె గ్రహింపలేకపోయెఁ గాని తజ్జనిత



దుఃఖావేశంబుననే యతండు క్రిందఁబడెనని మాత్రమునిస్సందేహముగాఁ దెలిసికొనెను. అనపోతు నేలంబడిన యాక్షణంబుననే విషయంబంత యుగ్రహించి ధీశాలినియైన యాదాసి ముందునకుఁ బోవంజూచెనుగాని కొంతసేపోహాటించి యట్లేనిలుచుండెను. పది పదునైదు నిముసంబులు గడచెను. అనపోతు క్రిందఁబడియుండియే లేఖను జేతఁబట్టుకొని యేమో విలపించుచుండుట యాతని హస్తవిక్షేపంబులవలన నామె యించుక గ్రహించి వెనుకనుండిపోయి యభ్యర్ణతరుచ్ఛాయనాఁగి తద్వృక్షమూలంబున కశ్వంబునుగట్టివైచి యందే నిలువంబడి చక్షుశ్శ్రోత్రద్వయంబునకుఁదప్ప దక్కుంగల యింద్రియంబులకు జ్ఞానంబులేకుండ సునిశితమైన యవధానంబున వీరుం డాడుప్రతివాక్యంబును వినుచుండెను. ఆసమయంబున నయ్యోధవరుం డిట్లాడుచుండెను.

"దైవమా! బ్రాహ్మణ జన్మ మేల నన్నెత్తించితివి? చతుర్థకులంబున నేనుదయించిన యెడల నేఁడు నాయందు రూపెత్తి యున్నధైర్యశౌర్యపరాక్రమానలంబునకుఁ దగిన యింధనంబులు దొరకెడివిగదా. నేఁ డాసుగుణపుంజంబులనే హృదయసంతాపదహనుని కింధనంబులుగాఁ జేయవలసి వచ్చినది. ఎంతఘోరము? ఎంత దుర్దైవసంఘటనము! తానొకటిఁ దలఁచిన దైవ మొక్కటిఁ దలఁచునని విబుధు లనుటలో సత్య మిమిడియున్నది. ఏగడియ వైశ్యతరుణియయిన యన్నమ్మనోట భగవంతుం డట్లదృష్టవశంబున దుర్భాషలఁ బలికించెనో, యప్పుడే రాజాజ్ఞాసంతక్షుభ్యమానమనస్కుండనైన నేను బాలచంద్రుని హృదయోద్వేగంబుఁజూచి బడలు వడిన యుద్ధాపేక్షాకాంతను గొంత సేదఁదేర్చి సంతోషసౌధంబుఁ బ్రాకించితిని. అట్లు ముమ్మరించిన యుద్ధానందసముద్రంబు వెనుకకు లాగినది. కడువిచిత్రము! (కొంచెము సేపుండి) ఔరా! బాలచంద్రా! ఎంతపనిఁ జేసితివి! చిన్నటనాఁటనుండియు నీతో నాదర్శప్రాయమైన చెల్మిఁజేసి యొక్కకంచంబునఁ దప్ప

మిగిలిన యన్నికర్జంబులు నీకుఁదోడుగా నొనర్చి శరీరంబులు భిన్నంబులయినను బ్రాణంబొక్కటిగా మెలంగియుండు నాకు నెక్కడయాఁడుదాని ప్రేమంబును జూఱకొనుటకై నీవెంతటి సాహసకార్యంబొనరించితివి! ఇంతటి మహాదుఃఖంబు బ్రాహ్మణునికిఁ గావించిన నీ వాసమవర్తియెదుట నేమని ప్రత్యుత్తరంబీయఁగలవు? ఆఁడుదానిని సంతోషపెట్టుటకా యిట్టి ఘోరతాపంబును నాకుఁగల్పించితివి? ఆహా! కాముకు లెంతటిపనినైనఁ జేయఁగలరు. ఈకుతంత్రంబంతయు మునుముందుగాఁ బన్నియుంటచేతనే కాఁబోలు మాంచాల వస్తువిచయనావసరంబున నుండవలసినంత తొందర మొగంబునఁ జూపింప లేకపోయెను. ఆమె ననినఁ బ్రయోజనమేమి? బాలచంద్రా! నీకాయాలోచనంబున్న నింత యేల జరుగును? ఆమె కాకోరిక కోరకింపఁగానే త్రుంపివేసియుందువు. ఆమెకోరిక ననుసరించియేకాక నీకుంగూడ నట్టి కార్యంబే యవశ్యాచరణీయంబని తోఁచి యుండుటఁగూడ స్పష్టీకరించినావు. ఇదంతయు భార్యావశ్యబుద్ధియని నేను నిందింతు నను నూహచే దానింగప్పిపుచ్చినావు గానివేఱుగాదు. ఆహా! ఎంతటిమాయావివి! ఎంతకాపట్యభూయిష్ఠహృదయుండవు! నినుఁ జూచిన మహాపాతకంబులు వొడమును. (తనలో) "శాంతమ్ పాపమ్" ఔరా! జ్యేష్ఠునిపై నిట్టి కోపంబుఁ జూపుట బ్రాహ్మణలక్షణము గాదు. ద్రౌపదీమానాపహరణకాలంబున ధార్తరాష్ట్రసభామధ్యంబున నన్నగారియాజ్ఞయను శృంఖలంబున బద్ధుండై కోపాగ్నివిస్ఫులింగంబులతో దుర్నిరీక్ష్యుఁడైయున్న భీమసేనునిపగిది నేను యుద్ధోత్సాహవేగంబును, బగఱపైఁ గల క్రోధావేశంబును దిగమ్రింగికొనఁ బ్రయత్నించుచున్నాను. కాని సర్వవేదియు మహాధీమంతుండును క్షత్రియుండును నయిన యావృకోదరుండు కోపంబడఁచుకొనియెఁ గాని బ్రాహ్మణుఁడనైనను నీసమయంబున నాకుఁగల యుద్ధావేశంబు నుపసంహరింపలేక



ఈకారణం బెట్టులుండినను రిపుజయసూచనలు దట్టంబుగా నాకుమాత్రమే కాక తమ మంత్రిణికిని గోచరించినట్లు నేటియుదయము నుండి యామెకన్పఱచు కార్యాచరణమాంద్యము స్పష్టీభూతమొనర్చుచున్నది. కావున నాలస్యంబునకుఁ దావియ్యక వారు మనపటాలంబులం జొరఁబడుటకుఁ బూర్వమే వారిని మంచిమాట యొనర్చికొని యెవరియిండ్లకువారేగి సుఖంబుండుట లోకశ్రేయోదాయకమని విధేయతతో మనవిఁ జేసికొనుచున్నాను. పిమ్మట దేవరవారి చిత్త"మని విన్నపం బొనర్చి యాజ్ఞఁబొంది తనపటకుటీరంబునకుంజనియెను.

ఆత్మహితుండును లోకోపకారియు మహాబుద్ధిమంతుఁడును యోధకేసరియు నయిన కోటకేతుం డీభంగి వచించినవెనుక నదివఱకే స్వశక్తిపరశక్తివిమర్శనముం జేసిన నలగామభూపేంద్రుండు మనోగతాలోచనపరంపరలం దేలుచుండెను. అంతకు మున్నే సైనికనివహంబులం జూడఁబోయి యించుక సన్నగిల్లిన చుఱుకుఁదనంబును విశదీకరించుమొగంబుతోఁ దిరిగివచ్చిన నాయకురాలాతనిసన్నిధిం జేరి మంచిచెడ్డల మాటాడ నుపక్రమించెను. లోలోనఁ గార్యనిర్వహణమాంద్యంబు వృద్ధిఁజెందుచున్నను నప్పులవాండ్ర కెగవేయ నుంకించుచుఁ బైకి దర్పంబున సంచరించుమలీమసవణిక్ఛ్రీఖామణివలె నామె మర్నుమిన్నుగానక తిరుగుచుండినను రాజు స్వశక్తిపరశక్తులం గూర్చిప్రసంగించుచుఁగోటకేతునియూహానుగూడ నామెచెవివేసెను. నాయకురాలు దమబలంబు బ్రహ్మనాయుని బలంబుకంటెఁ గొంతన్యూనతరంబనిసమ్మతించెనుగాని బొందిలో నుండుప్రాణంబు లురవడితో దాఁటుచున్నను ధైర్యంబుఁ గఱపువెజ్జుభంగి నామె రాజునకు ధైర్యభిక్షఁ బెట్టుటకుఁ గడంగెను. కాని యామాటలు రాజేంద్రునికి నచ్చక పొందుసేతకు దిగుట తమకును లోకంబునకును శుభదాయకం బనిచెప్ప లోలోపల నిష్టమున్నను జెంబోతుగాంభీర్యంబులఁ జూపునట్టి యారండ తుదకు

బహుప్రయత్నంబులమీఁదఁ దలయూఁచి వివేకియుఁ బరమశాంతుం డును నయినకోటకేతుండే పొందుకూర్పునకుఁ దగినదిట్టయని యాతనిఁ బ్రస్తుతించెను. నలగామభూపుండును మాఱుమాటాడక యాతనిఁ బిలిపించి తత్కార్యభారంబు వహింపుమని యొప్పించి ప్రతిపక్షకుటీర సీమాభ్యంతరంబునకుం బంపెను.

మఱుసటిదినంబు రేపకడనే కయ్యంపుదయ్యంబును రెండుకక్షుల వారు నారాధింప సమకట్టియుండుటచేఁ గడసారి యామధ్యాహ్నంబు నుండి యుద్ధశాస్త్రవిశారదులును, సైనికప్రతినిధులును, రాజ్యాంగ జ్ఞానాబ్ధిపారంగతులును, గూఢచారులును, రణపతితచికిత్సాకార్యులగు వైద్యశిఖామణులును, బ్రహ్మన, కన్నమ మొదలగుమహాయోధులును జేరియుండ మలిదేవమహీపతి యొకమహాసభఁ గావించి తన్మధ్యంబున నాసీనుఁడై యుండి యుద్ధనిర్వహణంబుఁ గూర్చి పర్యాలోచించుచుం డెను. ఆయుదయంబుననే రణరంగంబునఁ బాల్గొనుటకై సోదరసహితుండై వచ్చిచేరిన బాలచంద్రుండు బ్రహ్మనచేతను మలిదేవునిచేతను వేవితంబుల నిందాపాత్రుఁడైనను విశేషముగా మాటాడక బోనం బొనర్చినప్పటినుండియు వ్యాకులచిత్తంబుతోడనే యాలోచనా మగ్నుండై యుండుటచే నతండుమాత్రము సభారంగంబునకు రాలేదు.

ప్రొద్దు మెల్లమెల్లఁగా దిగుచుండెను. సూర్యునితీక్ష్ణరుచులు సన్నఁగిల్ల ప్రారంభించెను. అయ్యదనున స్వేదాంబుబిందువులు మెయిం జాలువాఱ విచారయుతహృదయంబు వ్యక్తీకరించు నెమ్మొగంబుతో నశ్వావరోహణంబుఁ గావించి రక్తసిక్తంబయిన యజ్ఞోపవీతంబుఁ జేసేత ధరించి మాడచి బాలునికుటీరంబుం బ్రవేశించెను.

అంతట బాలుం డనూహ్యంబైన యామెయాగమనంబును విభ్రాంతితోఁ జూచి మేడపిలోని యోగక్షేమంబులఁ గూర్చి మునుముందు ప్రశ్నింప నామె యాతని యెదుటికిఁబోయి స్థాణువుగా నిలువంబడి



యజ్ఞోపవీతంబు నందిచ్చి కన్నీటికాల్వలఁ గొనగోట విక్షేపించుచుం డెను. బాలచంద్రుండును దత్సోదరబృందంబును నాశ్చర్యంబును మించినయవధానంబుతోఁ బ్రశ్నలపైఁ బ్రశ్నలఁ గురిపింప మాడచి చింతాకలుషితమైన యీ రెలుంగుతో సర్వంబు నివేదించెను.

తత్క్షణంబ ఝంఝామారుతంబుచే భూపతనంబునొందు భూజంబులకరణి బాలచంద్రుండును దత్సోదరులును నేలంబడి మూర్ఛిల్లిరి. అందఱును సభారంగంబుననుండుటచే నామె యొక్కతెయే యాసుకుమారు ననునయింపవలసివచ్చెను. మాడచియొక్క యుపచారంబులతోఁ గొంతసేపటికి మైఁదెలిసి యాసింహకిశోరం బపరిమితదుఃఖాస్పద హృదయాందోళనంబును బాష్పవిప్రుట్పరంపరలచేతను గద్గదికాస్వరం బుచేతను వెలిఁగ్రక్కుచు, నేమియుందోఁపక మాటిమాటికి యజ్ఞోపవీతంబుఁ గన్నుల కద్దుకొనుచు, సంసారమోహాంబుధిలోఁ బడిఘూర్ణిల్లు నపండితునివితంబున దుఃఖాభోగంబునఁ బడి పొర్లాడుచుండెను. అనపోతంపినయంత్యవాక్యంబులలోనియర్థంబును మదికిం దెచ్చుకొనుటచేఁ గలుగునుత్సాహం బనుచంద్రరేఖ మఱలఁ దత్స్వల్పవాంఛాజనిత దుఃఖాంబుదపంక్తిచేఁ బ్రచ్ఛన్నంబగుచుండెను.

ఇట్లుండ నెండవేఁడిమిడింది నాల్గుగంటలు దాఁటుచుండెను. పిమ్మట విచారంబును మ్రింగికొని బాలచంద్రుండు మఱల నామెను స్త్రీజనసంరక్షణార్థంబు వీరమేడపికే పొమ్మని యాజ్ఞాపించి పంపివేసెను.

ఇంతలో హృదయోత్పన్నమయిన కోపానలంబుచేతను నాత్రం బుచేతను నొడలిపై వేడిచెమ్మటకాల్వలు ప్రవహించుచుండ వాయు జవంబున సుంకరరాముం డనుయోధవరుండు వచ్చి బాలచంద్రునిం జూచి, నలగాముండును నాయకురాలును బంపఁగాఁ గోటకేతుండు దౌత్యభారంబు వహించివచ్చి యిర్వురును నీరక్షీరంబులభాతి నుం డుట లోకంబునకు క్షేమంకరమనియు—మఱియు నేమేమో తియ్యని

షాడిమాటలఁజెప్పి మలిదేవుని, బ్రహ్మానను, గండుకన్నమను, నాపల వారినిఁ, గొండ్లవిందులవారిని, గోవిందువారిని, ముతసానివారిని, నర్మాల వారిని, బైడిచుక్కలవారిని సమ్మతింపఁజేసెననియు తేఁబ్రాయంబున నున్న వెలమనాయఁడు, పెదమలిసీఁడు, పినమలిసీఁడు, గోపినాయఁడు, సంపెటనారన్న, తాను మొదలగుయువకుల కయ్యాది మహాసంతాప కారణంబుగానుండెననియు వాక్రుచ్చెను. అంతఁగోపోద్రిక్తనయనుండై బాలచంద్రుండు రక్తయజ్ఞోపవీతంబునుగూడఁ దీసికొని బిరబిర సభా మధ్యంబునకు సాఁగిపోయికూర్చుండి వినుచుండెను. ఆపైని గొంతసేపు యినవెనుక శరీరంబంతయు దుఃఖకోపంబులచేఁ గంపించుచుండఁ బ్రభు వునకును సభకును నమస్కరించి "మహాశయులారా! పిన్నవాఁడ నని త్రోసిపుచ్చక నామనవిని గొంతవడి యాలింపవలె నని సభాసదుల నందఱఁ గేల్మోడ్పులతోఁ బ్రార్థించుచున్నాను. మంచిచెడ్డల నారయు నెడఁ జిన్నపెద్ద లనువిషయం బవిచారణీయంబు. మీలోఁగొందఱ మనఃకేదారంబులందలి దృఢాభిప్రాయంబు లనుమొక్కలకు నాయీ చెప్పుమాట తెవులుగాఁ బరిణమింపవచ్చును. అక్కారణంబున నన్ను దూషింపఁజనదు. ఈసందర్భంబున నాయభిప్రాయంబులు నేను విశదీక రించుట తప్పుగాదు. ధార్తరాష్ట్ర సభామధ్యంబున దుర్యోధనాదులకు నీతిగఱపునట్టివికర్ణునివలెను బితరునియెదుట హరిగుణకీర్తనంబుఁగావించు ప్రహ్లాదునివలెను నేను మీయందఱసమక్షంబున నిల్వఁబడి మిక్కిలి సాహసముతో మీ రీరాయబారి 'మధుర' వచనంబు లాకర్ణింపవల దని ప్రబోధించుచున్నాను. నేఁటియుదయంబువఱకు జాజ్వల్యమానమై యుండిన యుష్మదుత్సాహానలంబునకుఁ గోటకేతుని రాయబారంపుఁ బలుకులు రసయుక్తకాష్ఠంబు లయినవిగాని నిజ మాలోచించినయెడ మాబోంట్లకుఁగొందఱ కవి శుష్కేంధనంబులయి దాని నుద్దీపింపఁ జేయుచున్నవి. వీరపుంగవులారా! నామాటలు మీకుఁ బరిహాసాస్ప



దములుగా నుండునేమో కాని మిమ్ములఁజూచిన నాకు యథార్థం బుగా జాలికలుగుచున్నది. ఇన్నిదినంబులనుండియు నవిచ్ఛిన్నయత్నం బులతో సర్వంబును నాయితంబొనరించి యింతదూరము కదలివచ్చి టిందులకేనా? లోకంబునఁ గించిత్తైన నభిమానముండు నెవ్వండైన నిట్టిపొందునకుఁ దలయూఁచి స్వబుద్ధికాంతయొక్క వంధ్యాత్వంబును వెల్లడింపనెంచునా? నేఁటికాలంబున మనయాంధ్రభూమిలోఁ బేరు ప్రతిష్ఠలకుఁ బెట్టినపేరయినపల్నాటివారే యిట్టికూర్పునకు దోసి లొగ్గుట యెంతకొఱమాలినపనియో యించుక యోచించినచోఁ దేట పడును. మాటజాణతనంబున మించునీకోటకేతునిం బంపి సంధికి లొంగింపఁజూచునట్టి నాయకురాలు మఱల నేమిదుష్కృత్యంబుఁ గావింప నియ్యది పూనెనో యెవ్వ రెఱుఁగుదురు? నేఁడు కోటకేతుండు వచ్చి పూర్వదోషంబు లెవ్వరియందున్నను నిప్పుడు పెల్లగింపఁ దగినవి కావనియు నికముందు శర్కరాక్షీరంబులవలె రెండు పక్షంబులు గూడియుండుట వాంఛనీయమని నలగామునికిం దోఁచె ననియుఁ జెప్పి పైఁగా నలుగురాజుతోడి మాతండ్రికింగల స్నేహభావం బును బురస్కరించుకొని మాటలాడుచుండుట మన వారల సద్భావం బును జూఱకొనుటకేగాని వేఱుగాదు. నిజంబుగా నట్లువారు చూఱకొ న్నచో నది మనబుద్ధులలోఁ దింతటిదని స్పష్టీకరించుట సత్యంబని విశ్వ సింపుఁడు. దూరాలోచనంబిప్పు డావశ్యకంబని గ్రహింపుఁడు. పూర్వ విరచితదుష్కృత్యేంధనంబులచే మండిపోవుచున్న యుష్మత్క్రోధాగ్ని నెట్లు చల్లార్పఁగలరు? "జరిగినదేమో జరిగినది — ముందిక మంచిగా నుండ"మని యేమేమో కల్లబొల్లిపలుకులఁ బలికి మకర బాష్పంబులఁ (Crocodile tears) గార్చినచో సత్యంబనినమ్మి దరహాస చంద్రికలఁగురియుట మీవంటి పురుషపుంగవులకుఁదగవా? ప్రస్తు తము సంధి కుపక్రమించినచో నాయకురాలు తస్కరనివహంబును

బంపి దోఁపింపనెంచుటయు — 'దేశాంతరంబునుఁ జేరినను మనల వదలక పశువ్రజంబును దోలుకొని పోవ భిల్లులం బంపుటయు — నింకనెన్నియో కావించిన యట్టియకార్యపరంపరనుగూర్చి ముందుగా నిందుఁ జేరిన రాజన్యసమూహంబునకుఁ దెలుపుడుసేసి యారండచే క్షమాపణంబుఁ గోరఁజేసి యలరాజుచావునకు వగవంజేసి యాపైనివారు మనవిషయమై మునుముందు ప్రవర్తింపవలసినవిధులను నిరూపించి — పిమ్మట మనము కరుణార్ద్రహృదయులమై సంధికొప్పుట సమంజసంబగునుగాని చేతి కాటవస్తువునిచ్చి పసిబిడ్డను బుజ్జగించుటవలె వారు మనల నీదృగ్వాక్యంబులచే వశ్యులంజేసికొనుట మనకవమానకరంబుగాదని యిందెవ్వరైన వాఁదెఱచి వక్కాణింప సాహసింపఁగలరా? యోధవరులారా? లెండు, యుద్ధంబునకు లెండు. నడుముల బిగించుఁడు. కార్యదీక్షాపరులుగండు. పల్నాటి మగతనంబును విజృంభింపఁజేయుఁడు. మంచితనంబున రాయబారంబు సలుపఁబోయిన మనయలరాజును నాయకురాలు నరసింగును బంపి మాయోపాయంబునఁ బొలిపుచ్చి మననిస్సహాయత్వంబు లోకంబునకు వెల్లడించినను మనకింకను నభిమానం బుదయింపకుండుట మిగుల గర్హ్యము. మీహృదయంబులు వజ్రములైయుండవలయు. లేకున్న మానవప్రకృతి నీదుష్కృత్యంబు చలింపఁజేయకుండునా? అదియెంతయమానుషకార్యమో యితరులకు గోచరించుచున్నదిగాని మీకింకను గోచరింపకుండుట శోచనీయము. (కోపముతో) మనమెట్లుచచ్చిననేమి! తనయేకాత్మజుని మనకొఱకై పంపి చంపించుకొనిన యీకొమ్మరాజు హృదయానలంబుఁ జల్లార్పుటకైనఁ బ్రయత్నింతురా, లేదా? లేనిచోఁ దదీయహత్యాపాతకంబు మిమ్ముంజుట్టుకొని యెన్నిజన్మాలకైన విడువక బాధించునని రూఢిగా నమ్ముఁడు.'

పైపెచ్చు దుష్కార్యాచరణంబునకు వెనుదీయక నిరంతరముఁ బరాపకారభోజనంబుచేఁ దన్వింజెందు నీనాయకురాలు సర్పాదిక్రూర



జంతువులవలె జీవించియుండుట లోకంబునకు శ్రేయోదాయకము గాదని — నిన్నసాయంతనము కొండొకకారణంబుచే నావలననే ప్రాణత్యాగంబుఁ గావించుకొన్న నాయపరప్రాణంబు, నాయనుంగు సోదరుఁడు నాయనపోతు నాకంత్యసందేశంబుఁ బంపుచుఁ దద్విషయంబును మీకుం గూడ నొక్కిచెప్పుటకై తనకుమాఱుగాఁ దన యీయజ్ఞోపవీతం బంపినాఁడు. ఇంతదూరంబు వచ్చినవెనుక నీకపటసంధిని విశ్వసించి యుద్ధంబుపట్ల నిట్లుపేక్షవహించుట పాడిగాదు. మీపౌరుషంబు చల్లఁబడినయెడల నేనొక్కండనేపోయి తుదివఱకు నేనొనర్చినప్రతిజ్ఞను బరిపాలించుటకై కదనక్షోణిం దుమికి నరసింగునుబట్టి శిరశ్ఛేదంబుఁ గావించి వలసినచోఁ బ్రాణంబులఁ గూడఁ బాసి పల్నాటిపౌరుషంబుపట్ల భారతీయులనెల్లర నాశ్చర్యనిమగ్నులం గావించెద" నని చెప్పి యొక్కెడం గూర్చుండెను.

అంతదనుకఁ గోటకేతుని మధుకలితవాక్యంబులఁ గర్ణపుటంబులం గ్రోలి వివశులై సంధికివల్లెయని తలయూఁచుచుండిన గండుకన్నమ, నర్మాలవారు, ముతసానివారు మొదలగు యోధాగ్రేసరులందఱు బాలచంద్రునివినినమీఁదట నాత్మనిశ్చయంబు ప్రమాదజనితంబని యెఱింగిరి. మున్నొకప్పు డిసుకగోనెలనెత్తించుకొని గురిజాలకేగి నలగామమంత్రిణులచే నిందావాక్యంబులంబడి యేర్చుచున్న హృదయంబుతోవచ్చి యెన్నఁటికేని బగఁదీర్చుకొనఁ గృతనిశ్చయుఁడైయుండి యలరాజుమరణప్రవృత్తి చెవింబడినమీఁదట ఘోరసమరంబుఁ గావించిన యాశూర వృషభసందు, కనుకులకన్నమ బాలచంద్రుండాసీనుఁడైన మఱునిముసంబునవే చివ్వనలేచి పూర్వవక్తయొక్క యభిప్రాయంబు నెక్కుడుగా బలపఱచెను. అటమీఁద సంపెటనారన్న, కొమ్మరాజు మొదలగువీరులెందఱో బాలచంద్రునితో నేకీభవించి తక్కటివారింగూడఁ దమపక్షంబునకుం ద్రిప్పివైచి కరుణామూర్తులయిన బ్రహ్మనమలిదేవుల

హృదయాభిప్రాయంబులంగూడఁ బరివర్తనంబుఁ గావించిరి. సభారంగంబున నలువైపుల సంతోషధ్వానంబులు మిన్నుముట్టెను. అంతట బ్రహ్మనాయు మలిదేవుండును బహుజనాభిప్రాయంబుఁ దృణీకరించనివారగుటచేఁ గోటకేతునికి సభాభిప్రాయంబుఁ దెలిపి సమరంబు సాగక తప్పదని వినయంబున నలగామునికి నివేదింపుమని విచారంబుతోఁ బలికి యర్హగౌరవంబులొసంగి సాగనంపిరి.

---

## పదియవ యధ్యాయము.

అతివాక్చాతురీమహిమాన్వితుండయిన కోటకేతుండు పోయినను సంధికాకపోయెఁగదా యని నలగాముండెంతయు డిల్లపడినమనస్సుతో నాయకురాలితోడను దదితరరాజన్యబృందంబులతోడను నారాత్రి ప్రొద్దుపోవువఱకు సంప్రతించి కొందఱు మొండిగ ధైర్యంబుఁ గొలుప మఱునాఁటియుదయకాలంబున యుద్ధారంభమగునని ప్రకటింపించెను.

ఆరాత్రి యామత్రయంబు కడచనెను. నాలవజాము ప్రారంభింపఁగానే ప్రతిదినంబును వైదికకర్మనిష్ఠాగరిష్ఠులగు బ్రాహ్మణోత్తములు మేల్కొనుటకై మేల్కొలుపుఁబాటలు వాడుచు, నానాఁడు కార్యంపూడిలోని తామ్రచూడంబులన్నియుఁ — బూర్వము సత్యనిరతులును దృఢప్రతిజ్ఞులునయిన బ్రహ్మదులను నాయకురాలు దమ్ము వ్యాజంబుగాఁగొని దేశాంతరగతులం జేసియుండుటచే నీర్ష్యాకోపంబులు వెలిఁబుచ్చుచున్నవోయన్నట్లొకసారికి రెండుసారులు బిగ్గఱగా మొఱసెను. పక్షిసంతానంబులు నీడంబులలోని తమబిడ్డలను విడచి సంసారసంతతుణార్థము వెలుపలికింబోవుచు నొకదాని నొకటి మధురరుతంబులంబిలుచుచు నాకసంబున సంచారంబుఁగావింపఁదొడఁగెను.



ఈకారణం బెట్టులుండినను రిపుజయసూచనలు దట్టంబుగా నాకుమాత్రమేకాక తమ మంత్రిణికిని గోచరించినట్లు నేఁటియుదయము నుండి యామెకన్పడుచు కార్యాచరణమాంద్యము స్పష్టీభూత మొనర్చుచున్నది. కావున నాలస్యంబునకుఁ దావియ్యక వారు మనపటాలంబులం జొరఁబడుటకుఁ బూర్వమే వారిని మంచిమాట యొనర్చికొని యెవరియిండ్లకువారేగి సుఖంబుండుట లోకశ్రేయోదాయకమని విధేయతతో మనవిఁజేసికొనుచున్నాను. పిమ్మట దేవరవారి చిత్త"మని విన్నపం బొనర్చి యాజ్ఞఁబొంది తనపటకుటీరంబునకుంజనియెను.

ఆత్మహితుండును లోకోపకారియు మహాబుద్ధిమంతుఁడును యోధకేసరియు నయిన కోటకేతుం డీభంగి వచించిన వెనుక నదివఱకే స్వశక్తిపరశక్తివిమర్శనముంజేసిన నలగామభూపేంద్రుండు మనోగతాలోచనపరంపరలం దేలుచుండెను. అంతకు మున్నే సైనికనివహంబులం జూడఁబోయి యించుక సన్నగిల్లిన చుఱుకుఁదనంబును విశదీకరించుమొగంబుతోఁ దిరిగివచ్చిన నాయకురాలాతనిసన్నిధిం జేరి మంచిచెడ్డల మాటాడ నుపక్రమించెను. లోలోనఁ గార్యనిర్వహణమాంద్యంబు వృద్ధిఁజెందుచున్నను నప్పులవాండ్రఁ దెగవేయ నుంకించుచుఁ బైకి దర్పంబున సంచరించుమలీమసవణిక్ఛిఖామణివలె నామె మన్ను మిన్నుగానక తిరుగుచుండినను రాజు స్వశక్తి పరశక్తులం గూర్చి ప్రసంగించుచుఁ గోటకేతునియూహనుగూడ నామెచెవివేసెను. నాయకురాలు దమబలంబు బ్రహ్మనాయుని బలంబుకంటెఁ గొంతన్యూనతరంబని సమ్మతించెనుగాని బొందిలో నుండుప్రాణంబు లురవడితో దాఁటుచున్నను ధైర్యంబుఁ గఱపువెజ్జుభంగి నామె రాజునకు ధైర్యభిక్షఁ బెట్టుటకుఁ గడంగెను. కాని యామాటలు రాజేంద్రునికి నచ్చక పొందుసేఁతకు దిగుట తమకును లోకంబునకును శుభదాయకం బనిచెప్ప లోలోపల నిష్టమున్నను జెంబోతుగాంభీర్యంబులఁ జూపునట్టి యారండ తుదకు

బహుప్రయత్నంబులమీఁదఁ దలయూఁచి వివేకియుఁ బరమశాంతుండును నయినకోటకేతుండే పొందుకూర్పునకుఁ దగినదిట్టయని యాతనిఁ బ్రస్తుతించెను. నలగామభూపుండును మాఱుమాటాడక యాతనిఁ బిలిపించి తత్కార్యభారంబు వహింపుమని యొప్పించి ప్రతిపక్షకుటీరసీమాభ్యంతరంబునకుం బంపెను.

మఱుసటిదినంబు రేపకడనే కయ్యంపుదయ్యంబును రెండుకక్షులవారు నారాధింప సమకట్టియుండుటచేఁ గడసారి యామధ్యాహ్నంబునుండి యుద్ధశాస్త్రవిశారదులును, సైనికప్రతినిధులును, రాజ్యాంగజ్ఞానాబ్ధిపారంగతులును, గూఢచారులును, రణపతితచికిత్సాకార్యులగు వైద్యశిఖామణులును, బ్రహ్మన, కన్నమ మొదలగుమహాయోధులును జేరియుండ మలిదేవమహీపతి యొకమహాసభఁ గావించి తన్మధ్యంబున నాసీనుఁడై యుండి యుద్ధనిర్వహణంబుఁగూర్చి పర్యాలోచించుచుండెను. ఆయుదయంబుననే రణరంగంబునఁ బాల్గొనుటకై సోదరసహితుండై వచ్చిచేరిన బాలచంద్రుండు బ్రహ్మనచేతను మలిదేవుచేతను వేవితంబుల నిందాపాత్రుఁడైనను విశేషముగా మాటాడక బోనం బొనర్చినప్పటినుండియు వ్యాకులచిత్తంబుతోడనే యాలోచనామగ్నుండై యుండుటచే నతండుమాత్రము సభారంగంబునకు రాలేదు.

ప్రొద్దు మెలమెల్లఁగా దిగుచుండెను. సూర్యునితీక్ష్ణరుచులు సన్నఁగిల్ల బ్రారంభించెను. అయ్యదనున స్వేదాంబుబిందువులు మెయిం జాలువాఱ విచారయుతహృదయంబు వ్యక్తీకరించు నెమ్మొగంబుతో నశ్వావరోహణంబుఁ గావించి రక్తసిక్తంబయిన యజ్ఞోపవీతంబుఁ జేసేత ధరించి మాడచి బాలునికుటీరంబుం బ్రవేశించెను.

అంతట బాలుం డనూహ్యంబైన యామెయాగమనంబును విభ్రాంతితోఁ జూచి మేడపిలోని యోగక్షేమంబులఁ గూర్చి మునుముందు ప్రశ్నింప నామె యాతని యెదుటికిఁ బోయి స్థాణువుగా నిలువంబడి



యజ్ఞోపవీతంబు నందిచ్చి కన్నీటికాల్వలఁ గొనగోట విక్షేపించుచుండెను. బాలచంద్రుండును దత్సోదరబృందంబును నాశ్చర్యంబును మించినయవధానంబుతోఁ బ్రశ్నలపైఁ బ్రశ్నలఁ గురిపింప మాడచి చింతాకలుషితమైన యీరెలుంగుతో సర్వంబు నివేదించెను.

తత్క్షణంబ ఝంఝామారుతంబుచే భూపతనంబునొందు భూజంబులక్రియ బాలచంద్రుండును దత్సోదరులును నేలంబడి మూర్ఛిల్లిరి. అందఱును సభారంగంబుననుండుటచే నామె యొక్కతెయే యాసుకుమారు ననునయింపవలసివచ్చెను. మాడచియొక్క యుపచారంబులతోఁ గొంతసేపటికి మైఁదెలిసి యాసింహకిశోరం బపరిమితదుఃఖాస్పదహృదయాందోళనంబును బాష్పవిప్రుట్పరంపరలచేతను గద్గదికాస్వరంబుచేతను వెలిఁగ్రక్కుచు, నేమియుందోఁపక మాటిమాటికి యజ్ఞోపవీతంబుఁ గన్నులకద్దుకొనుచు, సంసారమోహాంబుధిలోఁబడిఘూర్ణిల్లు నపండితునివితంబున దుఃఖాభోగంబునఁబడి పొర్లాడుచుండెను. అనపోతంపినయంత్యవాక్యంబులలోనియర్థంబును మదికిందెచ్చుకొనుటచేఁ గలుగునుత్సాహం బనుచంద్రరేఖ మఱలఁ దత్స్వల్పవాంఛాజనితదుఃఖాంబుదపంక్తిచేఁ బ్రచ్ఛన్నంబగుచుండెను.

ఇట్లుండ నెండవేఁడిమిడింది నాల్గుగంటలు దాఁటుచుండెను. పిమ్మట విచారంబును మ్రింగికొని బాలచంద్రుండు మఱల నామెను స్త్రీజనసంరక్షణార్థంబు వీరమేడపికే పొమ్మని యాజ్ఞాపించి పంపివేసెను.

ఇంతలో హృదయోత్పన్నమయిన కోపానలంబుచేతను నాత్రంబుచేతను నొడలిపై వేడిచెమ్మటకాల్వలు ప్రవహించుచుండ వాయుజవంబున సుంకరరాముం డనుయోధవరుండు వచ్చి బాలచంద్రునిం జూచి, నలగాముండును నాయకురాలును బంపఁగాఁ గోటకేతుండు దౌత్యభారంబు వహించివచ్చి యిర్వురును నీరక్షీరంబులభాతి నుండుట లోకంబునకు క్షేమంకరమనియు— మఱియు నేమేమో తియ్యని

పొడిమాటలఁ జెప్పి మలిదేవుని, బ్రహ్మనను, గండుకన్నమను, నావల
వారినిఁ, గొండ్లవిందులవారిని, గోవిందువారిని, ముతసానివారిని, నర్సాల
వారిని, బైడిచుక్కలవారిని సమ్మతింపఁ జేసెననియు తేఁబ్రాయంబున
నున్న వెలమనాయఁడు, పెదమలిసీఁడు, పినమలిసీఁడు, గోపినాయఁడు,
సంపెటనారన్న, తాను మొదలగుయువకుల కయ్యాది మహాసంతాప
కారణంబుగానుండెననియు వ్రాక్రుచ్చెను. అంతఁగోపోద్రిక్తనయనుండై
బాలచంద్రుండు రక్తయజ్ఞోపవీతంబునుగూడఁ దీసికొని బిరబిర సభా
మధ్యంబునకు సాఁగిపోయికూర్చుండి వినుచుండెను. ఆపైని గొంతసేప
యినవెనుక శరీరంబంతయు దుఃఖకోపంబులచేఁ గంపించుచుండఁ బ్రభు
వునకును సభకును నమస్కరించి "మహాశయులారా! పిన్నవాఁడ నని
త్రోసిపుచ్చక నామనవిని గొంతవడి యాలింపవలె నని సభాసదుల
నందఱఁ గేల్మోడ్పులతోఁ బ్రార్థించుచున్నాను. మంచిచెడ్డల నారయు
నెడఁ జిన్నపెద్ద లనువిషయం బవిచారణీయంబు. మీలోఁగొందఱ
మనఃకేదారంబులందలి దృఢాభిప్రాయంబు లనుమొక్కలకు నాయీ
చెప్పుమాట తెవులుగాఁ బరిణమింపవచ్చును. అకారణంబున నన్ను
దూషింపఁజనదు. ఈసందర్భంబున నాయభిప్రాయంబులు నేను విశదీక
రించుట తప్పుగాదు. ధార్తరాష్ట్రసభామధ్యంబున దుర్యోధనాదులకు
నీతిగఱపునట్టివికర్ణునివలెను బితరునియెదుట హరిగుణకీర్తనంబుఁ గావించు
ప్రహ్లాదునివలెను నేను మీయందఱసమక్షంబున నిల్వఁబడి మిక్కిలి
సాహసముతో మీరీ రాయబారి 'మధుర' వచనంబు లాకర్ణింపవల
దని ప్రబోధించుచున్నాను. నేఁటియుదయంబువఱకు జాజ్వల్యమానమై
యుండిన యుష్మదుత్సాహానలంబునకుఁ గోటకేతుని రాయబారంపుఁ
బలుకులు రసయుక్తకాష్ఠంబు లయినవిగాని నిజ మాలోచించినయెడ
మాబోంట్లకుఁ గొందఱ కవి శుష్కేంధనంబులయి దాని నుద్రేకింపఁ
జేయుచున్నవి. వీరపుంగవులారా! నామాటలు మీకుఁ బరిహాసాస్ప



దములుగా నుండునేమో కాని మిమ్ముఁ జూచిన నాకు యథార్థం
బుగా జాలికలుగుచున్నది. ఇన్నిదినంబులనుండియు నవిచ్ఛిన్నయత్నం
బులతో సర్వంబును నాయితంబొనరించి యింతదూరము కదలివచ్చు
టిందులకేనా? లోకంబునఁ గించిత్తైన నభిమానముండు నెవ్వండైన
నిట్టిపొందునకుఁ దలయూఁచి స్వబుద్ధికాంతయొక్క వంధ్యాత్వంబును
వెల్లడింపనెంచునా? నేఁటికాలంబున మనయాంధ్రభూమిలోఁ బేరు
ప్రతిష్ఠలకుఁ బెట్టినపేరయినపల్నాటివారే యిట్టికూర్పునకు దోసి
లొగ్గుట యెంతకొఱమాలినపనియో యించుక యోచించినచోఁ దేట
పడును. మాటజాణతనంబున మించునీకోటకేతునిం బంపి సంధికి
లొంగింపఁజూచునట్టి నాయకురాలు మఱల నేమిదుష్కృత్యంబుఁ
గావింప నియ్యాది పూనెనో యెవ్వరెఱుంగుదురు? నేఁడు కోటకేతుండు
వచ్చి పూర్వదోషంబు లెవ్వారియందున్నను నిప్పుడు పెల్లగింపఁ
దగినవి కావనియు నికముందు శర్కరాక్షీరంబులవలె రెండు
పక్షంబులు గూడియుండుట వాంఛనీయమని నలగామునికిం దోఁచె
ననియుఁ జెప్పి పైఁగా నలుగురాజుతోఁడి మాతండ్రికిఁగల స్నేహభావం
బును బురస్కరించుకొని మాటలాడుచుండుట మన వారల సద్భావం
బును జూఱకొనుటకేగాని వేఱుగాదు. నిజంబుగా నట్లువారు చూఱకొ
న్నచో నది మనబుద్ధులలోఁ తింతటిదని స్పష్టీకరించుట సత్యంబని విశ్వ
సింపుఁడు. దూరాలోచనంబిప్పు డావశ్యకంబని గ్రహింపుఁడు. పూర్వ
విరచితదుష్కృత్యేంధనంబులచే మండిపోవుచున్న యుష్మత్క్రోధాగ్ని
నెట్లు చల్లార్పఁగలరు? "జరిగినదేమో జరిగినది — ముందిఁక
మంచిగా నుండ"మని యేమేమో కల్లబొల్లిపలుకులఁ బలికి మకర
బాష్పంబులఁ (Crocodile tears) గార్చినచో సత్యంబనినమ్మి దరహాస
చంద్రికలఁ గురియుట మీవంటి పురుషపుంగవులకుఁ దగవా? ప్రస్తు
తము సంధి కుపక్రమించినచో నాయకురాలు తస్కరనివహంబును

బంపి దోఁపింపనెంచుటయు— దేశాంతరంబునుఁ జేరినను మనల వదలక పశువ్రజంబును దోలుకొని పోవ భిల్లులం బంపుటయు — నింకనెన్నియో కావించిన యిట్టియకార్యపరంపరనుగూర్చి ముందుగా నిందుఁ జేరిన రాజన్యసమూహంబునకుఁ దెలుపుడుసేసి యారండచే క్షమాపణంబుఁ గోరఁ జేసి యలరాజుచావునకు వగవం జేసి యాపైనివారు మనవిషయమై మునుముందు ప్రవర్తింపవలసినవిధులను నిరూపించి — పిమ్మట మనము కరుణార్ద్రహృదయులమై సంధికొప్పుట సమంజసంబగునుగాని చేతి కాటవస్తువునిచ్చి పసిబిడ్డను బుజ్జగించుటవలె వారు మనల నీదృగ్వాక్యంబులచే వశ్యులం జేసికొనుట మనకవమానకరంబుగాదని యిందెవ్వరైన వాదెఱచి వక్కాణింప సాహసింపఁగలరా ? యోధవరులారా ? లెండు, యుద్ధంబునకు లెండు. నడుముల బిగించుఁడు. కార్యదీక్షాపరులుగండు. పల్నాటి మగతనంబును విజృంభింపఁజేయుఁడు. మంచితనంబున రాయబారంబు సలుపఁబోయిన మనయలరాజును నాయకురాలు నరసింగును బంపి మాయోపాయంబునఁ బొలివుచ్చి మననిస్సహాయత్వంబు లోకంబునకు వెల్లడించినను మనకింకను నభిమానం బుదయింపకుండుట మిగుల గర్హ్యము. మీహృదయంబులు వజ్రములైయుండవలయు. లేకున్న మానవప్రకృతి నీదుష్కృత్యంబు చలింపఁజేయకుండునా? అదియెంతయమానుషకార్యమో యితరులకు గోచరించుచున్నదిగాని మీకింకను గోచరింపకుండుట శోచనీయము. (కోపముతో) మనమెట్లుచచ్చిననేమి! తనయేకాత్మజుని మనకొఱకై పంపి చంపించుకొనిన యాకొమ్మరాజు హృదయానలంబుఁ జల్లార్పుటకైనఁ బ్రయత్నింతురా, లేదా? లేనిచోఁ దదీయహత్యాపాతకంబు మిమ్ముంజుట్టుకొని యెన్నిజన్మాలకైన విడువక బాధించునని రూఢిగా నమ్ముఁడు.

పైపెచ్చు దుష్కార్యాచరణంబునకు వెనుదీయక నిరంతరముఁ బరాపకారభోజనంబుచేఁ దనివిం జెందు నీనాయకురాలు సర్పాదిక్రూర



జంతువులవలె జీవించియుండుట లోకంబునకు శ్రేయోదాయకము గాదని—నిన్నసాయంతనము కొండొకకారణంబుచే నావలననే ప్రాణత్యాగంబుఁగావించుకొన్న నాయపరప్రాణంబు, నాయనుంగు సోదరుఁడు నాయకపోతు నాకంత్యసందేశంబుఁ బంపుచుఁ దద్విషయంబును మీకుం గూడ నొక్కి చెప్పుటకై తనకుమాఱుగాఁ దన యీయజ్ఞోపవీతం బంపినాఁడు. ఇంతదూరంబు వచ్చినవెనుక నీకపటసంధిని విశ్వసించి యుద్ధంబుపట్ల నిట్లుపేక్షవహించుట పాడిగాదు. మీపౌరుషంబు చల్లఁబడిన యెడల నేనొక్కండనేపోయి యిదివఱకు నేనొనర్చినప్రతిజ్ఞను బరిపాలించుటకై కదనక్షోణిం దుమికి నరసింగునుబట్టి శిరశ్ఛేదంబుఁగావించి వలసినచోఁ బ్రాణంబులఁగూడఁ బాసి పల్నాటిపౌరుషంబుపట్ల భారతీయులనెల్లర నాశ్చర్యనిమగ్నులం గావించెద" నని చెప్పి యొక్కెడం గూర్చుండెను.

అంతదనుకఁ గోటకేతుని మధుకలితవాక్యంబులఁ గర్ణపుటంబులం గ్రోలి వివశులై సంధికివల్లెయని తలయూఁచుచుండిన గండుకన్నమ, నర్మాలవారు, ముతసానివారు మొదలగుయోధాగ్రేసరులందఱు బాలచంద్రునివినినమీఁదట నాత్మనిశ్చయంబు ప్రమాదజనితంబని యెఱింగిరి. మున్నొకప్పుడిసుకగోనెలనెత్తించుకొని గురిజాలకేగి నలగామమంత్రిణులచే నిందావాక్యంబులంబడి యేర్చుచున్న హృదయంబుతో వచ్చి యెన్నఁటికేని బగఁదీర్చుకొనఁ గృతనిశ్చయుఁడైయుండి యలరాజుమరణప్రవృత్తి చెవింబడినమీఁదట ఘోరసమరంబుఁగావించిన యాశూర వృషభసండు, కనుకులకన్నమ బాలచంద్రుండాసీనుఁడైన మఱునిముసంబుననే చివ్వునలేచి పూర్వవక్తయొక్క యభిప్రాయంబు నెక్కుడుగా బలపఱచెను. అటమీఁద సంపెటనారన్న, కొమ్మరాజు మొదలగువీరులెందఱో బాలచంద్రునితో నేకీభవించి తక్కటివారింగూడఁ దమపక్షంబునకుం ద్రిప్పివైచి కరుణామూర్తులయిన బ్రహ్మనమలిదేవుల

హృదయాభిప్రాయంబులం గూడఁ బరివర్తనంబుఁ గావించిరి. సభారంగంబున నలువైపుల సంతోషధ్వానంబులు మిన్నుముట్టెను. అంతట బ్రహ్మనయు మలిదేవుండును బహుజనాభిప్రాయంబు దృఢీకరించనివారగుటచేఁ గోటకేతునికి సభాభిప్రాయంబుఁ దెలిపి సమరంబు సాగక తప్పదని వినయంబున నలగామునికి నివేదింపుమని విచారంబుతోఁ బలికి యర్హగౌరవంబులొసంగి సాగనంపిరి.

---

## పదియవయధ్యాయము.

అతివాక్చాతురీమహిమాన్వితుండయిన కోటకేతుండు పోయినను సంధికాకపోయెఁగదా యని నలగాముండెంతయు డిల్లపడినమనస్సుతో నాయకురాలితోడను దదితరరాజన్యబృందంబులతోడను నారాత్రి ప్రొద్దుపోవుఱకు సంప్రతించి కొందఱు మొండిగ ధైర్యంబుఁ గొలుప మఱునాఁటియుదయకాలంబున యుద్ధారంభమగునని ప్రకటింపించెను.

ఆరాత్రి యామత్రయంబు కడచనెను. నాలవజాము ప్రారంభింపఁగానే ప్రతిదినంబును వైదికకర్మనిష్ఠాగరిష్ఠులగు బ్రాహ్మణోత్తములు మేల్కొనుటకై మేల్కొలుపుఁబాటలు పాడుచు, నానాఁడు కార్యంపూడిలోని తామ్రచూడంబులన్నియుఁ — బూర్వము సత్యవిరతులును దృఢప్రతిజ్ఞులునయిన బ్రహ్మాదులను నాయకురాలు దమ్మువ్యాజంబుగాఁగొని దేశాంతరగతులం జేసియుండుటచే నీర్ష్యాకోపంబులు వెలిఁబుచ్చుచున్నవోయన్నట్లొకసారికి రెండుసారులు బిగ్గఱగా మొఱసెను. పక్షిసంతానంబులు నీడంబులలోని తమబిడ్డలను విడచి సంసారసంరక్షణార్థము వెలుపలికిఁబోవుచు నొకదాని నొకటి మధురరుతంబులం బిలుచుచు నాకసంబున సంచారంబుఁ గావింపఁదొడఁగెను.



సర్వజగత్సృష్టికిఁ గారణభూతుండయిన బ్రహ్మయొక్క యంశంబున నుద్భవించు భగవానునికిఁగూడఁ గర్మంబు దప్పక రాత్రియంతయు గర్భనరకం బనుభవించెనా యను కవిపుంగవుల యుత్ప్రేక్షకుఁ జాలియుండి సూర్యుండు ప్రపంచోన్ముఖుండగు సూచనలు గన్పట్టెను. తల్లియైన పూర్వదిక్కాంత మొగంబు తెలివిం బ్రకాశించెను. అప్పుడే యిట్లు దివ్యతేజంబును బాఱఁజల్లిన యీమహామహుండు ప్రత్యక్షంబయిన వెనుకఁ దనదివ్యరూపంబుఁ జూపునప్పుడింకెట్లు ప్రపంచాహ్లాదకరుండగునో యని దేవతానివహంబులు సూచుచుండ, మఱికొంతసేపటికి దిగ్వనితలు హస్తపల్లవంబులందుఁ గెంపుదాపటపుఁబసిండిపళ్ళెరంబులంగొని నీరాజనంబులతో సిద్ధంబుగానుండిరో యన్నట్లు దూరుపుదెస జేగుఱువర్ణంబున విరాజిల్లుచుండ, లోకబాంధవుం డుదయించెను.

సర్వసన్నాహంబులయిన వెనుక యుద్ధోపక్రమణఘంటానినాదంబు మ్రోఁగెను. ఇరువాగు జనంబులును బరస్పరసంహారాభిలాషులై మైమఱచి ప్రవర్తింపఁదొడంగిరి. విషయలోలునియొక్క సంకల్పవికల్పాత్మకమనస్సుపోలె సైన్యసముద్రంబంతయుఁ గలగుండువడుచుండెను. కనులు భ్రాంతిఁజెందునట్లు విస్మృతశరీరాపేక్షులై సైనికులు శత్రుసైనికులపైఁ గవిసి బాహాబాహికచాకచిం దొడరి పోరసాగిరి. ఏపక్షంబున నెందఱెందఱుగూలుచుండిరో గణింప శక్యంబుగాకుండెను. తమతోడ వచ్చిన స్నేహితులెందుపోయిరో, జీవించియుండిరో నేలంబడిరో యేమియు నెఱుంగక నేలయీనినట్లుండినకాల్వురు సమరసంరంభంబుఁ జూపించుచుండిరి. ప్రథమదినం బుదయకాలంబునఁ బోరుప్రారంభింపఁగానే యోధులందఱు నాత్మబలసమాను లెవ్వరో రెండవపక్షంబునఁ జూచుకొని వారిపై విజృంభించుటకుఁ బ్రయత్నించిరి కాని పన్నఁబడినవ్యూహంబునందు సమర్థతాసమర్థతలఁబట్టి స్థాననిర్దేశం బయియుండుటచేఁ బరస్పరసంఘర్షణంబునకుఁదొందరగా నవకాశము గలుగకపోయెను.

కాల్వురు కాల్వురతోడను నాశ్వికు లాశ్వికులతోడను రథికులు రథికులతోడను దలపడిరి. యుద్ధారణ్యంబున సంరంభానలంబు నలుదెసల నెసరేఁగుచుండెను. కంఠీరవంబులయెదుట సారంగశాబంబులవడువునఁ బేరుగలవాఁడిమగలముందు యుద్ధంబులం దారితేరని యువకులు గన్పడి కాందిశీకు లగుచుండిరి. గండుకన్నమనాయఁడు బ్రహ్మనాయఁడు యోచించి మకరవ్యూహంబుఁగావించి తమబలంబులను యోధమణులను నాయాయెడల నుండఁ నియమించి పోరొనర్చుచుండిరి.

పెనుమాలవారను మలిదేవపక్షయోధు లిర్వురు తమ దుర్జేయంబులయిన సేనాసమూహంబులం గూడఁదీసికొని పోటరులైన యురగసేనరాజపదాతిజనంబులను దచ్ఛిరోభాగంబులందుండి తమ వారికి నీలువు తూలకుండుటకై యార్చుచుండునట్టి తన్ముఖ్యులను నానాస్త్రంబులం బొదివిరి. విరోధిసేనాను లశ్వంబులం దుండియే యుద్ధోత్సాహంబు రూపెత్తునట్లుగాఁ దమమార్గణంబులచేఁ బెనుమాలవీరుల శరపరంపరలనడుమందున్ని పైపెచ్చు నారాచశతంబులం బంపి వారిందఱును నురగసేనసైన్యసముద్రంబునందలి సంతోషతరంగంబు లాకసంబు నంటఁజొచ్చెను.

వేఱొకవంక యుద్ధంబు భయంకరతరమై దుర్నిరీక్ష్యమై యుండెను. మలిదేవయోధశార్దూలంబులలోనొక్కండై తత్పూర్వ మనేక దళంబుల సంగరరంగంబులకు నడపి జయలక్ష్మీపరిష్వంగసుఖానుభవశాలియయిన గోవిందుల బాపినీఁడు స్వతేజఃపుంజంబునకుఁ దన యనీకంబుల మొక్కలంబు బాసటగానుండ నార్చుచుఁ బాఱఁజూచి పరసేనపయిం బాఱఁజూచుచుండెను. ఇంతలో నలగామభూపేంద్రదళంబులోనుండి యాతని తేరికిఁ బిఱుంద శంఖారావంబులచే నంబరంబుఁ బూరించుచు భీమదేవుండను నృపవీరుం డొక్కఁ డుద్ధతితో వచ్చి బాపినాయునిం దాఁకి శితశరంబుల నాతనిం బొదివి నిజబలాతిశయంబుం జూ



పెను. అకుంఠపరాక్రముండని తొల్తఁజూపట్టిన యాభూమిపునిపై బాపినీఁడును బంచవింశతినిశితాస్త్రంబులచేఁ దచ్ఛరంబులఁ దుత్తునియలుగావించి యుక్కుమిగిలి బలంబుల కుత్సాహం బగ్గలింపఁ బగవాని యస్త్రసంధానంబునకుం బూర్వమే ముప్పదినారసంబుల నాతనిం గప్పి తత్కాయంబును బుష్పోల్లసితకింశుకవృక్షంబుకరణిఁ గావించి పొగడ్తలం బొందెను. సాయకంబులఁ బుంఖానుపుంఖంబుగాఁ బంపుచుండు శత్రువుయొక్క విక్రమధాటికి ముందు కార్ముకయుద్ధంబున నిల్వలేక జంఘభాగంబున విలంబించుచుండు వాలుం గైదువుంగొని బీరంబులు సారించుచుఁ దృణీకారంబునఁ గేరుచు రథావతరణంబుఁగావించి పైపయిం గవిసి భీమదేవుండు భీమంబుగాఁ జేలావుం గాన్పింపఁ జూచెను.

వింటికయ్యంబున కియ్యకొనక కత్తిపోటుంజూప వచ్చిన యారాజవీరుం బరిమార్ప మిక్కిలి సుకరంబని యెఱింగియుఁ గాలపురుషుండు ప్రపంచంబునకు దివారాత్రములవలె బాపినీఁడు దచ్చమూనివహంబుల కాశాంకురంబును దన్నాశంబును బొరింబొరిఁజూపనుద్దేశించి పరిత్యక్తరథుండైనవీరునితో రథస్థుండై యుద్ధంబొనర్చుట లెస్సగాదనుకొని యరదంబుడిగ్గి వినోదార్థంబు కొంతదనుక నాతనితో ఖడ్గహస్తుండై తలపడెను. వెండియు నతఁడు రిపుఖడ్గాభిఘాతంబులు పైకిరాకుండఁ గాచుకొనుచు నిజాయుధంబున నాతనిపైఁ బోటు లించించుక వేయుచుఁ గోపోద్రిక్తనయనుం జేయుచు మగఁటిమి నెక్కించి యొక్కయామంబల్లె క్రీడాయుద్ధంబు నెఱపి చిగురుచ సూర్యభగవానుం డెండవేడిమిం బలెఁ దానును నుద్రేకంబునమించి తీవ్రపౌరుషప్రాగల్భ్యంబు విస్తరింపఁ బాణిద్వయంబున ఖడ్గతోమరంబులఁ దాల్చి యార్భటితో శత్రువునకు శ్వాసావరోధంబుఁగావించెనా యనునంతటి నిరంతరతీక్ష్ణయుద్ధంబున నాతనిశరీరంబుఁ జెండివైచి రణరంగవిహరమాణభూతపిశాచయూథంబులకుఁ గూడువెట్టి జయజయశబ్దంబులతో వెలింగెను.

ఇట్లు ప్రథమదినోదయంబు కడచనెను. యుద్ధవిరామఘంటికానాదంబు చెవింబడఁగానే మొగ్గరంబు విడిచి యెవ్వారి శిబిరంబులకు వారు వోయి స్నానభోజనాదికృత్యంబులం దీర్చికొని యించుక సేపు విశ్రమించిరి.

మధ్యాహ్నానంతరంబునఁ గయ్యంబు మఱల సాఁగింపఁగానే యపూర్వమైన బీభత్సరసం బెల్లెడలఁ బొడఁగట్టెను. నలగామహితబృందంబులో నెక్కుడై, శక్తికొలంది సరదారులం గూర్చికొని వచ్చిన కోలంకి వీరాస్వామి బాహాబలంబున నసమానుండని పేర్వడిన ముతసానిపిచ్చిరెడ్డి సైన్యంబును మార్కొని యాతనిం బదునేను భల్లంబులఁ గప్పెను. కాని హస్తిమస్తకంబున వ్రాలి ఝుంకరించు నీఁగల మొత్తంబుల వలెనుండు నాయములఁగుల నాతండు లక్ష్యపెట్టక మందహాసంబుగావించుచుండఁ బొన్నాళ్ల రామానాయఁడు వీరాస్వామికి బాసటగా వచ్చి బాణసంధానంబుఁ గావింపఁగానే దూరంబుననుండి చూచి "అరరే! పిచ్చిరెడ్డి కెంతటియవస్థ ప్రాప్తించె"నని రోసంబు కోఱమీసంబుల నర్తించుచుండ నర్మాలకోటిలింగము వచ్చి రామానాయునిం దాఁకెను. ఘటికాద్వయాతిక్రమణానంతరంబునఁ బరస్పరశరఘాతంబులచే రెడ్డినాయుళ్లిర్వురును ముక్కున నూర్పులేక నేల కొఱగిరి. తత్సైన్యంబులు పటాపంచలయ్యెను.

వేఱొక్కెడఁ బైడిమక్కల ముత్యాలు మగఁటిమి కోర్వలేక పొదిలె పాపన్న వెన్నుం జూపుచుండ వానికి ధైర్యోద్బోధంబుఁ గావించుటకై నరసింగు సమీపించి మాటాడి యిర్వురును మరలివచ్చి ముత్యాలు పయింబడ నాతండెంతయో శ్రమంపడి చేబల్మిచే నాఁపం జూచెను గాని సాధ్యంబుగాక భూమిపై వ్రాలి బ్రహ్మాన ఛాత్రవర్గంబులోఁ జేరిన వాఁడగుటచే నాతండు చతుర్భుజుని, శంఖచక్రశార్ఙధనురాద్యాయుధంబులచే విరాజిల్లు వైకుంఠేశ్వరుని దలంచుకొని మానసికయజ్ఞంబునఁ బ్రాణాహుతుల హోమంబుఁ గావించి పరమపదమైన విష్ణుసాన్నిధ్యంబుఁ జేరెను.



వేఱొండుతావున మొగ్గరమునందుమికి పాలపర్తి వీరానాయుఁడు బ్రహ్మానం దలంచుకొని గురుభావంబున నమస్కరించి బాహాదండంబున ఛురికాదండంబును గిరగిరం ద్రిప్పుచు రిపుసైన్యాంబుధి నిట్లే ఘూర్ణింపం జేసెదనని యెగ్గెత్తి చాటుచుండఁగాఁ బూర్వవైరంబేదియో యంతఃకరణంబును రాపాడుచుండ దహనశిఖాకలాపంబుల మ్రింగుటకై వచ్చు శలభంబుమాద్రిఁ గారెంపూడి కనకరాజు కల్వగుంట కాశీపతిం గూడఁ జేదోడుగాఁ దీసికొనివచ్చి శత్రువుం దలపడెను. అంత నణుమాత్రంబు గొంకులేక క్రుధాపరికలితంబయిన యపహాసరసంబుఁ జిందించుచు నాయుఁడా వీరద్వయంబుపైఁ దోమరంబుల నిర్వది నాటించి తద్భుజాగర్వంబు నిర్విశేషంబుగఁ ద్రుంచి శోణితధారలఁ గ్రక్కించి నేలం గూల్చి యింకను దర్పంబునఁ బోరాడఁ జూచు తదనీకంబు పైకిం బోయెను.

అందు సైన్యంబులకుఁ బిఱుంద మోహరంబు ముఖంబునఁ జంద్రగిరీశ్వరుండును, ధరణికోటయేలికయును గ్రమంబునఁ బినమలిదేవుని తోడను వెలమనాయనితోడను గలబడి తొలుదొల్త నేసేసి పదేసి కాండంబుల గుప్పించి క్రమక్రమంబునఁ గ్రోధంబు తలమిగుల నిషుపంక్తుల గాటంబుగ నాటనేయుచుండిరి. పినమలిదేవుఁడును వెలమనాయఁడును వారిర్వురిని దృణసమానులుగాఁ జూచుచుఁ గొంతకాలంబు దాఁటువఱకు నిర్లక్ష్యంబుగాఁ బోరి తుదకు మూర్తిమత్క్రోధులై వారిర్వురును నారాజవృషభుల కంకటంబుల నుచ్చిపోవునట్లుగా నేఁబది శితశరంబుల నాటి వారిని రథంబులపై సొమ్మసిల్లునట్లు చేసి యరదంబుల మరలనిచ్చి తద్బలసముద్రక్షోభంబునకై కడంగిరి. ఇంతలోఁ బ్రచండిమంబుఁ జూపుచుఁ బ్రయాణంబొనర్చి తుదకుఁ బరిశ్రాంతుఁడైన చండాంశుఁడు స్నానాదికృత్యంబులచే సేదదీర్చుకొనుటకై పశ్చిమదిగ్వార్ధిం జేరుచుండ నట్లే యిరుదెగల మగలును బోరుసాలించి శిబిరంబులకుఁ బోయిరి.

మఱునాఁడు వేఁగువేళనేలేచి దళంబులన్నియు రణభూమికిఁ జూపుమేరలోఁ గాన్పించు నాగులేటికడం గాల్యంబులఁ దీర్చికొనివచ్చి శిబిరంబులం దుదయభోజనంబులఁగావించిరి. అటమీఁద నిర్ణీతకాలంబునకు మఱల నాహవభూమిం దుమికి యానాఁటితోడనే కయ్యం బంతమొందవలెనని రెండుతెగలవారును నవార్యశౌర్యపటుత్వంబుఁజూపి పోరాడుచుండ నెల్లెడలసైనికులు పీనుంగుపెంటలై రక్తప్రవాహంబులం దేరలాడుచుండిరి.

నలగాముని యాశ్వికదళంబులందును బోరుఘోరంబై చూపట్టెను. ఆజానుబాహుఁడును నాకర్ణాంతవిశాలనేత్రుండును నగు బాలచంద్రుఁడు కోడెతనంపుమిసిమితో దృఢగాత్రసౌష్ఠవంబు సొంపారుచుండఁ గొనఱ్ఱవేల గొనబుమీసంబుఁద్రిప్పుచు వైరిహృదయంబులఁ దాసంబును రోసంబును నుద్గమింపఁజేయుచు లేఁగలమందలో నాఁబోతు పగిదిఁ బగవారియాశ్వికులలో దూఱెను. పౌరుషమూర్తియయిన బాలుండు కరవాలంబు ఝుళిపించుచు వారిలోనికిఁ గుప్పించు నప్పు డశ్వంబులును నాశ్వికులును యుద్ధారంభమునకుముందే చీకాకులయిరి. త్రొక్కుడుచేఁ గొందఱు నుగ్గునూచమైరి. భయంబుచేఁ గొందఱు భ్రష్టాయుధులైరి. మఱియుం గొందఱు "స్వామీ! అన్యాయపరిపాలనదుర్యశస్సంపాదినియయిన యానాయకురాలిపక్షంబునవచ్చి తప్పొనర్చితిమి. క్షమింపుం"డని నేలంబడి ప్రార్థించుచుండిరా యనునట్లు సంభ్రమంబున నాతని సాంబ్రాణి ముంగాళ్ళకడంబడి చిట్టుదిరుగుచు నించుక సేపులో నిహతులగుచుండిరి. అంతఁ బంకిలపల్వలంబునుండి వెడలు సూకరంబుమాద్రిఁ గలగుండువడినదళంబుమధ్యంబునుండి ముఖచ్ఛాయతో నేకీభవించిన మీసంబుచెల్వు పిన్నలకు భయాపాదకమైయుండ మాడుగుల వీరారెడ్డి యనుగండరగండఁడు దీవ్యన్మండలాగ్రం బొండు దాల్చి నిమేషంబులోవచ్చి శత్రుజనంబుల స్వసైన్యంబుతోఁగూడి ముట్టికసిమసంగఁ బ్రారంభించెను. ఇట్లుండ నెచ్చటినుండియో పినమలిదేవుండు వీరారెడ్డింజూచి మాడుగులజోదుముం దాత్మపక్షదళంబులు విచ్చిపాఱునేమోయని తలంచి తానుగూడవచ్చి వానిం దలపడెను. బాలుం డింకను రెడ్డిందాఁకుటకుముందే మలిదేవుండు పయింబడుటచే వీరారెడ్డి మంచిసమయంబు దొరకినదని యుబ్బుచుఁ దూపులపయిం దూపులఁబొదివి బాలుండు హాహాకారంబులతో సంచలింప మల్దేవునినిర్వీర్యుం జేసి శిరంబు మండలాగ్రంబునఁ ద్రెళ్ళనేసెను.



బాలచంద్రుని బలంబులలో నప్పుడుదయించిన విచారకోపసంరంభంబు వర్ణనాతీతమైయుండెను. అదికార్యరూపంబుఁ దాల్ప మొదలిడెను. బ్రహ్మాత్మజుని యపారదుఃఖోపగతహృదయవార్ధియందుఁ గోపబడబానలం బంతర్లీనమైయుండెను. పోటుమగలకుఁ జూడామణియైన యాజోదు, పినమలిదేవపతనంబుచేఁ గలిగిన సంతసంబున మొగతిరిగిపోవుచున్న మాడుగులనాయకుని నెగ్గెత్తిపిలిచి మార్కొని ముప్పదియేను దోమరంబులఁ దద్దేహంబును రక్తప్లుతంబుగావించి పగఱపోటుల నొక్కుమ్మడివమ్మొనర్చుచు మధ్యందినమార్తాండునివలె మండిపడుచు నాతనిఘోటకంబుల మున్ముందు గాయంబొనర్చి యనంతరంబున నాజోదువీర్యంబును గుండీభూతముగావించి దారుణనారాచంబులచేఁ బిలుకుమార్చి విగతజీవుండయిన పినమలిదేవుని యాత్మను దృప్తిపఱచెను.

రణరంగమధ్యప్రదేశంబుననుండు సైన్యం బనుసముద్రంబునందలి సంకులారావం బనునీటి"హోరు"నకుఁ దోడు కయ్యంపుటేట్లుఱయను ఝుంఝామారుతంబును శరపరంపరా వర్షాసారంబును గలిసి యొక్కగాలివానవడువునఁజూపట్టి బలహీనరథనౌకావళిని సంభ్రమింపఁజేయుచుండెను.

అంతటఁ జింతపల్లి రెడ్డిని సుంకరరాముం డనువీరుండు బాలచంద్రునియొక్క రజకసోదరునితోఁ గలిసి తలపడియె. కొండొకపట్టున రెడ్డికిఁ బాటవంబు సన్నగిలుచుండుటచే నాతండు పెడమొగంబు వెట్టి యరదంబుఁ ద్రిప్పుమని రథచోదకుని కాజ్ఞాపించెను. తేరుపిఱుదివియఁగానే రాముండూరకొనక సైన్యంబుతో వానినెయిదుచుండ నింతలోఁ గులాభిమానంబుఁ బురస్కరించుకొని కొదమగుండ్ల నర్సారెడ్డియను నాయకురాలి ప్రియస్నేహితుండొక్కం డడ్డంబుగావచ్చి తాఁకెను. ఈయుద్ధచేష్టలన్నియు దూరంబునుండి యొకకంటఁ గనిపెట్టుచు దళంబులఁజించి చెండాడుచు వచ్చుచుండిన పెదమలినీఁడు చింతపల్లి రెడ్డిం బోనీక సప్తమార్గణంబుల వానింబొరివుచ్చెను. సుంకరరాముండు, స్వకార్యవిఘాతంబుగావించిన నర్సారెడ్డింజూచి బొమలుముడివైచి క్రోధానలధూమాంకురంబులు బహిర్గతములై పుంజీభూతములై వచ్చెనాయన్నట్లు సంరంభంబున శిరోవేష్టనం బూడుటచేఁ జెదరిన ముడివెండ్రుకలు మొత్తంబులుగాఁ బయింబయింబడుచుండ నీడఃబోవనిశౌర్యంబున వానితో మూఁడుగడియలు పోరుసలిపి రణదేవత నాశ్రయించియున్న మృత్యుదేవత కతనిఁగాన్కగా నొసంగెను.

ఒండెడఁ బినమలినీఁడు కటకాధిపతిని, సంపెటనారన్నగుండఁము కోట మాణిక్యమును, నావాల నాయఁడు నలగొండ బాపన్నను జుట్టుముట్టి వారిమువ్వురిని బొరిమార్చి యొకచెంప మూఁకఁ జెండుచుండు కంసాలి చందు బాలచంద్రులయొక్క యభినందనంబులం గ్రహించిరి.

ఇంకను నెందఱెందఱో మలిదేవపక్షంబునందలి యోధులు నలగామసైన్యంబున నమోఘపరాక్రమంబునఁ బోరాడుచుండిరి. నలగామపక్షంబునందు జోగులెందఱో మడిసిరికాని సంఖ్యాబహుళంబులయిన పదాతులును, గొండతాశ్వికులును మిగిలియుండిరి. ఝట్టి నరసింగలు కోటకేతుండు, గొండమన్నెమురాజు మొదలగు (తక్కువడిన) వారును



నలగామనరేంద్రుండును, నాయకురాలును శౌర్యోద్బోధకవచనంబులఁ బల్కుచు స్వజనంబుల నరవాయిఁ గొననీయక విపక్షబలంబుల మార్కొనుచుండిరి. బ్రహ్మనాయనివంక నేకొలఁదిమందియోతప్పఁ దక్కంగలయుద్ధవీరు లందఱు సజీవులై యుండి పోరాడుచుండినను నిసుకపాతరవలె నెంతకు నంతంబుకన్పడని నాయకురాలిమూఁకలఁ దున్మాడుట యిందఱకును దుస్సాధ్యంబుగాఁ జూపట్టెను. అంతట యుద్ధవిరామఘంట వినంబడఁగానే యెవరిశాలలకు వారు పోయిరి.

పూర్వము కౌరవసేనలలో నర్జునునివలె సంఖ్యాబాహుళ్యంబున నపూర్వదృష్టంబయిన రిపుదళం బనుమహాటవింబడి బ్రహ్మనదవానలుండేర్చుచు ఖేచరులకు నమందాశ్చర్యంబులం గొల్పుచుండెను. ద్వితీయదినమధ్యాహ్నంబునం గావించుకయ్యంబు తప్పక జయాపజయనిర్ణాయకంబగునని యిరుతెగలవారును లోలోన నూహించిరి.

యుద్ధారంభఘంటారావంబు వినంబడఁగానే వీరును వారును మఱలఁ దారసిల్లిరి. నాయకురాలివైపున నామమాత్రయోధు లింకను బ్రత్యర్థిసైన్యంబునందుకంటె నెందఱోయున్నను మాఁడుగుల వీరారెడ్డి మొదలగు వాఁడిమగ లందఱు దారుణంబయిన ప్రవిదారణంబునఁ బ్రాణంబు లర్పించియుండుటచే ధైర్యంబించుక తొల్తన బడలువడినను నామె పదపడి దానిని నిల్వరించికొని యనుపమానవిక్రమంబున శత్రుసేనలంబడి వారిని మట్టాడుచుండెను.

పినమలిదేవుండు యుద్ధభూమిం దెగుటచే బ్రహ్మనలందఱుఁ గన్నీరుగార్చి తజ్జనితమహాకోపసంరంభం బుత్సాహంబు నినుమడింప యోధులలో నొక్కరొక్క రాత్మబలాధిక్యప్రదర్శనబుద్ధితోఁ బాలి కలనిందుమికి బ్రహ్మానందానుభవంబున నుండు ముక్తులవిధంబున వారొడలు తెలియకుండ శత్రుసైన్యంబులంబడి వారిని మట్టి మల్లాడుచుండిరి.

ఆనాఁటియుద్ధంబు మిక్కిలి తీవ్రరూపంబుఁదాల్చి యుద్ధదేవతా భయంకరస్వరూపం బందఱకుఁ గన్నులకుఁ గట్టునట్లుచేసెను.

ఒకమూలనుండి వివిధాయుధధారులయిన బ్రహ్మనయుఁ గనుకుల కన్నమయయు మూఁకల నేలంగూల్చుచు వచ్చుచుండఁ గొంతసేపటికి నొక్కప్రదేశంబున నాయకురాలి సరదారు లిర్వురు బ్రహ్మనాయుని సోదరులయిన పేరినాయని సూరినాయని మార్కొని తత్ప్రేషితాస్త్రంబుల నెల్లఁ గనుపుగొట్టుచుండ బాహాబలాసమానుండయిన నాయఁడు ప్రళయరుద్రాకారంబుఁ దాల్చి వారిందాఁకి నలువది నిశితసాయకంబులచేఁ దద్ఘోటకంబులఁ దున్మాడి యావీరుల నొకతెప్పపాటులోఁ బ్రాణావశిష్టులంజేసి నేలం బడనేసెను. పదపడి నాయనిం దుదముట్టింప వారిర్వురిసైన్యంబు సముద్రంపుఁబొంగువలె నుబికివచ్చుచుండుటఁ గాంచి కనుకులకన్నమయుఁ గొమ్మరాజు నిరువైపుల దానినినిల్పి నాయఁడు మందహాసంబుతో నాలోకించుచుండ వారు ఖడ్గయుద్ధంబునను బాణయుద్ధంబునను నందఱఁ దుడిచిపెట్టుచుండిరి.

బ్రహ్మనాయఁడు దూరంబుననుండు సైన్యసమేతుండయిన నలగామభూపతింజూచి మలిదేవక్ష్మానాథునికిం గనుసన్నఁజేసి తానుమాత్ర ముసుళ్ళమొత్తంబులవలె వచ్చు నాయకురాలి దళంబుల నకుంఠవిక్రమంబున మున్నుపార్థుండు బాణాసారంబు సవ్యాపసవ్యంబుగాఁ బంపినట్లు కోదండముక్తంబులయిన పటుమార్గణంబుల నానాదిశలకుం బంపుచు రణకేళీవిలాససముజ్జృంభణంబు నెఱపుచు దిక్కులు భయనినాదంబులచేఁ బిక్కటిల్లఁ జేయుచుండెను. ఆనాఁడు గాండీవియుద్ధంబు గనులారఁగాంచకపోయినను నాఁటికయ్యంబునందలి బీభత్సంబుఁ బరికించినవారు తత్సామ్యంబు నూహించుచుండిరి.

ఇట్లాహవభూమియంతయుఁ గోలాహలంబుతో నిండియుండ నాయకురాలు పురుషసింహుఁడైన బ్రహ్మనాయనియరదంబు సమీ



పించి నిప్పులఁగ్రక్కుచుఁ దొమ్మిదినారసంబుల నాతనింబొదువఁ గోపతమఃపటలంబున దరహాసమణికాంతి నింత ప్రకాశింపఁజేయుచు నాతండు స్త్రీతోడి యుద్ధంబున కియ్యకొనమిం దెల్ప నఖండపౌరుషసమంచితయయిన యామె తన్నుఁబురుషపుంగవునిగా భావింపుమనియు నేడేనొకఛలంబున మొగతిరిగిపోవుట యపజయచిహ్నంబనియు నని పలుకుములుకుల నాయంబులంబొడిచెను. అంతటఁ బుట్టినదిమొదలు పరాజయశబ్దంబు విననియాజోదు కోపసంతోషంబులు వెలిఁబుచ్చి మువ్వేడు నారసంబులం బరగించి పురుషవేషధారిణియయిన యామె కత్తళం బుచ్చిపోవునట్లు గాటనేసెను. దాని కరవాయిఁగొనక యామె యిర్వది దారుణశరంబుల శత్రువుం బొదువఁజూచెను గాని వాని నాతండు మధ్యనేత్రుంప నొక్క క్షణంబులో దోషభయావిష్టుని యొడలం గాఱు చెమ్మటరీతిఁ దచ్ఛరీరంబునందంతట నెత్తురువెల్లువలు గాఱ నారంభించెను. ఆమె యెంతపురుషవేషధారిణి యయినను హృదయము భీరుహృదయంబగుటచే ధైర్యంబు నిల్వరింపలేక చయ్యన నరదంబుఁ ద్రిప్పి పలాయనంబొందెను. కరుణాళుండయిన బ్రహ్మన యామెనెయిదక మఱొక్కనిపైకింబోయెను.

నరసింగుంజంపఁ గృతప్రతిజ్ఞావచనుండయిన బాలచంద్రుండంతట రోదసీకుహరంబు ప్రతిధ్వనింప నార్చుచుఁ గెడసినగుఱ్ఱపుదడంబులమధ్యనుండి తేరు దోలించుకొని నరసింగును దూరంబునఁ జూచి యాతనిపయికింబోవ నుంకించెను. బాణముక్తశరంబువలె తివ్వన వచ్చుచుండు బాలచంద్రునీక్షించి శ్రమం బడంచుకొని వచ్చిననాగాంబ యాతని కడ్డంబుదగిలి తీక్ష్ణసాయకంబుల నేయమొదలిడెను. అప్పుడు బాలుండామెను వేభంగులందెగడి బాణప్రయోగంబు పుంఖానుపుంఖంబుగాఁ గావించుచు నూపిరాడనీనియుద్ధపాండిత్యంబుఁజూపి, యామె సిడంబును మణిశిరోవేష్టనంబును బట్టుదప్పించి, పార్శ్వంబులం దలపడు

చుండు తద్దళంబులయందుఁగూడ నొక్కమాఁటే చిత్రవధవిహారంబు నెఱపుచు గగనంబుననుండి విలోకించుదేవతానివహంబుల కభిమన్యు సాదృశ్యంబుఁ గొలుపుచు వివిధయోధపదాతిరథికాశ్వికులను నారం డనుగూడ నఖండచండకాండకాండంబులచేఁ గాయంబుఁ బుండొనర్చుచుండ బాలుని "శతావధాని" యని చూచువారెల్లరు నగ్గింప సాఁగిరి.

ఇట్లొక్కగడియ యమానుషసంగ్రామశౌర్యంబుఁ బ్రదర్శింప ఝుట్టిరాజు వచ్చి యామెను వెనుకకుం దీసికొనిపోయెను. నలగామ భూపతికి విషమాలోచనంబులం జెప్పి యింతకుం దెచ్చిన నాయకురాలిని వెంటఁబడుటకై బాలుండు యత్నించెను గాని మఱలఁ గొండొక ప్రదేశంబున నరసింగు పొడగట్టుటచే సమాకృష్టమనస్కుండై యతం డటు సాఁగిపోయెను.

అలరాజుమరణంబునకుం గారణభూతుఁడయిన నరసింగుశిరంబుఁ ద్రుంచుటకు బాలుండు సమయంబుఁ గావించి యుండినను నరసింగా శపథంబు నంతగా సరకుఁగొనక యాతఁడు "బాలుండే" కదా యని మొదటినుండియు నసడ్డతో నుండెను. కానిద్వితీయదినయుద్ధంబున బాలానిలుండు ప్రతిపక్షసేనాజనాంబుదపంక్తుల నొక్కుమ్మడిఁ జిందఱవందఱగాఁ బాఱఁదోలుటచూచి నరసింగు భయవిహ్వలచిత్తంబునఁ గలఁగుచుండెను. మిగిలినయోధవరులు శక్తివంచనంబులేకుండఁ బ్రయత్నించి బాలునిబట్టి తచ్ఛిరంబుఁ గరవాలంబున కెరఁజేయవలయునని రహస్యాలోచనలఁ గావించి యాతనిగమనాగమనంబులఁ గాపు వేయుచుండిరి. ఈకారణంబుఁ బురస్కరించుకొనియే మొదట నాయకురాలు బ్రహ్మానాయని భుజాబలానలంబుముందు కొంత కమిలియు నీర్ష్యాక్రోధగ్రస్తయై ప్రతీకారబుద్ధితోఁ దత్పుత్రకుండు 'బాలుఁడే' కదా యని యెల్లిదంబున వానిం దాఁకి కొంతవడి పురంబొనర్చి పిదప నిల్వలేక పాఱిపోయెను.



సంకోజిగణపతి మొదలగు వీరసింహులు సమయపరిపాలనంబుఁ గావింపంబోవు బాలచంద్రునివెన్నంట గమకించిరి. కానియెంత పెనంగి యవక్రవిక్రమక్రమవధవిహారంబుఁ గావించినను చేతులతీట పోని బాలచంద్రుండు వారిని వలదనివారించి యొక్కటియై నరసింగుండు దిక్కున కరదంబుమరల్చెను. అదినలగామరాజేంద్రుండు చూచియావైపులనున్న యోధుల ముప్పుర నొక్కక్షణములో రప్పించి నరసింగునకుఁ బ్రాణభయంబు లేకుండఁ జేయుచుండెను. ఎన్నిప్రయత్నంబులు కావించినను మృత్యుదేవతాపథంబు నిరాతంకముగా నుండుఁగావున నలగామాదులెంత నరసింహరక్షణప్రయత్నంబుఁ గావించినను గానున్నది కాకమానక యుండెను.

బాలచంద్రుండు రథంబును దద్యోధాగ్రేసరుల సమీపంబునకుం దోలించుకొనిపోయి పద్మవ్యూహంబుఁజించు నభిమన్యుని తెఱంగునఁ బయింబయిఁ గవియుచున్న యారథికుల నందఱఁ బీచమడంపఁ దొడఁగెను. సుభద్రాతనయుం డెట్లొక్కటియై పోరాడెనో పెనఁకువలో నెంతమునిఁగి తేలుచున్నను బాహాబలం బిసుమంతయుఁ గ్రుంగనిబాలచంద్రుండును నొంటరిగా సేనారణ్యంబునంబడి ధ్వంసం బొనర్చుచుండెను. కాళ్లుపోయినవారుఁ జేతులు దెగినవారు లెక్కకు మిక్కిలిగాఁ గూలుచుండిరి. రథికులెందఱో చుట్టుమూఁగి భుజాబలంబుఁ బ్రదర్శించుచున్నను, గష్టసమూహంబులమధ్య నింతయుం గలంగనివిజ్ఞానిమాడ్కి బాలుండు ప్రచండవిక్రమపాండిత్యంబుఁ జూపుచు నేవగాత్రము బడలువడకుండి యనీకంబుల గగ్గోలొనర్చుచుండెను.

ఇట్లు ఘటికాద్వయంబు క్రమించినవెనుక నా ధికులలో నించుక పేర్వడినవారు దూట్లువడినశరీరంబులతోఁ గాందిశీకులగుచు, మనోవిచారంబులోనుండియుఁ బైకిఁ బోరాడ నటించుచుండిన నరసింగుం జేరి హ్రదంబునం డాఁగియున్న దుర్యోధనునిఁగూర్చి భీమసేనుం

డాడినట్లు బాలుం డలరాజుమరణవృత్తాంతంబుఁ బురస్కరించుకొని వాని ననేకవిధంబుల నుపాలంభించి యవనతశిరస్కుంజేసెను. ఇట్లు కొంతసేపయినవెనుక యుద్ధోపక్రమణంబుఁ గావించి నానావిధయుద్ధక్రీడలంజరిపి కొనకు సగముచచ్చియున్ననరసింగుని ముప్పదిశితాస్త్రంబులం బొడివి తెప్పిఱిలనీక రథంబుపైఁబడఁజేసి యన్నిదిశలఁబెరిగిన హాహాకారంబులు బ్రహ్మాండకటాహంబు వ్రక్కలింప బాలుండు దక్షిణహస్తంబునఁ బ్రిభలనీనుచున్న ఖడ్గంబెత్తి తచ్ఛిరంబునొక్క త్రుటిలోఁ జిదిమివైచి దానింగొని బ్రహ్మనాయని సమక్షంబునకుంబోయెను. దానిం బొడగాంచిన నలగాముని మనఃఖేదంబు వర్ణింపఁదరముగాదు. అలసి పటకుటీరంబునంబడియున్న నాగమ యీ ఘోరకార్యంబువిని నిటలఘటితభ్రుకుటీతటియై వచ్చి నలగామునిజూచి కన్నీరువెట్టుకొని వాని ననునయింపఁదొడంగెను.

అలుగురాజుకాలంబున మలిదేవులతోఁబాటు నలగామ నరసింహాదులను బెంచిపెద్దవాండ్రుగాఁజూచువారితోఁ బూర్వము సంతోషసౌఖ్యంబు లనుభవించిన బ్రహ్మనాయఁడు నరసింగునితలం బఱికించి పూర్వవైరంబంతయు మఱచి తండ్రిపగిదిఁ గడుంగడుఁ బొక్కెను. యుద్ధసమయంబున నీల్గినవైరింజూచి యిట్లేడ్చుచుండుట లెస్సగాదని గొణుగుకొనుచు బాలచంద్రుండు కనుకులకన్నమం దీసికొని పరిపంథిసేనలపయికింబోయి మఱలఁ బోరు సాఁగించుచుండెను.

యుద్ధభూమియం దొక్కవైపు భేరీపణవనిస్సాణధ్వనులును, ఘోటకంబులహేషలును, గజబృంహితంబులును, బదాతిజనంబుల బొబ్బలును బ్రతిధ్వనించుచుండ నలగామ మలిదేవభూపతులు దలపడి మహాభయంకరంబుగాఁ బోరాడుచుండిరి. మునుముందు మలిదేవుండు మృత్యుదేవతాంశంబు లుద్యోతించు కోదండనిర్ముక్తశరంబులును గోపరసంబుచేఁబొడుగఁబడిన నిందావాక్యంబులును నొక్కపెట్టునఁ బం



పుచు నలగాముని యాయంబులను మనస్సును నొంచుచుండెను. నలగాముని బరామర్శింప పచ్చిన నాయకురాలును న్యాయాన్యాయవిమర్శనంబుఁగావింపక నరసింహభూపతిమరణంబు హృదయోద్రేకంబును రెచ్చఁగొట్టఁ దానును నలగామునికి బాసటయై మలిదేవభూపతిని మార్కొని పురుషపుంగవులకంటె నెక్కుడుగా శితభల్లంబులం బఱపి యాతనిసిడంబును ద్రుంచి మైమఱువును దూట్లువడంజేసెను. అంతమల్లదేవుండు సేనారణ్యంబులోనుండి తనవైపుత్రోవఁజేసికొని వచ్చుచున్న కనుకుల కన్నమదాసుంజూచి ధైర్యంబు వహించి యరదంబునుండి యేడ్తెఅందుమికి పలకయువాలుంగొని "పల్నాటియుద్ధ" మహావృక్షబీజరూపులయిన వారిరువురిపైకింబోవఁ "గన్నమ రానే వచ్చుచున్నాఁ"డని వారువెంబడివెంబడిగా నిర్వది ముప్పది నలువది వాఁడియలుఁగుల వానిపైఁ గురిపించి పడనేసి తత్క్షణంబున రణదేవతకుంబలిఁజేసిరి.

ఎంతనిరాలస్యంబుగ రాఁదలఁచుకొని తేరుసాగించుకొని వచ్చుచున్నను నాశ్వికులును రథికులును నెందఱో మార్గంబు నిరోధించి వేసటంగలిగించుటచే నింతవిలంబనంబుఁ గావించిన కన్నమదాసు మలిదేవుండు నిహతుండగుటంజూచి లోననుబుకుచున్నచింతావీచిని నిల్వారించికొనెను. అటమీఁదఁ గోపరక్తనేత్రంబులతో సమయపరిపాలనకార్యోన్ముఖుండయినదాసు నాయకురాలిని బలంబులచే నలువంకల ముట్టడించి పిఱుతివియనీక నిల్వంబెట్టి కారుకూఁతలంబలికి మొగంబుఁ జిన్నవుచ్చుకొనంజేసెను. అంతట వారిర్వురికిం బేర్చిన కయ్యం బించుక యూహాసాధ్యంబగునేమో కాని వర్ణనసాధ్యంబుగాదని దివినుండిచూచుఖేచరులకుం బొడగట్టెను. ఇట్లుకొంతసేపునాయకురాలితోఁబోరి తుదకుఁ గన్నమ తొంబది చండకాండంబులచే నామెరథాశ్వంబులంగెడపి సారథిందోలి యూహాపోహోపాయవిశారదను మూర్ఛాక్రాంతంజేసి కరపాదంబులం గట్టివైచి పరిపాలితప్రతిజ్ఞావాక్యుండై బ్రహ్మనాయనికడకుం గొని వచ్చుచుండెను.

ఇంతలో ముందుబికివచ్చుచుండిన స్వపక్షానీకంబులం దెల్ల యెడల హాహాకారంబులు మిన్నుముట్టెను. అంతటఁ గన్నమ మఱికొంత ముందునకు నడచి “నాయకురాలిని వదలి బలశాలుర నెందఱనో సమకూర్చుకొని నలగాముండు కుటిలోపాయుండై యొంటిగానుండుటను జూచి బాలచంద్రుని జుట్టుముట్టి పద్మవ్యూహంబున నభిమన్యునిమాడ్కిఁ బదిమందియు బాలునిపై శితశరంబులం బఱపి ఘోరయుద్ధంబుఁ గావించి బలంబులన్నియు మ్రాన్పడిచూచుచుండ వానిం బొలియించి రను” దుర్వార్తను వినెను. అదివినంబడఁగానే నాయకురాలిని బంధించికొని వచ్చుటచేఁ గలసంతోషం బంతయు నొక్కత్రుటిలోఁ గలుషంబు కాఁగా నతండు దుఃఖానలంబుచే మ్రగ్గుచుఁ గొన్నినిమేషంబులకు నాయనికడకు వచ్చెను.

బంధితయయిన నాయకురాలి నరదంబునందే యుంచి కన్నమదాసు దానినుండి యవతరించి నిజపటకుటీరంబున నాప్తజనంబుల మధ్యంబునఁ బుత్రమిత్రమరణంబుచేఁ గలిగిన దుఃఖావేశంబుచేఁ బరితపించుచున్న బ్రహ్మనసమక్షంబునకుం బోయెను. మహాజ్ఞానియై సర్వవిషయంబులు బాహిరంబుగాఁ గాక యంతరింద్రియంబుచే సన్న్యసించి లోకసంగ్రహణార్థము జనకాదులవలె నిష్కామకర్మసంగుఁడై యుండినట్లు పేర్వడసిన బ్రహ్మనాయఁ డావిధంబున వగలం గూరుటఁ జూచిన వారందఱు “దారపుత్రులతో నుండి సంసారనిర్వహణంబుఁ గావించుచున్నంతవఱకుఁ బ్రపంచవిషయంబులపైఁ బఱుగువాఱు నింద్రియంబుల నిరోధించుట శశవిషాణంబును సాధించుట వంటిది; ఆంతరంగికముగా మాత్రమే కాక బాహిరంబుగాఁ గూడ సర్వసంగపరిత్యాగంబుఁ గావించిన ముముక్షువునకే నిర్మమత్వము కొంతవఱకు సాధ్యంబగుఁ గాని తక్కొరులకు దుస్సాధ్యంబనుట నిశ్చయ”మని తలంచుచు నాయని ననునయించుచుండిరి.



బాష్పాంబువులతోఁ గన్నమదాసు కంటఁబడఁగానే నాయండాపురుమని దాసు నాలింగనంబు గావించికొని బాలచంద్రుని యుద్ధనైపుణ్యంబును దొలుత నైతాంబ సంతానంబునకై పడినపలుపాట్లును స్మరించుకొనుచు నేడ్పువఱ్ఱునంబడి యుడ్డుగుడుచుచుండెను. ఆలింగితుండయిన కన్నమయును బసివానివగిది సోదరునిం దలఁచుకొని వెక్కివెక్కి యేడ్చుచుండెను. ఎదుటనున్న వారందఱు ననుక్షణము వారినిర్వురి నూఱడించుచుండిరి.

ఇట్లు రెండుమూఁడు యామంబు లతిక్రమించునప్పటికి బ్రహ్మన దుఃఖం బించుక శాంతివడఁగానే కన్నమ నాయకురాలివృత్తాంతంబు నివేదించెను. అంతట నాయం డపూర్వంబుగా నాయకురాలిపై విరోధభావం బెంతమాత్రముఁ జూపక యామెను రప్పించి బంధవిముక్తం జేసెను. నాయకురాలును రాహుగ్రస్తనిశాకరరేఖ తెఱంగునఁ బ్రకాశంబుఁ గోల్పోయి వినమితశిరస్కయై బ్రహ్మనాయనికి నమస్కారం బొనర్పఁ గృపాసముద్రుం డయినయతం డామె నుచితాసనంబునఁ గూర్చుండ నియమించెను.

ఇంతలో, నాయకురాలు బంధితయై పరాధీనయై యుండుచేఁ గలఁగుండు వడినమనస్సుతో నలగాముండు చాలసేపు పర్యాలోచించి యందఱు వీరస్వర్గంబునకుం జనఁ ద్రిక్కంబడిన యొకరిర్వు రాహుత్తులతో బిరాన బ్రహ్మనాయనిశిబిరంబునకు వచ్చి లోనికిం గబురంపెను.

గురిజాలపృథ్వీశుండు వచ్చినాఁడని ద్వారపాలకుండు లోన నివేదింపఁగానే తొల్లి విచారపరంపరాందోళనంబుననుండిన మనోడ్డోల నాయకురాలు వంటయింటికుం దేలుకాఁగానే యొక్కింత మెల్లగా నూఁగుచుఁ బదిపదునైదునిమిషంబులలో నిశ్శేషంబుగ నాఁగిపోయెను. బాలచంద్రమలిదేవులు రణరంగంబునఁ బడుటచేఁ గసటువడినమనంబులు స్వాధీనయయిన నాగాంబం జూచి భవిష్యద్విధానంబులఁ గూర్చి యాలో

చనలం దేలుచుండి రాజేంద్రాగమనంబునఁ దమ యేకాగ్రతాసంపదను గొంత కొంత చక్షురింద్రియంబులకును బంచిపెట్టుచు మనశ్శాస్త్రజ్ఞుల కప్పుడే హృదయంబులకు విందుపెట్టుచుండెను. బ్రహ్మన సాత్త్వవర్గుండై భూపాలునికిఁ బ్రత్యుత్థానంబొనర్చి వాని నతిగౌరవంబున లోనికిం దెచ్చి యొక్క మణిమయాసనంబున నుపవిష్టుం జేసి సమయోచితప్రశ్నంబుల నడుగుచుఁ దానుం గూర్చుండెను. కర్మసాక్షియయిన సమవర్తి యెదుటఁ బాపికిమాద్రి నలగామునికి బ్రహ్మనాయని సమక్షంబున నోట మాట రాకపోయెను. రెండుమూఁడు నిమిషముల కాలము రాజమంత్రిణులు పరస్పరముఖావలోకనంబులఁ గావించికొని చింతాస్తబ్ధులై మొగంబుల వాంచిరి.

అంతట నకలంకహృదయుండయిన బ్రహ్మన రాజునకుఁ బురోవని నిలిచి యాతనితో నాయకురా లలుగురాజు కాలంబునాఁటినుండియుఁ గావించిన గర్హ్యప్రవర్తనవిధంబుల నొక్కటొక్కటిగా నేర్చి చెప్పుచు వానికిఁదగినట్లు దృష్టాంతంబులఁ జూపఁజొచ్చెను. గంగవరము కట్టుబోతును రప్పించి దురాలోచనంబుఁ గావించి దుష్టోపాయంబులచేఁ గోడి పోరితంబున నోడఁబుచ్చిన విధంబును నతండు విశదీకరించెను. ఆపయి మాచెరలలోని తమసౌధంబు దోపిడియుఁ బశుగ్రహణంబును నొక్కి వక్కాణించుచు నాయఁడు నాయకురాలిని సవినయుండై స్వకార్యంబుల సమర్థించుకొన నెంత బ్రతిమాలినను — నన్యాయం బెప్పటికి న్యాయంబునకు లోకువయగుటచే — నామె నోరెత్తక మిన్నకుండెను. అంతట బ్రహ్మనాయఁడు సత్స్వభావంబుతోనుండి కోపాంకురం బింతయుఁ గన్పఱపక యలరాజుదుర్మరణంబునుగూర్చి చెప్పుచు నరసింగుం బంపి విషాహారంబుఁ బెట్టించి సమయించిన కర్ణకఠోరవిషయము నలగాముని ముందఱ నిదర్శనసహితంబుగా నివేదించు నపుడు నాయకురాలు మాటాడలేదు. మౌన మర్ధాంగీకారమని యను



కొన నవసరము లేకుండ బ్రహ్మనాయండామెను బ్రత్యుత్తరంబునకై ప్రార్థించునప్పు డొప్పుకోలు సూచించుచు శిరఃకంపం బొనర్చెను. దుర్విషయలోలుఁడై యొడలు చెఱచుకొని యంతంబున నేడ్చు ప్రాకృతజనుని భంగి నాయకురాలి దుస్సామర్థ్యంబును విని "అయ్యో! వంచింపఁబడితిఁ గదా"యని నలగాముఁడు పశ్చాత్తప్తుఁడై యామెవైపునుండి మొగంబు నవ్వలకుం ద్రిప్పెను. పరమాత్మయు జీవుండును నొక్కఁడే యనిగ్రహింపనేరక యవిద్యావశ్యుఁడైన పామరుండు కొండొక కాలంబునకు దైవవశంబున సద్గురూపదేశముచే శ్రవణమననంబుల భజించెడు విధంబున నలగాముండును జ్ఞానియైన బ్రహ్మనాయనినుండి చాలదినములుగా భేదభావంబుననుండి, దుర్మంత్రాంగంబున నారి తేఱి చెడు తెన్నులఁ జూపి నమ్మించు నాయకురాలి చేతంజిక్కి మధుపానమత్తునివలెఁ జీకాకువడినను నేఁటికి దృష్టాంతపూర్వకములైన బ్రహ్మనవాక్యంబులచేఁ బ్రబోధితుండై గురుసమానుండయిన నాయనిపాదంబులకు క్షమాపణార్థము నమస్కరించెను. ఇప్పుడు మఱల మనసులుకలియుటచే యెప్పుడో యలుగురాజు సజీవుఁడై యుండినకాలంబునఁ బ్రేమంబున నాలింగనంబు గావించికొన్న బ్రహ్మనాయఁడు నేఁడు మఱల నలగామభూపాలుని నాశ్లేషం బొనర్చునప్పు డచ్చటిచూపఱకు మాత్రమే కాక కాలపురుషునిలీలల వినునట్టి మనకును శరీరంబులు పులకాంకితంబు లగుచున్నవి. పరస్పరసందర్శనంబున భగవద్భక్తులవలె వారిరువురు నానందబాష్పంబులం జార్చిరి.

రాజునకెఱిఁగింపక కొన్నియుఁ గన్మొఱంగి కొన్నియు దుష్కృత్యంబులఁ గావించిన నాయకురాలిం జూచి నలగాముండు దుర్యోధనుని గూర్చి ధృతరాష్ట్రుఁడువలె వెక్కసపడెను. ఆమె యన్నియు నొప్పుకొని క్షమింప వారిపాదంబులపైఁబడెను. ఇంతవఱకు నామె ననూన ప్రేమగౌరవంబులఁ జూచినరాజన్యుఁ డిప్పుడు తనకరవాలంబునఁ

దచ్చిరంబు డొల్లనేయంగమకింప శాంతమూర్తియయిన బ్రహ్మనాయఁ డాతనివారించి తగుబుద్ధులంగఱపి ప్రబుద్ధుంజేసి యామె నేమియు ననక స్నేహభావంబునఁ దత్స్వగ్రామంబగు జిట్టగామాలపాడునకుం బంపి వేసెను.

నాయఁడును నలగామునుడును నీరక్షీరంబులవలెఁ గలయికతో రెండుమూన్నాళ్లుండిరి. ఆపై నలగాముండు యథాపూర్వంబుగ గురిజాలసింహాసనంబునుండి యాత్మమంత్రిత్వసహాయంబున మాచెరలం గూడఁ గలుపుకొని — రాజ్యంబేలవలెనని బ్రహ్మన శాసింప రాజపుంగవుండు వల్లెయని నాయనిని గనుకుల కన్నమను బంధువర్గంబు నెల్లఁ దెచ్చుటకు వీరమేడపికింబంపెను. పిమ్మట మిగిలిన సేనాజన యోధసమూహంబులన్నియు స్వస్థలంబులకు వెడలిపోయెను.

ఇంటికిఁబోయి మైలాంబ మొదలగువారి నూఱడించి కతిపయ దినంబులలో బ్రహ్మనాయఁడు సబంధుమిత్రుండై గురిజాలకువచ్చి మంత్రిపీఠం బలంకరించెను. పిదప రాజైన నలగామునికిఁ జేమాట సాయంబుల నొసంగుచుఁ దీరికగడియలఁ బ్రజలకు నీతిబోధఁ జేయుచు వారి నార్థికసౌఖ్యంబున ముంచిలేవనెత్తుచుఁ బల్నాటి రాజ్యంబును శ్రీరామరాజ్యంబువలె వన్నెవడం జేయుచుండెను.

శ్రీ తిరుపతి వెంకటేశ్వరార్పణ మస్తు.

ఇది శ్రీ తిరుపతివేంకటేశ్వరావ్యాజప్రసాదలబ్ధకవితావిరాజమాన
పంగనామములవంశజననవిధాన లక్ష్మాంబా లక్ష్మీకాంత సూన
రామచంద్రాభిధాన ప్రణీతంబయిన "పల్నాటి యుద్ధంబు"
నందు సర్వంబును
సమాప్తము.

